హిందూధర్మ శాస్త్ర గ్రంథమాల 18.

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

పదియవ సంపుటము

చాగంటి శేషయ్య

హిందూధర్మశాస్త్ర గ్రంథమాల 1౮.

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

పదియావ సంపుటము

రచయిత:

శ్రీ చాగంటి శేషయ్య

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము
కపిలేశ్వరపురం (తూ. గోదావరి)

## ఆంధ్రకవి తరంగిణి ముద్రణమునకు విరాళములొసంగిన

## భాషాభిమానులు.

---

### రాజపోషకులు:

శ్రీ బలుసు బుచ్చిసర్వారాయుడు జమీందారువారు. కపిలేశ్వరపురం కేశనకుర్రు ఎస్టేట్లు, కపిలేశ్వరపురం.

### ప్రధానపోషకులు:

శ్రీ బిక్కిని వెంకటరత్నంగారు, భూస్వామి ఎమ్. ఎల్. ఏ. మాజీమంత్రి, రామచంద్రపురం కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షులు చోడవరము.

### పోషకులు:

శ్రీ బలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురం.
శ్రీ మద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.
శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు భూస్వామి బుచ్చిరెడ్డిపాలెం.
శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారు, జమీందారు వేగాయమ్మపేట.

### సహాయులు:

శ్రీ వేలరాజు వేంకటసుబ్బారావుగారు. భూస్వామి కపిలేశ్వరపురం.
శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణగారు, ప్రొప్రయిటరు: సుజనరంజనీ ప్రింటింగువర్క్సు, రాజమహేంద్రవరం.
శ్రీ ఇట్టికూటి పట్టాభిరామయ్యగారు. వునకర మిల్లియనైటు జమిందారు వెల్ల.
శ్రీ బండారు చినవెంకయ్యఅనే రామకృష్ణయ్యగారు భూస్వామి, వాడపాలెం.
శ్రీ బలుసు వెంకటరామారావుగారి భార్య మాణిక్యంగారు భూస్వామిని, కపిలేశ్వరపురము.
శ్రీ కొరపాటి వెంకట్రాయుడుగారి భార్య శ్రీమతి సత్యవతమ్మగారు భూస్వామిని, కపిలేశ్వరపురము.
శ్రీ కేసాప్రగడ వెంకటరమణ రాజేశ్వరరావుగారు, భూస్వామి అన్నంపల్లి.
శ్రీ పోతాప్రగడ కృష్ణమూర్తిగారు, ప్రొ॥ మాస్టరుహాజ్ ప్రింటర్సు, కాకినాడ.
శ్రీ వాడ్రేవు రత్నేశ్వరరావుగారు, భూస్వామి, పసలపూడి.

10 శ్రీ వెక్కలంటి దొరయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.
11 శ్రీ వెక్కలంటి రామయ్యగారు, భూస్వామి, అసిస్టెంటుయింజనీరు కపిలేశ్వరపురం
12 శ్రీ బుద్ధవరపు మహాదేవుడుగారు, బి. ఎ. బి. ఎల్. వకీలు. రామచంద్రపురం.
13 శ్రీ లక్కరాజు సుబ్బారావు పంతులుగారు, అడ్వకేటు, భూస్వామి, కాకినాడ.
14 శ్రీ ఉప్పులూరి వెంకటరమణమూర్తిగారు, భూస్వామి అడ్వకేటు, కాకినాడ.
15 శ్రీ వెక్కలంటి జగపతిరామయ్యగారు, భూస్వామి, ప్రొప్రయిటరు రైసుమిల్లు, వెదురుమూడి.
16 శ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారు, భూస్వామి గుంటూరు.
17 శ్రీ కె. వెంకయ్యచౌదరిగారు, భూస్వామి డివిజనలు యింజనీరు కాకినాడ.
18 శ్రీ ఏలూరిపాటి నరసింహాసర్వతోముఖయాజులుగారు, భూస్వామి, బిక్కవోలు.
19 శ్రీ తురగా పురుషోత్తం పంతులుగారు, ఎమ్. ఎల్. సి. పలివెల.
20 శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్సు చారిటీసువారు, సత్యలింగవరం కాకినాడ.
21 ,, అయ్యగారి మోహనరావు పంతులుగారు. బి. ఎ. బి. ఎల్. అడ్వకేట్. సీతానగరం, విశాఖపట్టణంజిల్లా.
22 ,, రావుసాహెబ్ పటమట్ట శేషగిరిరావు పంతులుగారు, ప్రొప్రయిటరు, జార్జిప్రెస్, కాకినాడ.
23 ,, వెంటూరు దొరయ్యగారు, కోటిపల్లి.
24 ,, బొప్పన దొరయ్యగారు, కందులపాలెం.
25 ,, వైట్ల వీర్రాజుగారు, కందులపాలెం.
26 ,, తురగా రామచంద్రరావు పంతులుగారు, ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగారు మదరాసు.
27 ,, ఏనుగు తమ్మిరాజుగారు, తాపేశ్వరం.
28 ,, వాడ్రేవు వెంకటప్పారావుగారు, జమీందారు, దానవాయిపేట, రాజమహేంద్రవరము.
29 ,, వాడ్రేవు గోపాలకృష్ణగారు పిఠాపురము.
30 ,, నేమాని వెంకటనారాయణగారు, బి. కామ్. ఇన్‌కమ్‌టాక్సు సాక్షీసరు, కాకినాడ.
31 ,, వందూరి వెంకటనారాయణమూర్తిగారు, పెనుమళ్ళ.
32 ,, దంటు సూర్యారావుగారు మర్చంట్సు, కాకినాడ.
33 ,, గుండపునీడు జానకిరామయ్యగారు, M. A రామచంద్రపురం.
34 ,, మేడవరపు సత్యనారాయణమూర్తిగారు హసన్‌బాదా.
35 ,, బండారు పెదవెర్రయ్యగారు, భూస్వామి వాడపాలెం
36 ,, మాజేటి హనుమంతరావుగారు, మర్చంటు, గుంటూరు.

37 శ్రీ దేశిరాజు రామారావుగారు, మర్చెంటు గుంటూరు.
38 ,, టి. కె. నాగయ్యగారు, మర్చెంటు, గుంటూరు.
39 ,, గోపాలుని వీరరాఘవయ్యగారు B. A. B. L. అడ్వకేటు, President Bar Association గుంటూరు.
40 ,, ఉన్నం వెంకటరామారావుగారు, B. A. B. L. విశాఖపట్టణము
41 ,, బెండపూడి పేర్రాజు పంతులుగారు, M. B. B. S. విశాఖపట్టణము.
42 ,, చీమలపాటి గణేశ్వరరావుగారు, శక్రటరీ ది విశాఖపట్టణం ఎలక్ట్రిక్ సప్లయి కార్పొరేషను లిమిటెడ్ విశాఖపట్టణము.
43 ,, దూర్వాసుల సీతారామమూర్తి గారు B. A. B. L. విశాఖపట్టణము.
44 ,, మాచిరాజు సుబ్బారావుగారు. మేనేజింగు ప్రొప్రయిటరు సిటీహైస్కూలు విశాఖపట్టణము.
45 ,, అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు, విజయవాడ.
46 ,, దాట్ల సత్యనారాయణరాజుగారు, B. A. B. S., L. R. C. A., M. R. C. S. (Eng) M.R.C.P. (Lond) రాజమహేంద్రవరము.
47 ,, ఈదర వేంకట్రావు పంతులుగారు, ఏలూరు.
48 ,, పేర్ల సత్తెయ్య శెట్టిగారు చినవాత్తేరు యస్టేటు, విజయనగరం.
49 ,, రామదాసు ట్రాన్సుపోర్టు, లిమిటెడ్., కాకినాడ.
50 ,, గన్నమని వెంకటసుబ్బారాయడుగారు, కపిలేశ్వరపురము.

## అ భి మా ను లు

1 శ్రీ పైండా వెంకటరమణ బ్రదర్సు, కాకినాడ.
2 శ్రీ డాక్టరు నందివాడ సత్యనారాయణరావుగారు, రామచంద్రపురం.
3 శ్రీమతి చిగురుపాటి అన్నపూర్ణమ్మగారు రామచంద్రపురం.
4 శ్రీ మరివాడ సూర్యనారాయణమూర్తి గారు, కపిలేశ్వరపురం.

# విజ్ఞాపనము

ఆంధ్రలోక మొసంగిన ప్రోత్సాహముచే బదియవ సంపుటమును బ్రకటింపఁగలిగితిని. ఇందుఁ బదునాఱవశతాబ్దియందలి యుత్తరార్ధమున నున్నకవుల చారిత్రములున్నవి. ఈకాలమునందలి కవులింకను గొందఱు కలరు. వారు పదునొకండవ సంపుటమున వచ్చెదరు.

ఈపది సంపుటములలోనుగల కవుల నామముల నకారాది యక్షర క్రమమునఁ జూపుపట్టిక నీసంపుటాంతమునఁ జేర్చితిని.

నేననుకొనినంత శీఘ్రముగఁ బని జరుగకపోవుటకుఁ గారణము ద్రవ్యాభావమే.

ఇతోధికముగ సాహాయ్య మొసంగి నాయుద్యమమును గొనసాగింపుఁడని యాంధ్రుల మరిమరి వేఁడుకొనుచున్నాఁడను.

విజయసంవత్సర
శ్రావణపూర్ణిమ

ఇట్లు
గ్రంథకర్త



# విషయసూచిక




| | | | |
|---|---|---|---|
| 191 | అయ్యలరాజు రామభద్రకవి | ... | 1 |
| 192 | పోలమరాజు | ... | 19 |
| 193 | కంచర్ల అయ్యనకవి | ... | 20 |
| 194 | దోనూరి కోనేరుకవి | ... | 23 |
| 195 | రాయసం గణపయ్య | ... | 34 |
| 196 | రామరాజు రంగపరాజు | ... | 35 |
| 197 | తామరపల్లి శరణమంత్రి | ... | 45 |
| 198 | నందూరి మల్లయకవి | ... | 46 |
| 199 | చెనమల్లు శ్రీగిరన్న | ... | 46 |
| 200 | తెనాలి రామభద్రకవి | ... | 49 |
| 201 | దామెరల వెంగళభూపాలుఁడు | ... | 54 |
| 202 | గౌరనకవి | ... | 59 |
| 203 | చెదలువాడ మల్లయకవి | ... | 60 |
| 204 | ముకుందయోగి | ... | 71 |
| 205 | కాకమాని మూర్తికవి | ... | 73 |
| 206 | ఆముదూరి నరసింహభట్టు | ... | 81 |
| 207 | వటమూలుఁడు | ... | 81 |
| 208 | నూతనకవి సూరన్న | ... | 83 |
| 209 | పాలపర్తి సోమేశ్వరుఁడు | ... | 88 |
| 210 | దామరాజు సోమయ్య | ... | 89 |
| 211 | సిద్ధనప్రెగడ | ... | 91 |
| 212 | రామాప్రెగడ జగన్నాథకవి | ... | 92 |

| | | | |
|---|---|---|---|
| 213 | పింగళి సూరనార్యుఁడు | ... | 97 |
| 214 | రామరాజభూషణుఁడు | ... | 121 |
| 215 | కందుకూరు రుద్రయ్య | ... | 155 |
| 216 | చిత్రకవి అనంతకవి | ... | 168 |
| 217 | తామరపల్లి తిమ్మయ్య | ... | 172 |
| 218 | పరమానందయతి | ... | 178 |
| 219 | తరిగొప్పుల మల్లన్న | ... | 185 |
| 220 | ముమ్మడి మల్లనకవి | ... | 192 |
| 221 | కంభంపాటి నారపామాత్యుఁడు | ... | 197 |
| 222 | యోగానందావధూత | ... | 201 |
| 223 | అఖండ సచ్చిదానందావధూత | ... | 202 |
| 224 | శాంతానందయోగి | ... | 203 |
| 225 | వెణుతుర్ల ఒడ్డెయ్యకవి | ... | 204 |
| 226 | ఎలుగంటి పెద్దనకవి | ... | 213 |
| 227 | జక్కరాజు రామకృష్ణకవి | ... | 215 |
| 228 | అయ్యలరాజు అయ్యలకవి భాస్కరకవి | ... | 220 |
| 229 | అద్దంకి గంగాధరకవి | ... | 225 |
| | కవులనామముల పట్టిక (అక్షరక్రమమున) | ... | 237 |

శ్రీ రా మ చం ద్ర

# ఆంధ్రకవితరంగిణి

## (పదియవ సంపుటము)



## 191 అయ్యలరాజు రామభద్రకవి

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఒంటిమిట్టరఘువీరశతకమును రచియించిన తిప్పయ మనీషికిఁ బ్రపౌత్రుఁడు. పర్వతమంత్రికిఁ బౌత్రుఁడు; అక్కయామాత్యునకుఁ బుత్త్రుఁడు. పరవస్తు ముమ్మడి వరదాచార్యుని శిష్యుఁడు.

ఈతఁడు రచించిన రామాభ్యుదయ గ్రంథాంత గద్యవలనఁబై విషయములు తెలియుచున్నవి. ఆ గద్య యిది.

"ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజతిప్పయ మనీషి, పర్వతాభిధానపౌత్రాక్కయామాత్యపుత్రపరిశీలిత సమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడి వరదాచార్య కటాక్షవీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయంబను మహాప్రబంధంబు"

ఈ గద్యతప్ప కవివృత్తాంతమును దెలుపు పద్యమొక్కటియైనను రామాభ్యుదయమున లేదు. గద్యలో వ్రాసిన "తిప్పయమనీషి పర్వతాభిధానపౌత్ర" అను వాక్యమునకుఁ దిప్పయ మనీషికిఁ బర్వతయ్య సోదరుఁడనియు నతనికీకవి పౌత్రుఁడనియుఁ గొందఱర్థము చెప్పుచున్నారు." ౧. అది కవిసంప్రదాయ విరుద్ధము. సామాన్యముగా నిట్టి స్థలములలో రెండు పేరులను వరుసగా నుపయోగించినప్పుడు మొదటి

౧ శతకకవుల చరిత్రము

వానికి రెండవయాతఁడు కుమారుఁడని భావించుట సంప్రదాయసిద్ధము. తిప్పయకుఁ బర్వతయ్య సోదరుఁడైనచో వారిరువురి నడుమ నాయర్థమును సూచించు పదము నుపయోగించియుండును. తిప్పయామనీషి చారిత్రమున నీయయ్యలరాజు వారినిగూర్చి కొంతవ్రాసియున్నాఁడను. ౨. అది యీసందర్భమునఁ జదువఁదగినది. గద్యలోనున్న వాక్యములకు తిప్పయామనీషి కుమారుఁడు పర్వతయ్య యనియే యర్థము చెప్పవలసి యున్నది.

రామభద్రకవి తనగోత్రమును జెప్పుకొనలేదు. కాని హంస వింశతి కావ్యకర్తయగు నారాయణామాత్యుఁడును, రెప్పానతశాస్త్రమును రచించిన అయ్యల భాస్కరకవులును దమతమ గ్రంథములలోఁ దిప్పనమనీషియు నీరామభద్రకవియుఁ దమ పూర్వులని చెప్పియున్నారు. వారిది కౌండిన్యసగోత్రము. కావున రామభద్రకవికూడ నాగోత్రజుఁడే యని నిశ్చయింపవచ్చును.

ఈకవి నివాసము కడప మండలములోని యొంటిమిట్టయనుట నిశ్చయము.

కవినిబట్టి కవికాలము తెలియదు. తిప్పయమనీషినిబట్టి యిర్వురకును నారాయణకవి ననుసరించి వెనుకకును తరములను లెక్కించి కాలమును నిర్ణయించుటకంటె కృతిపతి నాధారముగాఁ దీసికొని యీతని కాలమును గనుగొనుట సులభము.

ఈమహాకవి తనకావ్యమును గొబ్బూరి నరసరాజను సూర్యవంశ క్షత్రియున కంకితముచేసెను. ఇతఁడు గొబ్బూరి వంశజుఁడు. ఆరవీటివారి దౌహిత్రుఁడు. కవి యీరెండు వంశములనుగూడ రామాభ్యుదయకృత్యాదియందు వర్ణించెను.

శ్రీకొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు రామభద్రకవిని గూర్చి తమ మహమ్మదీయ మహాయుగములో "ఇతఁడు కృష్ణరాయలవారి యనుజ ననుసరించి సకలకథా సారసంగ్రహ మను తెలుఁగు

---

౨ ఆంధ్రకవితరంగిణి సం. ౬ [illegible]

కావ్యమును రచించెను. రాయల మరణానంతర మితఁడు నలుబది యేఁబది సంవత్సరములవఱకు బ్రతికియుండెను. రామాభ్యుదయమను కావ్యమును రచించి రామరాజునకల్లుఁడగు గొబ్బూరి నరసరాజున కంకితమిచ్చెను.

మొదటి కావ్య మంతరసవంతముగా లేదు. కాని యీ రెండవ కావ్యమగు రామాభ్యుదయము మిక్కిలి ప్రౌఢకావ్యము" అని వ్రాసియున్నారు. కృతిపతియైన గొబ్బూరు నరసరాజు అళియరామరాజునకు మేనల్లుఁడే కాని యల్లుఁడు కాఁడు. ఈనరసరాజుభార్య కోనేటి తిమ్మరాజు కూఁతురు రంగమాంబయని రామాభ్యుదయ కృత్యాదియందలి యీక్రిఁది పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. కోనేటితిమ్మభూవిభునికూఁతురు రంగమఁ బుణ్యగొబ్బురీ
శ్రీనరసింహుఁ డాహరి సిరిం బలెఁ బ్రేమవహించి కాంచె స
త్సూనులఁ జెన్నతిమ్మవిభు శూరమణిం బినతిమ్మరాజు సం
ధానిధిఁ గృష్ణధీరు రఘునాథునిఁ బాపనృపాలు రంగపన్. ౨౩

అళియరామరాజు తన తనయను నరసరాజుయొక్క పినతండ్రి కుమారుఁడైన యోబళరాజునకుఁ బరిణయముచేసిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. అల్లుఁడు రామరా జనుఁగుటల్లుడు గొబ్బురి యోబళేశుఁ డా
హల్లకహారిఁ గన్నఘనునల్లుఁడు పోషణబుద్ధిగట్టురా
జల్లుఁడు వింటినేర్పున సమంచిత రూపమునందుఁ జందమా
మల్లుఁడు దేవకీరమణి యల్లుఁడు శత్రుసమిజ్జయంబునన్. ౪౩

ఈయోబళేశుని భార్యపేరేదియో కవి చెప్పలేదు. అళియరామరాజు పెండ్లికానున్న తనకుమార్తె తిరుమలమ్మకుఁ బుణ్యము కొఱకు (శా. శ. ౧౪౬౬ క్రీశ. ౧౫౪౪) క్రోధిసంవత్సరమున ధర్మమొసంగి వ్రాయించిన శాసన మొకటి బళ్లారి మండలమున మగిమావినహళ్లి గ్రామమునందున్నది. ౧. అళియరామరాజునకుఁ దనయ లెండఱో యీతిరుమలమ్మ యెవరిభార్యయో తెలియదు.

రామాభ్యుదయ కృత్యాది పద్యములలోఁ గవి అళియరామ రాజు కుమార్తెను గొబ్బూరి నరసరాజు పరిణయమాడినట్లు చెప్పలేదు. కాని సప్తమాశ్వాసాంతమున—

క. సతతసహాయబరీదా
దితురుష్కాధిప శరణ్య దివ్యాంఘ్రి సము
న్నత కర్ణాటస్థాపన
చతురాళియ రామరాజజామాతృమణీ!

యను పద్యములోఁ గృతిపతియైన నరసరాజు అళియరామ రాజునకల్లుఁడని సంబోధించి యున్నాఁడు. జామాతృశబ్దమును మేన యల్లునకుఁగూడ ననువర్తింప జేసియుండునని తోఁచుచున్నది.

ఈశబ్దమును బట్టియే శ్రీలక్ష్మణరావుపంతులుగారు గొబ్బూరి నరసరాజు; అళియరామరాయల కల్లుఁడని వ్రాసియుందురు.

కృతిపతికిఁ గూఁతునిచ్చిన కోనేటి తిమ్మరాజు అళియరామ రాయలకు సవతి పెదతండ్రి మనుమఁడు. ఈతిమ్మరాజు సోదరుఁడైన రంగపరాజు సాంబోపాఖ్యాన కృతికర్త. ఈతిమ్మరాజు కుమారుఁడగు రామరాజు తెనాలి యన్నయ కృతసుదక్షిణాపరిణయ కృతిభర్త కాశ్ర యదాత. వీరినిగూర్చి తెనాలియన్నయకవి చారిత్రమున వ్రాసియుం టిని. ౨. ఈతిమ్మరాజు రంగపరాజు రామరాజుల కాలములనచ్చట నిచ్చియుంటిని. తిమ్మరాజున కల్లుఁడును రామరాజు సోదరీభర్తయు నగు నీకృతిపతి నరసరాజు కాలము పైకాలమునుబట్టి సులభముగాఁ దెలిసికొనవచ్చును.

అళియరామరాయలకుఁ గోనమ, ఓబమ, లక్కమ, ఇకనొకామె నలువురు తోఁబుట్టువులు ఇందులోఁ గోనమ తనయుఁ డైన సిద్ధిరాజు తిమ్మరాజు పరమయోగి విలాసమను కావ్యమును రచిం చెను. ఓబమ యీకృతిపతియైన గొబ్బూరి నరసరాజునకుఁ దల్లి;

---

౧ A. R. 514 of 1914

౨ ఆంధ్రకవితరంగిణి సం. ౭ పుట. 48

లక్కమాంబ పుత్త్రుఁడైన పోచిరాజు నరసింహరాజు భట్టుమూర్తిచే నరసభూపాలీయమును కృతిఁ గాంచెను. నాల్గవయామె పే రెవ్వరో తెలియలేదు. పైనిఁ జెప్పిన ముగ్గురును నక్కచెల్లెంద్రబిడ్డలు. కావున తిమ్మరాజు, నరసరాజు, నరసింహరాజు లించుమించుగ సమవయస్కులై యుందురని నిశ్చయింపవచ్చును ఇందులో సిద్ధిరాజు తిమ్మరాజుకవి పరమయోగి విలాసకృతికర్త. ఆతని చారిత్రమును వేఱుగా నీగ్రంథమున వ్రాసియున్నాఁడను౧. పోచిరాజు నరసరాజునుగూర్చి రామరాజభూషణకవి చారిత్రమున వ్రాయను న్నాఁడను.

గొబ్బూరి వారినిగూర్చి యిట్టుఁ గొంచెము వ్రాసెదను. గొబ్బూరి వంశమునకు మూలపురుషుఁడు తిమ్మరాజు ఆతనికుమారుఁడు కొండరాజు. ఇతనికిఁ దిమ్మరాజు, వెంగళరాజు, గొబ్బూరిరాజు, తిరుమలరాజు, ఓబళరాజు, అను నైదుగురు తనయులు. ఆరవీటి వారి యింటియాడుపడుచులు పెక్కండ్రు గొబ్బూరివారి యింటికో డండ్రై కీర్తిఁ గాంచియున్నారు.

పైని జెప్పినయైదుగురిలో, మొదటివాఁడగు తిమ్మరాజు ఆరవీటి శ్రీరంగరాజునకుఁ దనయయు అళియరామరాజాదులకైదుగురకు సోదరియునగు నోబమాంబను బరిణయమాడెను. ఆదంపతుల తనయుఁడే రామాభ్యుదయ కృతిభర్తయగు నరసరాజు. ఇతనికి జగ్గరాజను సోదరుఁడు కలఁడు. ఈనరసరాజునకు రామాభ్యుదయ రచననాఁటి కార్గురు తనయులు. ౧ పెదతిమ్మరాజు. ౨ చినతిమ్మరాజు, 3 కృష్ణమరాజు ౪ రఘునాథరాజు, ౫ పాపరాజు ౬ రంగపరాజు, ఇందులోఁ బెదతిమ్మరాజు కర్నూలునందును, జినతిమ్మరాజు కొండవీటి దుర్గమునందును, నుండెడివారని రామాభ్యుదయ కృత్యాదియందున్నది. తక్కిన కుమారులుకూడ పరాక్రమవంతులై తండ్రికిని సోదరులకును రాజ్యపరిపాలనమునఁ దోడ్పడుచుండెడివారని కవి చెప్పియున్నాఁడు.

---

౧ ఆం. కవితరంగిణి సం 9 పుట 107

రామాభ్యుదయ రచనమునాటికి కనిష్ఠపుత్త్రునకుఁ బదునైదేండ్లున్నవని తలంచినచోఁ గృతిపతికప్పటికి ౫౫—౬౦ సంవత్సరముల వయసుండు నని నిశ్చయింపవచ్చును. ఆపక్షములో నీతఁ డళియరామరాజుతో సమవయస్కుఁడగును. ఈతనితల్లి అళియరామరాజాదులకప్పయగునో చెల్లెలగునో తెలియరాలేదు. అగ్రజయైనచో ఆమె తనయుఁడును రామరాజును సమాన వయసుగలవాఁడనుటలో విరోధమేమియు లేదు. తక్కిన గొబ్బూరివారి వంశీయులతో మనకిటఁ బ్రసక్తి లేదు.

రామభద్రకవియొకచో "గొబ్బూరిపురప్రభు రంగనకీర్తి" యని వ్రాసియుండుటచే 'గొబ్బూరు' అనుగ్రామమునుబట్టి వీరియింటిపేరు వచ్చినట్లు నిశ్చయింపఁ దగియున్నది.

ప్రథమాశ్వాసాంత పద్యములలో—

మ. మనువంశోత్తమ! మత్తవారణఘటామాద్యద్భటానీ కని
స్వన హేరాబధిరీకృతాఖిలదిశాస్తంబేరమో దీక్ష్ణ క
ణ్ణ! నయజ్ఞా! చినకొట్లధర్మవర నానారాజ్యధౌరేయ! కం
దనవాలీముఖ దుర్గరక్షణచణోదగ్ర ప్రభావోదయా!

అను పద్యములో కృతిపతియైన నరసరాజు చినకొట్ల ధర్మవర రాజ్య పరిపాలకుఁడై కర్నూలు దుర్గమును సంరక్షించుచున్నవాఁడని తెల్పియున్నందున నాతనినివాసము చినకోట్లధర్మవరమని చెప్పవచ్చును. కవి కడపమండలనివాసి. కృతిపతి కర్నూలుమండలవాస్తవ్యుఁడు.

గొబ్బూరివారి వంశమునకుఁ గరికాలచోళుఁడు మూలపురుషుఁ డయిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. ఆరఘుపతివంశసుధా
నీరధికిఁ గరికాలచోళనృపచంద్రుఁడు దు
ర్వారశరభిన్నవిమతా
కారుఁ డుదారుఁడు జనించెఁ గలియుగవేళన్.

ఉ. ఆకరికాలచోళవిభు నన్వయ సంభవులైరి యాత్మర
తేజశ్శాలుండు భూపతిశిఖామణి భూపతిరాజు గంగరా
జాకృతపుణ్యశేఖరుల కాశ్రితలోకశరణ్య తేజముల్
నైకొన వస్త్రమూర్తులకుఁ గల్గఁగ నేర్తురె సాటివారిలోఁ.

ఇందలి తుది రెండుపాదములకుఁ బాఠాంతరమున్నది.

"జాకరుణాధురంధరున కాత్మజుఁడై పొగడొందెఁ దిమ్మరా
జాకులభర్తకుం దనయుఁడయ్యెను గొండనృపాలుఁడున్నతిన్."

ఈపాఠాంతరమే యంగీకరింపఁ దగినది. ఈపద్యములనుబట్టి గొబ్బూరివారు తెలుఁగుచోడుల సంతతిలోనివారయినట్లు తెలియుచున్నది. కాని చాలకాలము గడచుటచేఁ గాఁబోలు వీరు తమ నామములతుదను చోడశబ్దమును జేర్చుకొనలేదు.

గొబ్బూరివారు పరాక్రమవంతులును శూరులు నగుక్షత్రియులు. ఆరవీటివారితో బాంధవ్యమును నెరపి కీర్తింగాంచియుండిరి. వీరి శాసనములు పెక్కులున్నవి౧. కాని వానినిబట్టి కాలనిర్ణయము చేయనక్కఱలేకుండ కృతిపతియైన నరసరాజు శాసనమొకటి లభించినది. కడపమండలమందలి పుల్లంపేట తాలూకా తొందూరు గ్రామములోనున్న యాంజనేయస్వామికిఁ గొంతభూమి సమర్పించి శా. శ. ౧౪౭౮ నల సంవత్సరమున నరసరాజాశాసనమును వ్రాయించెను౨. ఈ శాసనకాలమే రామాభ్యుదయ కృతి ప్రదాన కాలమని యనుకొనవచ్చును. అట్లయినచోఁ గ్రీ. శ. ౧౫౫౦ వ సంవత్సర ప్రాంతమున రామాభ్యుదయమును గవి రచించెనని నిర్ణయింపఁదగును.

---

౧. A R 63,543 of 1915 A. R 255; 257 of 1938 A. R 744 of 1919 ద.హిం.శా.సం IV సంఖ్య 688 రంగాచార్యులుగారి శాసన సంపుటములలో కర్నూలు 577; 401; 110; చెంగల్పట్టు 1157; 767; 710.

౨. రంగాచార్యులుగారి శాసన సంపుటములు కడప. సంఖ్య 635.

ఈకృతిపతియైన గొబ్బూరి నరసరాజు, అళియరామరాయాదులకు మేనల్లుఁడైనట్లును, అళియరామరాజునకుఁ దమ్ముఁడైన వెంకటాద్రి ప్రభువునకుఁ గుడిభుజమైయుండినట్లును, నీక్రిందిపద్యములలోఁ గవి వర్ణించియున్నాఁడు.

క. ఆరామరాజు తిరుమల
శౌరియు, శ్రీవేంకటాద్రి జనపతి, ముగురున్
గారాపుం దోబుట్టువు
లై రాజిల సాధ్వి యోబమాంబ దనర్చున్.

మ. ప్రభురత్నంబగు తిమ్మభూవిభు తపఃప్రారబ్ధ పుణ్యోదయం
బభిరామాకృతి నొంది నాకొనఁగా నాయోబమాబ్జాననా
శుభగర్భాబ్ధిజనించి రానరసరాజున్ జగ్గభూభర్త కౌ
స్తుభచింతామణులు న్నలెన్ సహజతేజోదాన ధౌరేయులై.

చ. ఇరవుగ వేంకటాద్రి మనుజేంద్రు భుజంబుల ప్రాపుదాఁపునన్
నరసవసుంధరావలయనాథుఁడు జగ్గనృపాలచంద్రుఁడున్
హరి కిరుగేలుదామరలయందును జక్రముఁ బాంచజన్యమున్
దొరయుగతిం బ్రతాపవరదుర్జయ కీర్తులు గాంచి రున్నతిన్.

రామభద్రకవి రామాభ్యుదయమును రచించునాఁటికి అళియరామరాయలును తిరుమలరాయలును వెంకటాద్రిభూపతియుఁగూడ జీవించియున్నట్లు వారివర్ణనమునుబట్టి తెలియుచున్నది.

మఱియు నళియరామరాయలను గవి:—

ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయ ధా
త్రీపతి సార్వభౌమ దుహితృప్రియుఁడై వితతప్రతాప సం
తాపిత శత్రుఁడై యలసదాశివరాయ నిరంతరాయ వి
ద్యాపుర రాజ్యలక్ష్మికి నిదానము దానయి మించె నెంతయున్.

అని వర్ణించియుండుటచే నచ్యుతరాయల యనంతరమున సదాశివరాయల రాజ్యకాలములో నీకావ్యము రచియింపఁబడిన దనుట స్పష్టము.

అళియరామరాయలు, సదాశివరాయని కర్ణాటరాజ్య సింహాసనమునఁ బ్రతిష్ఠించినది క్రీ.శ.౧౫౪౩ వ సంవత్సరప్రాంతమని చరిత్రకారులు వ్రాసియున్నారు. కావున రామభద్రుఁ డీరామాభ్యుదయమును క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతమున రచించినాఁడని చెప్పవచ్చును. అప్పటికీతనికి నలువదియేండ్లు వయసున్నదని తలంచితిమేని, యీతని జననము౧౫౧౦ ప్రాంతముయి యుండును. కృష్ణదేవరాయల యనంతరమీతఁడు నలువది యేఁబది సంవత్సరములు బ్రతికియుండునని లక్ష్మణరావు పంతులుగారు చెప్పినయూహ సత్యమయ్యేనేని రాయలు ౧౫౩౦ వ సంవత్సరమునఁ గాలధర్మము నొందియుండుటచే నీకవి ౧౫౭౦-౧౫౮౦ ప్రాంతమువఱకు జీవించియుండునని తలంపవలసియున్నది. పైలెక్కప్రకారమప్పటి కాతనికి ౬౦-౭౦ సంవత్సరముల వయసుండునని తేలినది. ఇందు విపరీతమేమియు లేదు.

రామాభ్యుదయ కాలము నిఁకనొకవిధముగాఁ గూడఁ గనుఁగొనవచ్చును. అళియరామరాయల జీవితకాలములోనే క్రీ.శ ౧౫౫౧ లో రాయచూరునొద్ద మహమ్మదీయులకును కర్ణాట ప్రభువులకును గొప్పయుద్ధము జరిగినది. అందులోహిందువులే జయమునుగాంచిరి. ఆమహారణములో నళియరామరాయల మూఁడవకుమారుఁడైన చినతిమ్మరాజు విశేష పరాక్రమము చూపి శత్రువులను జయించెననియు, నందుచే నారాచూరి దుర్గపరిపాలన మాతిమ్మరాజున కీయఁబడియెననియు నాకారణమున నతఁడు రాచూరి తిమ్మరాజని పిలువఁబడియెననియుఁ జరిత్రకారులనుచున్నారు. రామభద్రకవి యీతిమ్మరాజును రామాభ్యుదయకృత్యాది యందలి యీక్రింది రెండు పద్యములలో రాచూరి తిమ్మరాజనియే నుడివియున్నాఁడు.

శా. రామక్షోణివిభుండు కృష్ణమనుజేంద్రగ్రామణీ భీమసం
గ్రామేంద్రాత్మజుఁ బెద్దతిమ్మవిభునిన్ గాచూరి తిమ్మాధిపున్
శ్రీమంతుం బినకొండభూవరవరున్ శ్రీరంగ రాజన్య సు
త్రాముం గాంచెఁ గుమారరత్నముల మందారోపమోదారులన్.

క. రాచూరి తిమ్మవిభుని క
రాచూరిఁ దెగి నిరంతరము నమరవృగీ
లోచనల మదనశాస్త్రి
లోచనలం దవిలి వర్తిలుదు రభియాతుల్.

ఈపద్యములనుబట్టి రాచూరి యుద్ధానంతర మీగ్రంథము రచితమయ్యెననుట స్పష్టము. కావున క్రీ. శ. ౧౫౫౫ ప్రాంతమున ననఁగా తొండూరు శాసన ప్రాంతమున నీగ్రంథము రచితమయ్యెనని నిశ్చయింతము.

రామభద్రకవి కృష్ణదేవరాయల యాస్థానకవిదిగ్గజులలో నొకఁడని ప్రతీతికలదు. కాని యది యనుమానాస్పదమైనది. ఇతఁడు రామాభ్యుదయమును రచించునాఁటికి నలువది లేక నలువదియైదేండ్ల వాఁడని తలంచుట స్వాభావికము. ఏఁబదియేండ్లవాఁడని యనుకొనినను, నీతని జననము ౧౫౦౫–౧౫౧౦ ప్రాంతమగును. రాయలు స్వర్గము నలంకరించునప్పటికి, ౨౦–౨౫ ఏండ్లవయసులో విద్యార్థిదశయందే యుండును గాని కవియై కవిదిగ్గజుఁడను ప్రఖ్యాతినార్జించిన వాఁడుగా నుండుట యసంభవము. ఆస్థానకవులలో నొకఁడుగా నుండెననుట కాధారములు గనుపడలేదు. ఇతఁడు రామరాజ భూషణుని కంటెఁ బది - పదునైదేండ్లు పెద్దవాఁడైయుండును. వసుచరిత్రకృతిప్రదానముకంటె నిరువదియేండ్లు పూర్వము నరసరాజు రామాభ్యుదయమును గైకొనియుండవచ్చును. రామభద్రుఁడు రామరాజభూషణునకంటెఁ బెద్దవాఁడైనను, వీరిరువురు నున్నకాలము కొంతయుండకపోదు. రామభద్రకవి రామరాజభూషణుని కిరీటమును దనపాదముచేఁ దన్నెనను కథయొకటికలదు. కాని యది విశ్వాసనీయముకాదు

కవిత్వవిషయమున నేర్పైన రామరాజభూషణుని తలదన్నినవాఁడు రామ భద్రుఁడని యనియన్నచో నదియే లోకమున వాస్తవికకథగాఁ బ్రచా రములోనికి వచ్చి యప్పకవినాఁడు గ్రంథస్థమయ్యేనేమో !

శ్రీకృష్ణదేవరాయల కాలములోనుండి యాప్రభువు నానతిపైని యీరామభద్రకవి సకల కథాసారసంగ్రహ మను నొకపద్యకావ్య మును రచించెనని చెప్పుదురు. కీ. శే. లక్ష్మణరావు పంతులుగారట్లే యభిప్రాయపడి వ్రాసినవాక్యములను పైని నుదాహరించియున్నాఁ డను. కాని యాసకలకథాసారసంగ్రహకర్త యీ రామభద్రకవి కాఁడ నియు నాతఁ డింకొకరామభద్రుఁడనియు నాయభిప్రాయము. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారుకూడ సకలకథాసారసంగ్రహమును అయ్య లరాజు రామభద్రకవియేరచించినట్లు వ్రాసియున్నారు. కాని యది సత్యమనితోఁపదు.

సకలకథాసారసంగ్రహము షట్చక్రవర్తులు మొదలుగాఁ గొంద ఱురాజులతో సంబంధించిన కథలను దెలుపునట్టి గ్రంథము ఆంధ్రకవుల చరిత్రమున నిది తొమ్మిది యాశ్వాసములు కలదనివ్రాసిరి. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున రెండుప్రతులున్నవి. అందెనిమిది యాశ్వాసములును, తొమ్మిదవ యాశ్వాసమునఁ గొన్నిపద్యములును గలవు. మొత్తమెన్నియాశ్వాసములో తెలియరాదు. ఈపుస్తకము నందుఁ గవి వ్రాసికొనిన గద్య యిట్లున్నది.

"ఇది శ్రీరామభద్ర ప్రసాదలబ్ధకవిత్వమహత్వ విశారదశారద సత్కవిమిత్ర యాపస్తంబసూత్రపాత్ర కాశ్యపసగోత్రపవిత్ర రామ భద్ర ధీముద్రాభద్ర రామభద్రప్రణీతంబైన సకలకథాసారసంగ్రహము"

అయ్యలరాజు రామభద్రుఁడు రామాభ్యుదయమున వేసికొనిన గద్య పైనివ్రాసియుంటిని. ఈ రెండుగద్యలకును బోలికలేదు. అయ్య లరాజురామభద్రుఁడు కౌండిన్యసగోత్రుఁడు. సకలకథారామభద్రుఁడు కాశ్యపసగోత్రుఁడు. ఈకాశ్యపశబ్దము పొరబాటయి యుండునని శతకకవుల చరిత్రకారులు వ్రాసియున్నారు కాని పొరబాటు అని

చెప్పుట కాధారములు లేవు. ఈయిరువురు రామభద్రులును భిన్న వ్యక్తులని చెప్పుట కీగద్యలే చాలియున్నవి.

శ్రీకృష్ణదేవరాయ లీకవిని సకలకథాసారసంగ్రహమును రచియింపుమని చెప్పిన వచనభాగముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"ఇట్లు కీర్తివిస్తార ధురంధరుండగు కృష్ణరాయనరపాలాఖండలుండు నన్నుఁ బిలిచి శ్రీమత్సీతారమణ చరణకమలపరిచరణాయమానమానసుండవు బహువిధ కవితాచమత్కార ధుర్యుండవు, మన్మనోరథకార్యనిర్వాహకుండవగుటం జేసి పురాతనమహాకవి విరచిత ప్రబంధంబు లన్వేషించి భగవద్భక్తి నిస్తారకర్తృలగు రాజ శ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబులగునట్లుగాఁ బ్రశస్తకథలు విన్యస్తంబుగా నెలకూర్చి సాహిత్యలక్షణ చిత్రకవిత్వ ప్రభావంబు లోకైకచోటం గనుపడ రచియింపవలయునని ప్రార్థించి మఱియు నిట్లనియె.



"అతి మధురరసాయన ద్రాక్షాపాకంబుగా శృంగారరసయుక్తంబగునట్లు సకలకథా సారసంగ్రహంబు గ్రంథవిస్తారంబుగాకుండునట్లుగా రచియింపుమని యుపన్యసించిన సంతోషిత స్వాంతతరంగితాంతరంగుండనగుచున్న సమయంబున



మదీయ భాగ్యవశంబున స్వప్నకాలంబునఁ బ్రసన్నుండై పరమ మంత్రోపదేశపూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబునకుఁ గృతినాయకునిఁ దన్నుంగావింపుమని హితోపదేశంబుచేసి యంతర్హితుండైన నేనంతట మేలుకాంచి......కన్నడమహీమండలాఖండలుండును బ్రచండ పరాక్రమపరరాజశుండాలకంఠీరవుండును నగు నరకంఠీరవ రాయసూతి ప్రేరితసకలకథాసారసంగ్రహనామక ప్రబంధంబు రచియింపంజాలుటకు నిప్పుడ గదా సమర్థుండనైతిని.........స్వప్నవృత్తాం

తంబంతయు నమ్మహీకాంతునకు నెఱింగించినగు తూహలియగుచు నా రాజముఖ్యుం డిట్లనియె.

ఉ. నీవును బాలకృష్ణపద నీరజభక్తుఁడ వార్యచిత్తమో
దావహ సద్గుణుండవు రమాధిపునిం గలలోనఁ గాంచి య
ద్దేవు హితోపదేశమునఁ దేజమునొందిన వాఁడ విన్నిటన్
గావున నీప్రబంధము పకాశముగా హరికిమ్ము నావుఁడున్

పై వచనములో "ఎలకూచిసాహిత్యలక్షణ చిత్రకవిత్వ ప్రభావంబు లోకమ్మకుం గనుపడ రచియింపవలయునని" యున్నది. ఈ 'యెలకూచి' ఎలకూచి బాలసరస్వతియే యైయుండును. బాలసరస్వతి శిష్యుఁడో, ఆతనికిఁ తరువాతివాఁడో, రామభద్రుఁ డనుపేరుగల యొకానొకకవి యీగ్రంథమును రచించి, గ్రంథమునకు గౌరవము గల్గుటకై కృష్ణదేవరాయలు తననీగ్రంథమును రచింపుమని కోరినట్లు కృత్యాదిని వ్రాసికొనియున్నాఁడు. అంతియేగాని యీకావ్య మయ్యలరాజు రామభద్రుఁడు రచించినదికాదు. ఎలకూచి బాలసరస్వతికంటెను బూర్వుఁ డయిన యయ్యలరాజు రామభద్రుఁడు 'ఎలకూచి' నెట్లు పేర్కొనఁగలఁడు?

సకలకథాసారసంగ్రహ మొకస్వతంత్ర గ్రంథము కాదు. పూర్వకవుల గ్రంథములలోనుండి పద్యములను గ్రహించి రూపమునించుక మార్చి యీగ్రంథమును జేసియున్నట్లీ గ్రంథమును జదివినచోఁ దెలియఁగలదు. బహుగ్రంథ పరిశోధకుఁడైన బ్రౌనుపండితుఁ డీగ్రంథమును గూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు. "This is an illiterate Poem of no merit, whatever parts are superior are stolen from better authors" July 1843 (Sd) C. P. Broun.

ఉదాహరణకొఱకు కొన్నిపద్యముల నుదాహరించెదను.

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరోఝరీ
పటల మహోర్మిమాలికలభంగతరంగ వృదంగనిస్వన

స్ఫుటనటనానురూప పరిఫుల్లకలాప కలాపిజాలమున్
కటకచరత్కరేణు కరికంపిత సాలము శీతశైలమున్.

మనుచరిత్రము.

చ. అటఁ జని కాంచె భూమివిభుఁ డంబరచుంబిత వింధ్య వి
స్ఫుటఘనమూర్ధనిర్గత సుశోభిత పుణ్యశిరస్సరిజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగుర నూత్నతరంగ సంగతో
త్కటవరఫేన నిర్జిత సుధాంభ మహానది నర్మదానదిన్...

సకలకథా సారసంగ్రహము

మ. అనిమేషత్వము మాన్పె చిత్తరపు చూపస్వేదతావృత్తి మా
న్పె ననస్వేదసమృద్ధి బోధకళ మాన్పె న్మోహవిభ్రాంతితో
డనె గీర్వాణ వధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్ప న్మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం జూపట్టె నా నత్తఱిన్

మనుచరిత్రము

మ. అనిమేషత్వము మాన్పె చంచలపుచూపస్వేదభావంబు గ్ర
ద్దన వారించె వినూత్న ఘర్మజల విస్తారప్రపూరంబు తో
డన దేవాంగన కయ్యెడన్ భ్రమరకీటన్యాయమై యొప్పియ
మ్మనుజేంద్రున్ భ్రమియించునంత నెరహీనమర్త్యత్వమున్ సంధిలెన్

సకలకథాసారసంగ్రహము

సమకాలికుఁడగు నల్లసాని పెద్దన మనుచరిత్రమునుండి గ్రంథ చౌర్యమొనరించి యయ్యలరాజు రామభద్రుఁడీగ్రంథమును రచించె ననుటకంటె హాస్యాస్పద మగువిషయ మింకొకటి యుండఁబోదు. ఈ గ్రంథమునందిట్టి యుదాహరణముల నింకను జూపవచ్చును. కాని గ్రంథవిస్తరభీతిచే మానివేసితిని.

ఈక్రింది రెండు పద్యములలో మొదటిది రామాభ్యుదయములోనిది. రెండవది సకలకథాసారసంగ్రహములోనిది. రెండుగ్రంథములును అయ్యలరాజు రామభద్రుఁడు రచించినట్లే యభిప్రాయపడుటచే వీరేశ లింగము పంతులుగారు సకలకథాసారమందలి పద్యమునుమార్చి రామ

భద్రుఁడు తన రామాభ్యుదయములో వేసికొనెనని వ్రాసియున్నారు. అది సత్యము కాదు. రెండవ రామభద్రుఁడు గ్రంథచౌర్య మొనర్చి తన గ్రంథమున వేసికొనెననుటయే సమంజసము.

సీ. కానక కన్నసంతానంబు గావునఁ
గానక కన్నసంతాన మయ్యె
నరయ గోత్రనిధాన మయ్యె నేఁడు
నరయ గోత్రనిధాన మయ్యె నేఁడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణ వర్ధిష్ణుఁడయ్యె
వివిధాగమాంతసంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యె
గటకటా దాశరథి సముత్కటకరీంద్ర
కటకవితదాన ధారార్ద్ర కటకమార్గ
గామి యెట్లు చరించు నుత్కటకరీంద్ర
కటకవితదాన ధారార్ద్ర కటకతటుల.

రామాభ్యుదయము.

సీ. కానక కన్న సత్పూనుండు నేటికిఁ
గానక కన్న సత్పూనుఁ డయ్యెఁ
బుణ్యజనోత్కీర్ణ పురుషుండు నేటికిఁ
బుణ్యజనోత్కీర్ణ పురుషుఁడయ్యె
ద్విజసఖ్యులనుగూడి తిరుగుబాలుఁడు నేఁడు
ద్విజముఖ్యులను గూడి తిరుగుటయ్యె
గోత్రపావనుఁ డైనకొమరుండు నేఁటికి
గోత్రపావనుఁడైన కొమరుఁ డయ్యె
మత్తగజదాన ధారార్ద్రమార్గములను
దరుల నీడల నెప్పుడు దిరుగువాఁడు
దరులనీడల నెప్పుడు దిరుగుటయ్యె

పైని వ్రాసిన కృత్యాది వచనములో "పురాతన మహాకవి విరచితప్రబంధంబు లన్వేషించి "యనుటలోఁ గవియుద్దేశము పూర్వకవుల ప్రబంధములలోని పద్యములవంటి పద్యములతోఁ దానొక ప్రబంధము సేయుటయే యని సూచితమగుచున్నది. ఆరామభద్రకవికి శారదకవి యనునొక మిత్రుఁడున్నట్లు చెప్పియున్నాఁడు. అయ్యలరాజు రామభద్రున కట్టిమిత్రుఁడున్నాఁడని రామాభ్యుదయమునఁ జెప్పలేదు.

సకలకథాసారసంగ్రహకర్త యయ్యలరాజు రామభద్రుఁడు కాఁడని చెప్పుట కింతకంటె నెక్కువ సాక్ష్యమక్కఱలేదు. "రామభద్రకవి" యనుశీర్షికతో నీకవి రచించిన పద్యములను గొన్నిటిని వేఱుగ నాతని చారిత్రమున వ్రాయనెంచి యీపద్యముల నిటనీయలేదు.

అయ్యలరాజు రామభద్రుఁడు బీదవాఁడనియు నీతనికిఁ బిల్లలెక్కువగా నుండుటచే నీతనిని పిల్లలరామభద్రయ్య యని పిలుచుచుండెడివారనియు వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. ఈతఁడు గుత్తియప్పలరాజుపై నొకచాటుధార రచియించెనని అప్పకవి యీక్రిందిపద్యము నుదాహరించినాఁడు.

క. రాజమనోజా! విద్యా
భోజా! దీనార్థికల్పభూజా! రిపుసం
జ్ఞాజా! కవితేజా! గుత్తియప్పలరాజా!

ఈగుత్తియప్పలరా జెవ్వరో తెలియదు. ఈరామభద్రుని యింటిపేరు పుత్తేటివారని కొంద ఱనుచున్నారు. సకలకథాసారసంగ్రహమును రచించిన రామభద్రయ్య యింటిపేరు పుత్తేటివారై యుండుననియు, రామాభ్యుదయ సకలకథాసారసంగ్రహ గ్రంథకర్తయొక్కఁడే యనునభిప్రాయములో నాపుత్తేటి యనునామమును రామాభ్యుదయకర్తకుఁగూడ ననువర్తింపఁ జేసియుండుననియు మొదట నేనను కొనియుంటిని. ఇప్పటికిని నాయుద్దేశ మదియే కాని దానికొకబాధ కన్పట్టుచున్నది. సకలకథాసారసంగ్రహకర్త ఎలకూచి బాలసరస్వతితో సమకాలికుఁడో తరువాతివాఁడో, అయి యుండునని పైని వ్రాసియుం

టించి. ఇంచుమించుగ బాలసరస్వతితో సమకాలికుఁడో ఒక్కించుక పూర్వుఁడో యగు లింగమకుంట తిమ్మకవికూడఁ దన సులక్షణసారములో రామాభ్యుదయకర్తను పుత్తేటి రామభద్రయ్య యని వ్రాసి యుండెనఁట! అది సత్యమగుచో, రెండవ రామభద్రుని యింటి పేరు పుత్తేటివారై యుండదు. సమకాలికులలో సంతపాటు సంభవించియుండదు. సులక్షణసారప్రతిపలేఖకులెవ్వరైన నీమార్పును జేసియుండవచ్చును. లేదా, అయ్యలరాజు, రామకవి అను యింటి పేరులు వాడుకలోనికి రాకపూర్వము వీరిగృహనామము పుత్తేటివారై యుండవలయును. అట్లు కాదేని "పుత్తేరు" అనుగ్రామములో నీకవి నివాసముగ నుండుటచే నాతని నెఱిఁగియున్నవారీతనిని పుత్తేటి రామభద్రయ్య యని పిలుచుచుండవచ్చును. దానినిబట్టి యాపేరు గ్రంథస్థమయియుండును. అయ్యలరాజు వంశీయులగు కవులెవ్వరును తమ గ్రంథములలో నీపుత్తేటిశబ్దము నుపయోగించి యుండలేదు. కావున రామభద్రయ్య యింటిపేరు పుత్తేటి యని భావింపరాదు. సులక్షణసారమందలి వ్రాఁతనిరాధారమైనదిగా భావింపవలయును.

రామభద్రకవి కవిత్వము ప్రౌఢమై నిర్దుష్టమై హృదయరంజకముగా నుండును. ఇం దుత్తరకాండకథ లేదు. శ్రీరామపట్టాభిషేకము వఱకుమాత్రమే చెప్పఁబడినది. రామాయణకథను మనోహరములైన వర్ణనలతోఁ బ్రబంధముగాఁ జేయుటయే కవి యుద్దేశము. దాదాపు పదునెనిమిదివందల పద్యములలో రామాయణకథను సంక్షేపరూపమున రచించి కవి తన మనోరథము నీడేర్చుకొనినాఁడు. ఈతని కవితా శైలి తెలియుటకై కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

చ. ధనులగు కోడెకాండ్రకును దంగెటిజున్నులు కోరి నిండుజ
వ్వనమునఁ జేరుపేదలెరువర్గము సంజని మ్రానిపండ్లు డా
సినగతి దక్కి యేరికిని జిక్కని చక్కని చూపులేక్కు మో
హన మధురాధరస్తనసృగంచల భాసిను లప్సరాంగనల్. ఆ.౧

శా. బాలోన్మత్త పిచాచలీలలఁ బరిహాస్త్రను సంధాన వి
ద్యాలబ్ధిన్ హరిభక్తులై మునుమనందానంద నిర్మగ్నులై

హేలానర్తనగీతులన్ మెలఁగుచుం దీర్లాగునన్ వారె కాఁ
బోలున్ వీరనియాస్మహోన్నవహుఁడ సమ్మోహనంబునొం దెన్మదిన్. ఆ. ౧

ఉ. ఎవ్వఁడ వీవు నాయెదుట నిల్లి శరాసనబాణపాణివై
క్రొవ్వి భయంబులేక యిటకుం జనువాఁడ వనేకభూపతుల్
దెవ్వరి మత్కుఠారహతిన్ భృగురాముని నన్నెఱుంగవే ?
చివ్వకుఁ గాలుఁద్రివ్వెద నజేయధనుర్ధర సాహసాభిమానిన్. ఆ. ౨

ఉ. ఆస్తుల నీవ నేర్తు వసియింగఁ ద్రిమూర్తి విలాసవర్తి వెన్
గర్తవు భర్తవుం దలఁపఁగాఁ బరిహర్తవు నీవ నీవ చి
న్మూర్తివి నీవ పోషణవణుండవు కర్తమకర్తు మన్యథా
కర్తు ముదారశక్తియు జగంబుల నీవకదా గదాధరా! ఆ. ౩

మ. మనయూ రెన్నది ? యెంతదవ్వు మనమీమార్గంబునం బోవుటల్
గానమెచ్చోటికిఁ బోయిరావలయు? నేలాలేదు తేరిచ్చటన్
గానలోఁటన్నవలెఁ బువ్వుటోవరులు సమ్యక్ఛంద్రకాంతస్థలుల్
గనరా విప్పుడ దేమి? నావిభుఁడు శోకంబాత్మలోనాఁగుచున్ ఆ. ౪

చ. అనిలజుఁ డోరిరావణుఁడ! యల్లన నేటికి బెట్టు చెప్పెదన్
విను రఘురాముదూత నరవిందహితాత్మజుమంత్రి నేఁ బ్రభం
జనతనుజాతుఁడన్ జనకజన్ వెదకం జనుదెంచి కాంచితిన్
నను హనుమంతుఁడండ్రు భవనంబులు మాకిలనెల్ల కానలున్. ఆ. ౫

చ. నినుఁ దనచంకవైచుకొని నీరవిధానచతుష్టయంబునన్
జనిచని సాంధ్యకృత్యములు సల్పెడు నంతకుఁ ద్రిప్పితెచ్చి పెం
పున నటవైచి కొంకరలుపోయిన నీమెయి చక్కనొక్కి పో
ననిచిన వాలినందనుఁడ నంగదుఁడన్ దశకంఠ! వింటివే. ఆ. ౬

శా. శ్రీమన్మంగళవైభవంబులఁ బ్రవేశించెం బురంబున మునుల్
ప్రామిన్కుల్ పఠియింపఁగాఁ గ్రమమునన్ భద్రాసనం బెక్కి మా
కీర్తి మీ రాజ్యము లేలుఁడంచనిన సుగ్రీవాదులం బెంపునై
స్వామ్యంబునఁ బ్రోచుచుండె రఘువంశస్వామి లోకంబులన్. ఆ. ౭

## 192 పోలమరాజు



ఇతఁడు చరిత్రతెలియనికవి. పర్వతపురాణమును రచించినట్లు జగ్గనకవి యుదాహరించిన పద్యములనుబట్టి తెలియుచున్నది. ఆపద్యములనిట వ్రాయుటకంటె నన్యమేమియుఁ జేయఁజాలకున్నాఁడను.

చ. అరయఁగ లోకబాంధవుఁడనై భువనత్రయ కర్మసాక్షినై
హరిహర పద్మసంభవమయాకృతినై మనునాకు వారుణీ
పరిచయదోషమబ్బె నని భానుఁడు తద్దురితోప శాంతికై
శరనిధిఁ గ్రుంకె నా సపరశైల తిరోహితుఁ డయ్యె నయ్యెడన్.

సీ. ఒనరంగఁ గమలంబు నుపహారసంధియు
సంతానసంధియు సంగడంబుఁ
జాలనుపన్యాస సంధియు......
......సంధియు యోగసంధికమును,
బుష్పాంతరాదృష్ట పురుషనామకములు
నాదిష్టకంబును నాత్మమిషయు,
బంధురోసగ్రహసంధి పరిక్రియ
సంధియు నుచ్ఛిన్నసంధికంబు,

గీ. ననుపమ పరదూషణాంచిత స్కందోప
నేయసంధులనంగ నిశ్చితముగ
షోడశప్రకార సునిశితసంధి వి
ధాన మెఱుఁగవలయు ధరణిపునకు.

నాగలూటి శేషనాథార్యుఁడు పర్వతపురాణమును రచియించియుండెను. అది శ్రీశైలమాహాత్మ్యమును దెలుపును. ఈపర్వతపురాణమునందేవిషయము చెప్పఁబడియెనో తెలియదు. శ్రీశైల విషయములే కొన్ని కథలను జేర్చి యీకవి రచియించియుండును. పైసీసపద్యమునందు రాజెఱుఁగియుండఁదగిన సంధిలక్షణములు తెలుపఁబడినవి. కవి చరిత్రమేమియుఁ దెలియరాలేదు.

# 193 కంచర్ల అయ్యనకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; మల్లన గురువమ్మలకుఁ బుత్త్రుఁడు; శరభసహామాలకు పౌత్త్రుఁడు; రామన యీకవికిఁ బ్రపితామహుఁడు.

ఈకవి కాశీఖండమును ద్విపదగా రచియించెనఁట! ఈగ్రంథ మిప్పు డెచ్చటను గానవచ్చుటలేదు. ఈతఁడనేక దానధర్మములచేఁ కీర్తిఁగాంచిన ట్లీతనిపౌత్త్రుఁ డయిన శరభనకవి తాను రచియించి యధ్యాత్మరామాయణమునం దీక్రింది రెండుపద్యములలోఁ గీర్తించియున్నాఁడు.

సీ. కృష్ణాపురంబునఁ గీర్తి నావందింప
మేడూరిపురమునఁ బ్రమదవనలర
నాగేశ్వరుని సురనాథు మార్కండేశు
స్థిరబుద్ధితోడఁ బ్రతిష్ఠ చేసి
వనములు బావులు ఘనముగా వేయించె
మధురాపురముతోడ్రివ మన
కృష్ణవేణికిఁ జనఁగృపనూఁది
రావులు ప్రేమనిత్వెరు భ_
గవిత రచనలు కుల్కెడు పల్కులమర
శబ్దనాటకాలంకార సరణులొప్ప
జెలువు మెఱయఁ గాశీఖండమొలమి ద్విపద
జేసెఁ గంచర్లయయ్యన శ్రీలుపరిఢల.

గీ. ఖ్యాతి నీరంకిలో రెండునూతు లొనర
గరిమ వేయించె నన్నసత్త్రముఁ బులుపిచె
సరలి వడుగులు పెండ్లిండ్లు చాలఁ జేసె
కంచరలయయ్యనామాత్య కవివరుండు.

ఈయయ్యనకవికిఁ బ్రపితామహుఁడైన రామనామాత్యుఁడు; మేడూరునకు స్థలకరణమైనట్లును, వీరప్రతాప దేవరాయల కాలములో నారాయలకు బుణ్యలోకావాప్తికొఱకు రంగారాయనింగారు శ్రీకాకుళమున వెలసియున్న ఆంధ్రవల్లభదేవునకు పండ్రెండుపుట్ల విత్తనములు చల్లుటకుఁ జాలినంతభూమిని, "ఈనాము"గానిచ్చి యాభూమిని ఈకంచర్ల రామామాత్యుని వశముచేసి యందుల కొకశిలాశాసనము వేయించినట్లును, కంచర్ల శరభనకవి తన యధ్యాత్మరామాయణమునం దీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు. గజపతుల కాలములోఁగూడ నీశాసనము గౌరవింపఁబడియె నఁట!

సీ. శోభితాపస్తంబసూత్రుఁ డాత్రేయస
    గోత్రుఁడు కంచెర్లకులపవిత్రుఁ
డలరు మేడూరి సీమల మూలమునకెల్ల
    స్థలకరణంబైన ధన్యచరితుఁ
డిల సప్తసంతానములు నిల్పి ప్రఖ్యాతిఁ
    గైకొని రాజిల్లె ఘనులుమెచ్చ
నిత్యాన్నదాన నిర్నిద్రవైభవ సంప
    దలు పెంపు వాటింపఁ దనరునట్టి
దానకర్ణుండు సత్యవ్రతానువర్తి
విబుధసంస్తూయమానాగ్ర్య వితతికీర్తి
సరస విశ్రుత రామన శంభుమూర్తి
సరవి ముఖ్యుండు ధార్మిక చక్రవర్తి.

సీ. శకవత్సరంబులు శశిబుతుగుణచంద్రు
    లగు క్రోధన నాబ్దంబునందు భాద్ర
పద శుద్ధ ద్వాదశిభానువారంబున
    భూపతి వీరప్రతాపదేవ
రాయలకును బుణ్యమాయతంబుగఁ గొండ
    పలి............

..........రంగరాయనిగారు
యీనా మొసంగిరి భూనుతముగ.

గీ. నెలమి శ్రీకాకుళంబున వెలయు తెలుఁగు
వల్లభస్వామి కతిభక్తి వర్ధిలంగ
సముతుపడీ, పిన్నతిరువడిఘురులకును
అంగరంగవైభవముల కమర పతియు,

క. రామానుజకూటంబున
కామీఁదట నృత్తగీత యాచకతతికిన్
దోమాలికకున్ భోగము
భామలకును సర్వమాన్య పారీణులకున్.

సీ. మేదూరి పొలములో......యష్టభో
గాతితేజస్వామ్య మలరునట్టి
స్థలకరణంబైన సత్యసంపన్నుండు
కంచర్ల రామనగారి వశము
గా సర్వమాన్యముగను ......
పొలుపొందఁ బండ్రెండుపుట్లు విత్తు
లొగిఁ బాటుమేర బాగుగను నా
చంద్రతారార్కమైతనరుచుండ
ననుచు......జాతిపై నలరుశాస
నంబు ప్రఖ్యాతి జగతి విడంబనమ్ము
గజపతీశ్వరుఁ డేలెడు కాలమందు
నిట్టిమర్యాద వర్తిల్లె నిష్టముగ.

దానమిచ్చిన రంగారాయనిం గారెవ్వరో గుర్తింపవలసియున్నది. నూజివీటి జమీందారుల పూర్వుఁడైయుండును. దానకాలము శా. శ. ౧౩౬౧ క్రీ.శ. ౧౪౩౯ కావున నాతని మునిమనుమఁడైన యయ్యనకవి పదునాఱవశతాబ్దియందుఁ బ్రథమార్థముననుు, పదునైదవ

శతాబ్దియందంత్యభాగమున నున్నవాఁడని చెప్పవచ్చును. ఈకవి నివాసము కృష్ణామండలములోని మేడూరు ప్రాంతమయి యుండును.

పైని వ్రాసిన శాసనము నాకు లభింపలేదు. అయ్యలకవి శాసనములకై వెదకితిని కాని యవియు దొరకలేదు.

## 194 దోసూరి కోనేరుకవి



ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; తండ్రి నాగయ్యమంత్రి.

ఈకవి బాలభాగవత మను పద్యకావ్యమును రచియించి యార్వీటిబుక్కరాయల మనుమఁడైన తిమ్మరాజున కంకితముచేసెను. ఆంధ్రకవుల చారిత్రములో నీకోనేరుకవి చరిత్రమునందు, బాలభాగవతమునందుఁ జెప్పఁబడిన వంశానుక్రమమునుబట్టి యార్వీటి బుక్కరాజునకు తిమ్మరాజనియు, కొండరాజు, శ్రీరంగరాజనియు ముగ్గురుకుమాళ్లుగలరు" అని వ్రాయఁబడియున్నది. కానియదిపొరపాటు. ఈముగ్గురును, ఆర్వీటి బుక్కరాజు కుమారులలో నొకఁడయిన రామరాజునకుఁ గుమాళ్లు. బాలభాగవతమునందట్లే చెప్పఁబడియున్నది. ఈతిమ్మరాజును పొట్టిపూఁడి తిమ్మరాజందురు. ఇతనికిఁ దిరుమలరాజు, విఠ్ఠలరాజు, చినతిమ్మరాజు, పాపతిమ్మరాజు (ఇతనిని పప్పుతిమ్మరాజందురు) అను నలుగురు కొడుకులు, ఇందులో జ్యేష్ఠుఁడయిన తిరుమలరాజు కవి నాదరించి, భాగవతమునందలి కథలను సంగ్రహముగా రచించి తనతండ్రికిఁ బుణ్యలోకావాప్తికై కృతియొసంగుమని కోరినమీఁదట నా గ్రంథమును రచించినట్లు కవిరచించిన యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. గీ. చాలనుతికెక్కు చాళుక్య చక్రవర్తి
బిరుదమన్నె విభాళాది బిరుదజాల

మానితుఁడు రామరాజు తిమ్మ......

..........తిరుమలక్షోణి విభుఁడు

..........విఠలేశ్వరాదిక సహోదరసహితుండై కొలువుండి నిజజనకుండగు తిమ్మభూపాలునకుఁ బుణ్యంబుగాఁ గృతిప్రతిష్ఠ సేయఁ జిత్తగించి యప్పుడు—

సీ. శ్రీమదహోబల శ్రీనృసింహసమగ్ర
కరుణావిశేష ప్రకాశనహితు
భాసురసంస్కృత ప్రాకృతాదిక శాస్త్ర
భాషాకవిత్వ సౌభాగ్యనిపుణు
జమదగ్ని తాశ్వలాయనసూత్రపావను
శ్రీవత్సగోత్రాబ్ధి శిశిరకరుని
సారస్యవినుతు దోనూరి నాగయమంత్రి
పుత్త్రుండనైనట్టి పుణ్యచరితు

గీ. చతురభూనాయకాస్థాన సకలసుజన
నందితుని నన్నుఁ గోనేరునాథసుకవి
నర్థిఁ బిలిపించి సత్కారమాచరించి
పలికె నిట్లని గంభీరభాషణముల.

మ. సకలశ్లోకకవినాథయూథములు మెచ్చన్ సంస్కృత ప్రాకృతా
దిక భాషామయ కావ్యకర్తవయి, పృథ్వీనాయకాస్థాన ర
త్నకలాపంబనఁ బేరుగాంచిన కృతార్థశ్రేష్ఠ! దోనూరి కో
నకవీంద్రోత్తమ! నీమహామహిమచందం బద్భుతంబిద్ధరన్.

  

గీ. అట్టి భాగవతంబునం దలరుచున్న
ద్వాదశస్కంధకథలను వరుసఁ గూర్చి
కావ్య మొక్కటి బాలభాగవతమనఁగఁ
జెప్పి లోకోపకారంబు సేయవలయు.

సీ. శ్రీ వీరనరసింహుచే బలిదోర్విహార
గండపెండెర మేఘనుఁడు గాంచె
వేంకటేశ్వరునాజ్ఞ విగతవృష్టికి వృష్టి
దయమీఱ నిచ్చె నేధర్మమూర్తి
కణకమీగాములగట్టుపై వేసవిఁ
బుట్టించె జలము లేభూనుతుండు
మానువకడ స (న) వాంబూని బోరను బరా
జయము నొందించె నేశౌర్యశాలి

గీ. అట్టి మజ్జనకునకు సత్యాభిరతున
కారువీటి రామక్షితిపాత్మజునకు
తిమ్మభూపాలమణికిఁ బుణ్యమ్ముగాఁగఁ
బలుకఁజేనొందు శ్రీబాలభాగవతము.

గీ. భాగవతముగల్గ బాలభాగవతంబు
ప్రియము సేయఁగలరు పెద్దలెల్ల
జగతు దల్లిసరస జవ్వనియగు పిల్లఁ
జూచువార లాత్మఁ జొక్కునట్లు

ఈపద్య బాలభాగవతమును దనతండ్రియైన యారువీటి తిమ్మరాజున కంకితముచేయించిన తిరుమలరాజే, యీ కోనేరుకవిచేతనే, యీ బాలభాగవతమును ద్విపదగా రచియింపఁజేసి, యాద్విపద కావ్యమును తన రెండవ తమ్ముఁడైన చినతిమ్మరాజున కంకితము చేయించెను. ఈవిషయము మీక్రింది ద్విపదలవలనఁ దెలియఁగలదు.

ఒక్క ప్రబంధంబు పల్క మహాభాగవత
ప్రకటించి ముదముచొప్పడు నంత



సురుచిరాపస్తంబసూత్రుఁడాత్రేయ
వరగోత్రుఁ డతిసాంద్ర వైభవేంద్రుండు
సోమవంశాంబుధిసోముండు కీర్తి
ధాముండు బుక్కభూధవు ప్రపౌత్రుండు

రామభూపతి తిమ్మరాజపుత్రులందు
ధీమాననీయుండు తిరుమల నృపతి
దక్షిణాశాజయస్తంభ యోజకులు
శిక్షిత దుర్మదక్షితి పాలగణులు
వినయలక్ష్మీయుతుల్ విట్ఠలోర్వీశ
చినతిమ్మనృపతు లంచితకీర్తిధనులు
పాపతిమ్మక్షమాపతియును నాది
నైన పొల్పు ననుజన్ము లతిభక్తిఁగొలువ

♦ ♦ ♦

అమరంగ నాశ్వలాయనశాఖయందు
కొమరొందు శ్రీవత్సగోత్రంబు రాశి
గలుగు దోనూరి నాగయమంత్రిసుతుని
విలసిత సాహిత్య విశ్రాంతిమంతు
వినుతాష్ట భాషాకవిత్వ ప్రచండు
ననఘుఁ గోనేరునాథాఖ్యుని నన్నుఁ
బిలిపించి సముచితప్రియ పూర్వకముగఁ
బలికె గంభీర విభ్రమ విశేషమున

♦ ♦ ♦

జనపతిమణికి మజ్జనకుఁ డౌ రామ
జననాథుతిమ్మభూజానికి మున్ను
వచియించితౌ ననఁ బద్యకావ్యముగఁ
బ్రచురంబుగా బాలభాగవతంబు
వాసికి నెక్క యివ్వసుధాతలమున
భాసిల్లు నాబాలభాగవతంబె
యరుదుగా నడచిన యన్నిమార్గములఁ
దిరముగా మాచినతిమ్మయ్య పేర
ద్విపదకావ్యంబుగా వెలయంగఁజేయు
మిపుడు మాకెంతయు హితమిదియనుచు

వివిధవిచిత్ర నవీనాంబరములు
నవరత్నమయభూషణము లెన్నఁదగిన
దగినయగ్రహారంబులు నగ్రహారములు
నగిరియపల్యంకి కాదివస్తువులు
తగనిచ్చి కర్పూరతాంబూల మొసఁగి
ప్రగుణత బహుమాన పరితుష్టుఁజేసె
ననుమతించితి నప్పు డవ్వాక్య మేను
ననురూపశుభనిమిత్తాలోకనమున

ద్విపద బాలభాగవతమును రచించిన కాలమును గవి యీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. అరుదుగ శాలివాహనశకాబ్దము లెన్న నిధానతర్క సా
గరశశిసంఖ్యచే వెలయఁ గల్గు ప్లవంగమనంగ మించువ
త్సరమునఁ బల్కెఁ దిన్మవసుధాపతికిన్ గవిసార్వభౌముఁడీ
హరిహితబాలభాగవతహారిపదద్విపద ప్రబంధమున్.

శాలివాహన శకము ౧౪౬౯ వ సంవత్సరమున ప్లవంగాబ్దమున (క్రీ.శ. ౧౫౪౭) ద్విపద భాగవతమును రచియించినట్లు కవియే వ్రాసి యుంచుటచేఁ గవికాలమును నిర్ణయించుటకు శ్రమ లేకుండపోయినది. అంతకుఁ బూర్వమే పద్యబాలభాగవతము రచియించియుండెను. కావున పద్యబాలభాగవతము క్రీ. శ. ౧౫౪౩ ప్రాంతమున రచియించెనని తలంపవచ్చును. అప్పటికచ్యుతదేవరాయలు చనిపోవుటయు సదాశివరాయలపై రాజ్యమునుంచి అళియరామరాయలు రాజ్యాధికారమునువహించి సలకము తిమ్మయాదులను వధించుటయు జరిగిపోయిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. ఏపున ద్రోహిభావమువహించిన సల్కయ తిమ్మరాజుఁ ద
త్పాపసహాయు సల్కయ యుతంబుగ శౌర్యమువిూఱఁ ద్రుంచివి
ద్యాపురియందుఁ జాలఘనుఁ డయ్యె సదాశివరాజ్య సం
స్థాపకుఁడై సిరంగవసుధావరు రామనరేంద్రుఁ డున్నతిన్.

బాలభాగవతకృతిపతి వంశమువాఁడగు నార్వీటివారికి కర్ణాట రాజ్యముతోను, సాళువ, తుళువవంశములతోడను. స్నేహ, బంధుత్వ సంబంధములు కలిగియుండుటచేతను, సాళువ, తుళువ. ఆర్వీటివంశములతో నాంధ్రకవులకు విశేషసంబంధ ముండుటచేతను. ఈకోనేరుకవి వారికి సమీపకాలముననో సమకాలముననో యుండి యప్పటి వృత్తాంతములను గ్రంథము చేసినవాఁడగుటచేతను ఊహలతో నవసరము లేకుండఁ దనగ్రంథరచనాకాలమును గ్రంథమునఁ దెలిఁగించి యున్నవాఁడగుటను, వీతని రచనలలోని యంశములు చరిత్రకారుల కుపకరించునని తలంచి, గ్రంథవిస్తరభీతిని వదలి ముఖ్యములగు చరిత్రాంశములను గలిగియున్న పద్యములనిట నుదాహరించుచున్నాఁడను. ఆర్వీటివారి వంశవృక్షమునం దీకృతిపతితో సంబంధించినంతవఱకు క్రిందఁ గనుపఱచుచుంటిని. ఇది సంపూర్ణవంశవృక్షము కాదు. సంపూర్ణవంశవృక్షమును తెనాలి యన్నయ చారిత్రమున నిచ్చితిని.

తాతపిన్నమరాజు



సోమదేవభూపాలునిగూర్చి అందుగుల వెంకయ్యకవి చారిత్ర మున వ్రాయనున్నాఁడను. బుక్కభూపాలుని కోనేరుకవి యీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. ధరఁ బ్రసిద్ధుండైన తాత పెన్నమరాజు
తగ నేర్పుణ్యు తాతతాత
భావజ్ఞుఁడగు సోమదేవభూపాలుఁడే
ధర్మప్రవర్తకు తాతతండ్రి
గుణశౌర్యధైర్య భాసురుఁడు రాఘవదేవ
ధరణీశుఁ డేశూరుతండ్రితండ్రి
పెన్నమరాజన్యుఁ డున్నత సౌజన్య
వినుతప్రతాపుఁ డేఘనునితండ్రి

గీ. యతఁడు దన్ను మన్నెపులియని యఖిలదిశలఁ
జెలఁగి పొగడ సాళువ నరసింగరాయ
రాజ్యసంస్థాపకుండయ్యెఁ బొడ్రి నారె
వీటిబుక్కనరేంద్రుఁ డుద్ఘాటితారి

ఈసాళువ నరసింగరాయలనుగూర్చి పిల్లలమఱ్ఱి పినవీరన చరిత్రమున వ్రాసియున్నాఁడను. కర్ణాటరాజ్యమున సంగమవంశమునుండి సాళువవంశములోనికిఁ దెచ్చిన దీసాళువ నరసింగరాయలే. అట్లు తెచ్చుటలో నానరసింగరాయల కీయారెవీటి బుక్కరాయలు సాహాయ్యమొనర్చి, సాళువనరసింగరాయ స్థాపనాచార్య బిరుదమునుసంపాదించెను.

---

వంశవృక్షమునకు వివరణము

౧. ఈనరసింగరాజు నంద్యాల వంశమునకు మూలపురుషుఁడు ఇతని వంశవృక్షమును పింగళి సూరనార్యుని చారిత్రమున నిచ్చెదను.

౨. ఈతిమ్మరాజే పద్యబాలభాగవత కృతిపతి. ఇతనికి నలుగురు భార్యలు పదుముగ్గురు కుమాళ్లు ఇతని వంశవృక్షమును తెనాలియన్నయ చారిత్రమున నిచ్చియుంటిని.

3. ఈనలతిరుమలరాజే కోనేరుకవిచేత పద్యబాలభాగవత, ద్విపద బాలభాగవతములను తండ్రిపేరను, తమ్మునికిని కృతియిప్పించినది.

౪. ఈచినతిమ్మరాజు ద్విపదబాలభాగవత కృతిపతి.

ఈబుక్కభూపాలుని మనుమఁడును, పద్మబాలభాగవత కృతి భర్తయు నగుతిమ్మరాజు, కొన్ని యద్భుత కార్యములను జేసెనఁట. జాత్యంధుఁడగు నొక గొల్లవానికి శ్రీ వెంకటేశ్వరస్వామి యొకకన్ను నిచ్చి రెండవకన్ను నీతిమ్మరాజునిమ్మనఁగా నాగొల్లవాని కితఁడు రెండవకన్నునకు దృష్టికల్గునట్లుచేసెనఁట. ఈవిషయ మీక్రిందిద్విపదలం జెప్పియున్నాఁడు.

అపదృష్టి యగునొక్క యాభీరునకు
నిఘృణుండు వేంకటనిలయుండు చక్రి
యొకకంటిచూపు తానొసఁగి స్వప్నమునఁ
బ్రకటుఁడై తిమ్మభూపాలు మన్నించి
యోకృతకృత్య! నీకుర్వీశ లెనయె
నీకహోబల పుణ్యనిధి మోతుమిత్తుఁ
గరుణ గోపాలుని కడమచూపిమ్ము
నరనాథ! యనుచు నానతియిచ్చుటదియుఁ
గొలువులో నగ్గోపకునకుఁ జూపొసఁగె

ఈతిమ్మభూపతి యొకనాఁడు ససైన్యుఁడై యాత్రమునఁ బడిపోవుచు దప్పికకుఁ జలముఁ గానక భగవత్ప్రార్థన మొనర్చి యొకబుగ్గఁ గల్పించి సైనికుల దప్పిఁ దీర్చెనఁట. అదియీక్రింది ద్విపదలవలనఁ దెలియవచ్చుచున్నది.

బలబలభద్రుఁ డాపాండువంశజుఁడు
ధన్యుండు రామభూధవు తిమ్మనృపతి
సైన్యసమేతుఁడై చైత్రమాసమున
దండుపోవుచునుండి తనభటుల్ త్రోవ
నెండినవోల్ల దప్పిఁ గుందుటయును
నిండుచిత్తమున దోనిసిరంగరాజు
కొండ నెత్తమున వైరుంద్రుఁ దలఁచి

గోవిందు వేఁడి గ్రక్కున నొక్కబుగ్గ
భూవినుతంబుగా బోడవంగఁజేసె
అండజుఁ జూడఁగ నన్నీర మచటఁ
గందుగా విలసిల్లె ఘటికాద్వయంబు

ఈతిమ్మభూపాలుఁడు ఏదులఖానుని బాఱఁద్రోలి వీరనరసింహరాయల కాదవాని దుర్గమును జయించియిచ్చి యాతనిచే స్వామిద్రోహ గండపెండేరమును బడసిన ట్లీక్రింది ద్విపదలలో వర్ణించియున్నాఁడు.

గడుసరి నేదులఖానుజయించె
విక్రమంబున నాదవేని దుర్గంబు
విక్రాంతులెన్న వేవేగసాధించి
సిరులతో వీరనృసింహరాయలకుఁ
బరుపాత్మ దుర్గాధిపతి నొప్పగించి,
గరిమ స్వామిద్రోహగండపెండేర
మరిభీకరముగ రాయలొసంగ నందె
లాలితకీర్తి విలాసుండు పద్య
బాలభాగవతప్రబంధ నాయకుఁడు.

ఈతిమ్మరాజు విషయమే పద్యబాలభాగవతాశ్వాసాంత షష్ఠ్యంతపద్యములలో నీక్రింది విధమునఁ జెప్పియున్నాఁడు.

క. కదనధనంజయునకు మహా
మ్మదు మల్కప్రాణదానమతి కొడ్డియరాయరా
యదశాపట్టున కరిరా
య దళవిభాళునకుఁ బాండవాన్వయపతికిన్.

క. కలకయ తిమ్మాసుర దు
ర్విలసిత విలయాబ్ధిలగన విహ్వాల సుధా
వలయస్థితికృతి విప్రుతో
జ్జ్వలతం ధరణీవరాహ వరబిరుదాంకా!

క. మన్నె దళ ధూమకేతువ!
మన్నియ మృగవేటకార! మాళవరాయా

త్యున్నత మస్తకశూలా!
మన్నె సురత్రాణబిరుద మన్నెవిభాళా!

మ. సహజాంభోజదినేశ! గౌడవరరాజ్యస్థాపనాచార్య! య
ష్వహరిగ్రాయ మనోభయంకర! మహాజన్యస్థలీసాక్షి! శ
స్త్రహతానమిత్రనృపాల! పాలితకళా సామ్రాజ్య సంపూజ్య! ని
త్యహిత శ్రీపద! పట్లవాడగజసింహా! దానశూరోత్తమా!

శా. శ్రీమద్వీరనృసింహరాయ నృపతి శ్రేమోదయా! సాధిత
స్వామిద్రోహరగండమాపుర విరాజద్రామరాట్తిమ్మభూ
పామిత్రార్జిత పుణ్యసత్ఫల! సమస్తాశాంత విశ్రాంత ని
స్సీమోర్వీప్రతిపాదన ప్రతియశా! శీతాంశు వంశోద్భవా!

ఈపద్యములనుబట్టి పద్యభాగవత కృతిపతి యైన తిమ్మరాజు (ఆర్వీటిబుక్కరాజు మనుమఁడు) క్రీ. శ. ౧౫౦౪ మొదలు ౧౫౦౭ సంవత్సరమువరకును కర్ణాటరాజ్యమును బరిపాలించిన వీరనరసింహరాయలకు సాహాయ్యుఁడుగా నున్నట్లు తెలియుచున్నది. సలకము తిమ్మయను వధించుటలో అళియరాజునకితఁడు సాహాయ్యమొనర్చినట్లు పైపద్యములలోనున్నది. కావున ౧౫౪౨ ప్రాంతమువఱకును జీవించియుండినట్లు కనబడుచున్నది. ఇతఁడు గతించినపిమ్మట కొలఁది కాలములోనే యితనిపేర నీకృతిని (పద్యబాలభాగవతమును) కోనేరునాథకవి రచియించియుండును. ద్విపద బాలభాగవత కృతిపతి శాసనములు పెక్కులున్నవి. (రంగాచార్యులవారి శాసనసంపుటములు 2 సం. పుట 914-915 సంఖ్య 51, 55, 67, 70 పుట. 402 సంఖ్య. 717 శా.శ. 1466—1472 పుట 915 సంఖ్య 67) కవికాలము గ్రంథమునందేయున్నది. కావున నీశాసనములతో బనిలేదు.

ఈకోనేరుకవి రచించిన పద్యబాలభాగవతము ముద్రితము కాలేదు. ద్విపదబాలభాగవతమునఁ జతుర్థస్కంధములోఁ గొంతవఱకు మాత్రమే ముద్రితమైనది. వీనియముద్రిత ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్నవి. ముద్రితద్విపద బాలభాగవతము నుండి మచ్చునకై కొన్ని ద్విపదల నీక్రిందవ్రాయుచున్నాఁడను.

వ్యాసులు దొల్లి యాయాత్మజు వెంట
నాసక్తిఁ జను వేళ నాత్రోవయందు

జలకేలిసలుపు నిర్జరసతుల్ శుకుని
కలఁగకూరక యుండి యటుతరువాత
నరుదెంచు తనుఁగాంచి యంతంతవల్వ
లంసి కైకొనఁ జూచి యట్టివిధంబు
నడిగెడు నమ్మునికప్పుడు వేల్పుఁ
బడఁతు లంటలు సౌఖ్యపద్ధతి గాఁగ
నబలయు మగవాఁడు నను బుద్ధినీకు
సొఁగొందుఁగాని శ్రీశుకునకు లేదు
కావున మాకు నిన్గన సిగ్గు వొడమె
నావిధం బమర నాయనఘునిఁ జూడ
ననిపల్కి రనుకథ యఖిలలోకముల
వినఁబడు నెప్పుడు వినుతంబు గాఁగ
నంతక యెచ్చోట నావును బిదుకు
నంతయుఁ దడఁవుకఁ డతఁడెట్టివేళ
నతఁడు భాగవతంబు నానరేంద్రునకు
హితవృత్తిఁ దెలుపుట యెన్నంగవింత ప్ర.స్కం.
హరికంటె దైవమ్ము లేదు హరియె
పరదైవతంబని భజియించువారు
హరిదాసదాసుల కనవరతంబు
హరియ మెచ్చఁగ దాసులై యుండువారు
హరికిఁ గైంకర్యంబు లవిరళభక్తి
నిరతులై కావించు నియతవర్తనులు
శాంతులై దాంతులై సకలభూతముల
నంతస్స్థితునిఁ గాఁగ హరిఁ జూచువారు
ఫలముఁ గోరక యెల్లపనులును హరికి
నలఘుయత్నంబున నర్పించువారు తృ.స్కం.

సాహిత్యరత్నాకరాది గ్రంథములను రచించిన వారణాసి ధర్మ
సూరి సంస్కృతమున బాలభాగవతమును రచియించియుండెను. ఆగ్రం

థమును తెలుఁగుపద్యభాగవతమును గూడ నాకు లభింపకపోవుటచే నీరెండిటికిని గల సంబంధమును జెప్పఁజాలను. కోనేరుకవి తనగ్రంథమున సంస్కృత బాలభాగవతము మాట నెత్తలేదు.

## 195 రాయసం గణపయ్య



ఆంధ్రసాహిత్య పరిషత్తులోనున్న యుదాహరణ గ్రంథములో రాయసం గణపయ్య సౌగంధికాపహరణములోనిదని ఈక్రిందిపద్యముదాహృతమయియున్నది. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియదు. భారతారణ్య పర్వములో భీముఁడు ద్రౌపదికొఱకు సౌగంధికపుష్పములను దెచ్చుటను వర్ణించినకథయే యీగ్రంథమునఁ జెప్పబడియుండును. ఈపద్యమాకథయందలి భీమహనుమంతుల సమావేశ సందర్భములోనిదిగాఁ దోఁచుచున్నది.

శా. అంతంతం గబళింపఁగాఁ గడఁగె బాలార్కున్ ఫలభ్రాంతి, వే
శంతోల్లంఘనకేళి దాఁటెను సరస్వంతున్ మహాదానవా
క్రాంతారామ మహీరుహంబుల నుదగ్రక్రీడఁ ద్రుంచెన్ హనూ
మంతుండున్ గపి యున్నవింగపులె? సామాన్యాటవీచారముల్.

ఈగ్రంథమిప్పుడెచ్చటను గనుపట్టుటలేదు. రాయసము వారాంధ్రదేశమున నియోగి బ్రాహ్మణులలోనున్నారు. ఇతఁడు క్రీ.శ.౧౫౬౦ కంటెఁ బూర్వుఁడు.

## 196 రామరాజు రంగపరాజు



ఈతఁడు చంద్రవంశపు క్షత్రియుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; ఆరవీటిబుక్కరాజునకు మనుమని మనుమఁడు; ఆర్వీటి బుక్కరాజు కుమారులలో నొకఁడైన రామరాజుయొక్క సంతతిలోనివాఁడీరంగప రాజుకవి. రామరాజనునది యింటిపేరుకాదు. రామరాజు సంతతి లోనివాఁడని తెలియుటకై యీకవి రామరాజ రంగపరాజని గద్యలో వ్రాసికొని యుండుటచే రామరాజు రంగపరాజని యితనికి పేరు వచ్చినది. ఈ రామరాజునకు నలువురు భార్యలు. తొమ్మండ్రు కుమాళ్లు. రామరాజుయొక్క రెండవభార్యయైన లక్ష్మమ్మయందు తిమ్మ రాజు, పెదకొండ్రాజు, శ్రీరంగరాజు అని ముప్పురు తనయులు. ఇందులో నగ్రజుడైన తిమ్మరాజు ఈకవికి తాత. ఈతిమ్మరాజును పొట్లపాడి తిమ్మరాజందురు. ఈతిమ్మరాజునకే దోనేరుకోనేరుకవి పద్య బాలభాగవతమును గృతియిచ్చినాఁడు. ఈతిమ్మరాజునకు నలుగురు భార్యలు. పదుముప్పురు కుమాళ్లు. అందులోఁ బెద్దభార్యకుమాళ్ళు నలు గురిలో బెద్దవాఁడైన పినకొండ్రాజు, యీకవికి తండ్రి. ఈపినకొం డ్రాజు భార్య కోనమ్మ. వీరికి కోనేటి తిమ్మరాజు, చినతిమ్మరాజు, అప్పలరాజు, రంగపరాజు అని నలుగురు కుమాళ్లు. అందుఁ గనిష్ఠుఁ డైన రంగపరాజే యీకవిచంద్రుఁడు. ఈతని వంశవృక్షమును తెనాలి యన్నయ చారిత్రమున నిచ్చియున్నాఁడను.

ఇతఁడు, సాంబోపాఖ్యానమను నైదాశ్వాసముల పద్యకావ్య మును రచించి శ్రీరంగేశున కంకితముచేసెను. తనయన్నలనుగూర్చి చెప్పుటలో-

"పినకొండ్రాజాఖండల పుండరీకాక్షుఁడు నరిమండలేశ్వరఖండ పరశుచండకిరణ నిభప్రభావుండై శ్రీవహించె నాపంచ శరమూర్తికిఁ గీర్తిత చరిత్ర పవిత్రయగు కోనమాంబకుం గుమారరత్నంబులు

క. కోనేటి తిమ్మరాజును
శ్రీనిధి చినతిమ్మరాజసింహంబును ల
క్ష్మీనిత్యుఁ డప్పలేంద్రుఁడు
దీనావన కల్పతరులు ధృతిమని రవనిన్

అని కవి తననువిడచి తనయగ్రజులనుమాత్రమే యిటఁ బేర్కొనియుండుటచేతను, గద్యలో రామరాజు రంగపరాజు అనియుండుట చేతను, రంగపరాజును రామరాజు తనయునిగా భావించి కాఁబోలు వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమునందు "ఈకవికృష్ణ దేవరాయని యల్లుఁడైన రామరాజునకుఁ బెదతండ్రి కొడుకైన కోనేటి తిమ్మరాజున కాశ్రితుఁడై యుండినవాఁడు... కోనేటితిమ్మరాజునకును రామరాజునకును, దాతయగు నార్వీటి రామరాజును, కృష్ణదేవరాయని యల్లుఁడగు రామరాజును గవితనసాంబోపాఖ్యానమునం దభివర్ణించి యున్నాఁడు" అనివ్రాసియున్నారు. కాని యది పొరపాటు. కవియైన రంగపరాజు కోనేటి తిమ్మరాజునకుఁ గనిష్ఠసోదరుఁడు కాని యాశ్రితుఁడు కాడు కోనేటి తిమ్మరాజునకు ఆర్వీటి రామరాజు ముత్తాతగాని తాత కాఁడు. ఈవిషయము మీఁదిపద్యములవలన స్పష్టముగాఁ దెలియుచున్నది.

సీ. గురుభక్తి కాంతి సద్గుణదీప్తి బలముల
రామచంద్రామిత్రరచనవాఁడు
శరశౌర్యజవమహౌజ్జ్వల్య పావనతల
నరసింహ విగ్రహనటన వాఁడు
జయగానమతిభూతి సఫలకోపంబుల
గురురాజ గురుభవస్ఫురణవాఁడు
దర్పభోగక్షాంతి దానోన్నతస్ఫూర్తి
వృషభేంద్ర భూదారి విధము వాఁడు
రాజమాతుండె శ్రీరామరాజు తిమ్మ
రాజు పినకొండనృపసుధారాశి విధుఁడు

పరమవైష్ణవ సిద్ధాంతపారదృశ్వ
దీప్తి దినరాజు కోనేటి తిమ్మరాజు.

మ. కులపాథోనిధి పూర్ణచంద్రుఁడగు నాకోనేటితిమ్మక్షమా
తలనాథుం డొనరించు నీవుల యశోధన్యాత్ములై మాన్యులై
బలవిభ్రాజితులై కళాభరితులై భాసిల్లు శ్రీవైష్ణవేం
ద్రులు వర్తింతురు దివ్యభోగనిధులై దుర్వార నిర్వైఖరిన్.

గీ. అతని తమ్ములు చిన్నతిమ్మాధిపతియు
నప్పలక్ష్మాతలేంద్రుండు నమరి రివని
హరిహరులలీల మాద్రేయులట్లు విష్ణు
శంఖచక్రయుగం బనజగము వొగడ.

గీ. తదను సంభవుండ ధర్మార్థమర్మవి
చార చతురనుతిఁ బ్రసన్నకీర్తి
చంద్రికావిధూత చరమాద్రికందరాం
తరఘనాంధకారతతిని గృతిని.

క. రంగప్పరాజ వైష్ణవ
పుంగవ పూజావిధాన పూతాత్ముఁడ శ్రీ
రంగపతికి నొసరించెద
మాంగలికతరప్రచారమణిహారంబున్.

ఈరంగపరాజ కవికిఁ గోనేటి తిమ్మరాజు అగ్రసోదరుఁడని పైని జెప్పియుంటిని. అతనికుమారుఁడైన రామరాజునకు మంత్రియగు పులి జాల సోమయామాత్యునకుఁ దెనాలియన్నయకవి సుదక్షిణాపరిణయ మును గృతియిచ్చెను. ఆందీరంగపరాజు, పినకొండ్రాజునకు నాల్గవ కుమారుఁడని చెప్పియున్న పద్యమునీక్రింద నుదాహరించుచున్నాఁడను.

చ. కులనిధి యానృపాలకుఁడు కోనమదేవి వరించి కాంచె జే
కొట్టఁది నరాతుఁలఁ దునుము కోనేటితిమ్మనరేంద్రు భూమిభృ
త్తిలకము చిన్నతిమ్మవసుధీరసుధానిధి నప్పరాజు ని
ద్గళితశరోధిభూవఃకురంగుని రంగనృపావతంసముఁ.

ఇందునుబట్టి రంగపరాజు కోనేటితిమ్మరాజునకు సోదరుఁడే కాని యాశ్రితుఁడు కాఁడని నిశ్చయమగుచున్నది. ఈకోనేటితిమ్మరాజు తనయయగు రంగమాంబ, అయ్యలరాజు రామభద్రకవికృత రామాభ్యుదయ కృతిభర్తయగు గొబ్బూరి నరసరాజున కర్ధాంగి.

రంగపరాజుకవికిఁ దాతయైన పొన్నసాడి తిమ్మరాజునకుఁ బదుమువ్వురు కుమారులని పైని జెప్పియుంటిని. అందులో మొదటివాఁడే యీరంగపరాజు తండ్రియైన పినకొండరాజు. అతని కేడవ కుమారుఁడైన నలతిమ్మరాజు దోనూరు కోనేరుకవిచేఁ బద్యబాలభాగవతమును రచియింపఁజేసి తనతండ్రియైన తిమ్మరాజున కంకితముచేయించెను. ఈవిషయమును రంగపరాజకవి తన సాంబోపాఖ్యానమునఁ జెప్పలేదు. నలతిమ్మరాజు మృతుఁడైన తండ్రిపేర సంకితముచేయించుటచే నెవరి పేరును జెప్పుటకిష్టములేక యూరకుండెనేమో! కోనేరుకవి రచించిన ద్విపదబాలభాగవతమునుగూర్చి యీక్రిందిపద్యమును జెప్పియున్నాఁడు.

ఈపద్యము సాంబోపాఖ్యానకృత్యాదిలో ౨౨ వ పద్యమగు "నలతిమ్మరాజు" అను పద్యము తరువాత ముద్రితమైనది. ఇది "ఆవిర్భ లేశ్వరానుజుఁడై" యనుపద్యమునకుఁ దరువాత నుండవలయును.

చ. సరసము బాలభాగవతచంపువు దోనురి కోనసత్కవీ
శ్వరరచితంబు రామనృపచంద్రుని తిమ్మయచిన్న తిమ్మభూ
వరుఁ డఖిలావనీజనశివంకరముం గయికొంట యొప్పు శం
కరుఁడు శశాంకరేఖయును గౌస్తుభమంబుజనాభుఁడున్ బలెన్.

ద్విపదబాలభాగవతము క్రీ.శ. ౧౫౪౭ సంవత్సరమున రచియించితినని గ్రంథకర్తయే వ్రాసికొనియున్నాఁడు. కావున నీసాంబోపాఖ్యానమాతరువాత రచియింపఁబడిన దనుట సత్యము.

అళియరామరాజును నీకవి యీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

మ. దివిజేంద్రాభుఁడు కృష్ణరాయ ధరణీదేవేంద్రు జామాత శ్రీ
ధవపాదాంబుజభంభరం బమరు మేధావేధరామప్ప శా

త్రివకంఠాంతరరక్తసీకరసరిద్ధారోర్మిసిద్ధాత ఖ
డ్గవ నీకీర్తిలతాంతగంధిలహరిత్కాంబాకభాభోగుఁడై
మ. మహిఁ నెవ్వా రెన సల్కరాజు చినతిమ్మక్ష్మాపకంఠారుణాం
బుహవిశ్చర్చ్యాతర్పితాసిశిఖికిం బుష్పాయుధస్నిగ్ధవి
గ్రహసౌభాగ్య పరంపరా పరిధికిం గర్ణాటకైశ్వర్యని
ర్వహణావార్యభుజధ్వజాయుధ పరీవారుండు రామప్పకున్
క. శ్రీరంగరాజరామ
క్ష్మారమణునికీర్తి జలధిజాలము దాఁట
న్నేరిచియును నేరదు రిపు
నారీనయనాశ్రుపూరనదిఁ దరియింపన్.

యీపద్యములనుబట్టి చూడఁగా నళియరామరాజు సాంబోపా ఖ్యాన రచనమునాఁటికి జీవించియున్నట్లు స్పష్టముగాఁ గనుపడుచు న్నది. అళియరామరాజు తమ్ముఁడును, వసుచరిత్ర కృతిపతియు నగు తిరుమలరాయలను రంగపరాజు యీక్రిందిపద్యములలో గుత్తిఱ తిమ్మ రాజు అని చెప్పియున్నాఁడు.

ఉ. గుత్తిఱతిమ్మరాజు పసఁగున్ హరగాంగ సితాబ్జకాంతులన్
గుత్తలొనర్చు కీర్తులఁ జకోరదృగాళియు పుష్పధన్వుఁడై
యత్తొగవిందు వంగడమునం దలిభర్తకు సంభవించి రా
యెత్తిన కెత్తువచ్చు సిరియింపుల శౌర్యధనంబు పెంపునన్

ఈతఁడు గుత్తిపాలకుఁడయినందునను, నెఱ్ఱని శరీరకాంతిగల వాఁడగుటను, ఈతనిని గుత్తి + ఎఱ = గుత్తిఱ తిమ్మరాజని యందురు తిరుమల తిమ్మశబ్దములేకార్థ ద్యోతకములు. ద్విపదబాలభాగతమును దోనేరుకోనేరు కవిచే రచియింపఁజేసిన తిరుమలరాజు నల్లనివాఁడగు టచేఁ గాఁబోలు నాతనిని "నలతిమ్మరాజు" అని సాంబోపాఖ్యాన మునఁ జెప్పియున్నాఁడు.

ఈగుత్తిఱ తిమ్మరాజే, అళియరామరాజు క్రి. శ ౧౫౬౪ వ సంవత్సరములోఁ జనిపోయినపిమ్మట దిరుమల దేవరాయఁడై కర్ణాట

రాజ్యభారమును వహించి వసుచరిత్రను గృతినందెను. వసుచరిత్ర
ములో నీతనిని తిరుమల దేవరాయలనియు, జీర్ణకర్ణాటరాజ్య పునరు
ద్ధారకుండనియు, రామరాజ భూషణకవి వర్ణించియున్నాఁడు. వసుచరి
త్రకుఁ బూర్వము రచింపఁబడిన కావ్యాలంకార సంగ్రహమునం దీగు
త్తఅతిమ్మరాజును "ఎఱతిమ్మధరాజాని"యని యొక సామాన్యక్షత్రి
యునిగా నారామరాజభూషణకవియే వర్ణించియున్నాఁడు. దీనినిబట్టి సాం
బోపాఖ్యాన రచనమునాఁటికిఁ దిరుమలరాయలు కర్ణాటరాజ్యమునకు
రాజు కాలేదనియు అళియరామరాజుజీవించియుండెననియు నిశ్చయము
గాఁ జెప్పవచ్చును. కావున నీరంగపరాజకవిహయాణశకము ౧౫౮౭ సంవత్స
రమునకుఁ బిమ్మటను, ౧౫౬౮ కు పూర్వమునను సాంబోపాఖ్యానమును
రచియించెననుట నిస్సంశయము. ఈతఁడీకావ్యమును క్రీ.శ. ౧౫౫౦
ప్రాంతమున రచియించియుండును.

ఈతఁడు తిరుమల శ్రీనివాసాచార్యుని శిష్యుఁడైనట్లు గద్యలో
నీక్రిందివిధముగాఁ జెప్పుకొనియున్నాఁడు.

"ఇది శ్రీమత్తిరుమల శ్రీనివాసాచార్య కరుణాపారంపర్య పా
త్రాత్రేయగోత్రాపస్తంబ సూత్రపవిత్ర సకలకళాభోజరామరాజ
రంగపరాజ ప్రణీతంబైన సాంబోపాఖ్యానము"

పింగళిసూరనార్య రచితమైన కళాపూర్ణోదయ కృతిపతియగు
నంద్యాల కృష్ణమరాజుకూడ శ్రీనివాసాచార్య శిష్యుఁ డయినట్లు కళా
పూర్ణోదయమునందలి యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చు
చున్నది.

క. విశ్రుతతిరుమలతాతా
ర్యశ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్య తనూ
జ శ్రీనివాసగురుచర
ణాశ్రయణ సమార్జితాఖిలాభ్యుదయునకున్.

ఈనంద్యాల కృష్ణమరాజుకూడ నార్వీటి బుక్కరాయల వంశ
ములోనివాఁడే. బుక్కరాయల మనుమఁడైన నరసింగరాజు నంద్యాల
నివాసమేర్పరచుకొన్నందున నాతని వంశీయులు నంద్యాలవారైరి. ఈ

నంద్యాల వంశమును రంగపరాజు గ్రంథవిస్తరభీతిచేఁ గావలయు సాంబోపాఖ్యానమున వర్ణింపలేదు. సరికదా బుక్కరాజున కిరువురు భార్యలున్నారని యైన జెప్పలేదు. నంద్యాల కృష్ణమరాజు, ఆర్వీటి బుక్కరాయలకు మనుమని మనుమని కుమారుఁడు. ఇది నంద్యాలశాఖ. రంగపరాజు శాఖను పొట్లపాడిశాఖయందురు ఈరంగపరాజు ఆర్వీటి బుక్కరాయలకు మనుమని మనుమఁడు.

ఆర్వీటి బుక్కరాజునుండి లెక్కించినచో రంగపరాజుకంటె కృష్ణరాజొక తరముక్రింది వాఁడైనను. వీరిరువురును గొంచెమించు మించుగ సమవయస్కులై యొకగురువునకు శిష్యులై యున్నారు. సాంబోపాఖ్యానమును రచియించునాటికి వసుచరిత్రకృతిప్రధానము కాలేదనుమాట నిశ్చయమే కళాపూర్ణోదయ రచనము పూర్తియ య్యెనో లేదో చెప్పఁజాలము.

కవితండ్రియైన పినకొండ్రాజు కృష్ణదేవరాయలకు సామంతుఁడై యున్న ట్లిక్రింది వచనభాగమును బట్టి తెలియుచున్నది.

"ఇక్ష్వాకోత్రియగోత్రపవిత్రుండు నాపస్తంబసూత్రుండు నై రాజిల్లు రాజాధిరాజ రాజపరమేశ్వరాష్ట దిగ్గాజమనోభయంకర సమరాంగణ సాహిత్య సార్వభౌమ బిరుద సరసనరసవిభు కృష్ణరాయ రాజ్యలక్ష్మీ నిరీక్షణ పక్ష్మంబగు కొండవీడక్షోణకౌక్షేయ......యగు పినకొండ్రాజును" ఇందుఁ గొంతభాగము శిధిలమైపోవుటచేఁ గొండవీడునకును బినకొండ్రాజునకును గల సంబంధము స్పష్టముగాఁ దెలియుటలేదు.

శ్రీకృష్ణునకు జాంబవతియందుఁ గలిగిన సాంబుఁడు ధుర్యోధనుని తనయయగు లక్షణను బరిణయమైన కథ యిందుఁ బ్రధానమగుటచే నీగ్రంథమునకు సాంబోపాఖ్యానమని కవి పేరిడెను. సాంబుని వివాహకథయే కాక అతనితల్లియగు జాంబవతీపరిణయకథయును జాంబవతి శ్రీకృష్ణునకు లభించుటకుఁ గారణమైన స్యమంతకమణివృత్తాంతమును జాంబవంతునితోఁ గృష్ణునకైన యుద్ధకథయును రుక్మిణీ కృష్ణులకుఁ బ్రద్యుమ్న జననమునుగూడ నిందువర్ణించియున్నాఁడు. శృంగార

రసము ప్రధానముగాఁ బ్రబంధమునకుండవలసిన పదునెనిమిది వర్ణనము లును తన గ్రంథమున నుండవలయు ననుకొన్నయే యీతనిచే నిన్ని కథల నీప్రబంధమునఁ జేర్చునట్లుచేసినది. సాంబునకును లక్షణకు ననోన్యప్రేమ యంకురించినపిమ్మట సిద్ధాంతదర్పణుఁ డనువైష్ణవగురు వొకఁడు వారి యనుసంధానమునకుఁ దోడ్పడినట్లు కవి కల్పించినాఁడు. రుక్మిణిచే శ్రీకృష్ణుఁడువలెనే సాంబుఁడును లక్షణను, ఆమె యాదిలక్ష్మీ యాలయమునకేఁగి పూజచేసి వచ్చునప్పుడు చెలికత్తెలతోఁగూడ బలాత్కారముగఁ దెచ్చిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. హరి మును రుక్మిణీజలరుహాననఁ నోర్తునె తెచ్చెఁగాని, యా
హరితనయుండు లక్షణఁ బ్రియాళియుతంబుగ వేగఁ దెచ్చి బి
ట్టరదము మీఁదఁబెట్టె నది యట్టిక! పుత్త్రుఁడు తండ్రికన్న ని
ర్భర బలశౌర్యధైర్యగుణ భాగ్యరమన్ ఘనుఁడైనఁ జెన్నగున్.

అటుపిమ్మట ధుర్యోధనాది భారతయోధులతో సాంబునకు రణంబగుటయు, బలరాముఁడు సాంబునకుఁ దోడుపడి తనహలా యుధముచే హస్తినాపురమును గంగలోఁ దోయఁ బ్రయత్నించు టయు, నప్పుడు కౌరవులు సాంబునకు లక్షణనిచ్చి పరిణయముసేయు టయుఁ జెప్పి గ్రంథమును సమాప్తి చేసెను.

సాంబోపాఖ్యానమును ఆంధ్రసాహిత్య పరిషత్తువారు విద్వాన్ కట్టిసాంబమూర్తి శాస్త్రిగారిచే విపులమగు పీఠికతోఁ బ్రకటించి యున్నారు;

రంగపరాజు కవిత్వము ప్రౌఢమయి యద్భుతకల్పనాచాతుర్య ములతో నొప్పారుచుఁ గదళీపాకమున హృదయంగమమై యొప్పారు చున్నది.

కవిత్రయము యొక్కయు, నాచనసోమన శ్రీనాథులయొ క్కయుఁ గవిత్వరీతులుండునట్లుగాఁ గ్రంథమును రచియింతునని యీ

గ్రంది పద్యములం జెప్పి కొన్నితావుల నుత్తరహరివంశనైషధాది గ్రంథములలోని పద్యముల ననుకరించియున్నాఁడు.

సీ. అభినందనసహస్రి మమరించినన్నయ
భట్టుమార్గము కొంత పరిఢవిల్లఁ
దిక్కన మఖిసూక్తిఫక్కిక యొకకొంత
వెనుపొంద నెఱ్ఱన ప్రెగడఫణితి
యొకకొంత తిలకింప నొకకొంత నాచన
సోము గీర్విభవంబు సొగసుమీఱఁ
ద్రిపురాంతకునివచఃస్థేమంబు నొకకొంత
కొఱల శ్రీనాథోక్తి కొంతనిగుడ
మఱియుఁ దక్కినసుకవుల మధురవచన
రచనలును గొంత రాణింప రసనిబంధ
బంధురముగాఁగ నేనిచ్చుభవ్యకావ్య
హారమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

కవిత్వశైలి తెలియుటకై యందలి యైదాశ్వాసములనుండి యైదు పద్యముల నిట నుదాహరించెదను.

చ. పవడపుఁదీవ చూడుమిదె భామిని కోమలనీలపల్లవ
చ్ఛవియుతశైవలస్తబక సంగతి నింపువహించెఁ గాళికా
భవనము నిర్గమించి పురపద్ధతి కున్ముఖి వైననిన్ను డా
సి విపులబాహుమధ్యమునఁ జేర్చినమామకమూర్తిఁబోలెడున్ ౧ ఆ.

చ. జలములఁ గ్రోలుచుం గిసలశయ్యలఁ దేలుచు సంగమస్పృహం
దొలఁగుచుఁ గుంజపుంజముల దూఱుచుఁ దాపవికారమూఁగుచుం
గలయఁగ మేనఁ గ్రొత్తవలి కాపులు గట్టుచు వీతరాగులుం
బలెఁ జరియింతురాతపసమాగమనంబున నెల్లభోగులున్. ౨ ఆ.

ఉ. తామరనీరు మోవ హిమధాముఁడునుంగళవచ్చి డిగ్గఁ దే
జోమహిమాభిరామ మగుచు న్సదతీవదనంబు వోల్చు నే

మీ ముకురంబుఁ బ్రోవ దది మేనులఁ దేనియలందు రాత్రిహృ
త్తామసుల న్గణింపరుగదా! హరిఁ జేరినవారి వారలున్   ౩ ఆ.

మ. అలగోవర్ధనమెత్తినాఁడ నని గర్వాటోపముం జెందఁగా
వల దీకొండొకకొండ లెత్తునిను సత్త్వస్ఫూర్తి నన్మూర్తిఁగాఁ
బలుమాఱున్నతియింతు నంచు నొకశంపాగాత్రి వక్షోరుహాం
చలము లార్చియఁగఁ గౌఁగిలించె హరివక్షశ్శ్రీ సాపేక్షతన్   ౪. ఆ.

ఉ. కాలఘనంజయుం డదను గాంచి దినాకర మత్స్యయంత్రముం
గీ లెడలించి సంధ్య యనుకృష్ణ నుదంచితరాగవిభ్రమ
శ్రీలలితాంగిఁ గైకొనుడుఁ జేరి తమశ్శ పటలీవిరోధి భూ
పాలకసేన లేయు సితభల్లములంబలెఁ బర్వెఁ దారకల్.   ౫. ఆ

అప్పకవి సాంబోపాఖ్యానములోనిదని యీక్రింది రెండు పద్యములను లక్ష్యములుగా నిచ్చియున్నాఁడు. కాని యాపద్యము లీసాంబోపాఖ్యానమున లేవు. అవి మోచర్ల నన్నయకవికృత సాంబోపాఖ్యానములోని వేమో!

క. మురసంహరు నాటోప
స్ఫురణమ్మెనకున్ సదాశివుం డైనరణ
స్థిర నిలువఁగలఁడె బాణా
సురునకుఁ దోడుపడవచ్చి సొలయుట వినరే.

క. చతురానన నందన! ది
వ్యతపోధనవర్య! యుష్మదాగమనమునన్
గృతకృత్యుఁడ నైతిని నే
నతిపావనమయ్యె నస్మదన్వయ మెల్లన్.

ఈకవి షష్ఠ్యంతములలో "ఆముక్తమాల్యదా కబరాముక్తప్రసవమాలికార్చితునకు" అని వ్రాసి కృష్ణరాయరచితాముక్తమాల్యదను స్మరించియున్నాఁడు.

# 197 తామరపల్లి శరణమంత్రి



ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భార్గవగోత్రుఁడు; చందమంత్రి పుత్రుఁడు; సూరమంత్రికిఁ దమ్ముఁడు; విస్సమంత్రికగ్రజుఁడు.

ఇతఁడు సభాభిరామ మను కావ్యమును రచియించినట్లితని పుత్త్రుఁడైనతిమ్మయ శేషధర్మములలోఁ జెప్పియున్నాఁడు. సభాభిరామమిప్పు డెచ్చటను గన్పించుటలేదు. మిగిలిన విషయములను తిమ్మయకవి చారిత్రమునఁ జూడఁగును. ఈతనితమ్ముఁడైన విస్సమంత్రి అన్నదానముచేఁ బ్రసిద్ధుఁడైన ట్లీక్రింది పద్యపాదమువలనఁ దెలియుచున్నది.

"తగవరియై యన్నదానంబు చేయుచు
వెలసె మాపెదతండ్రి విస్సమంత్రి"

అన్నదానముచే మిగుల బ్రశస్తిగాంచిన విస్సమంత్రి యొకఁడు ముప్పదియిద్దరు మంత్రుల సీసమాలికలో—

"ప్రాణికోటికినెల్ల బహుభక్ష్యభోజ్యాన్న
సత్త్రముల్ పెట్టె విస్సప్రధాని

అని కొనియాడఁబడియున్నాఁడు. ఆతఁ డీతఁడే యనిమొదట ననుకొంటిని. గాని, విమర్శింపఁగా నిరువురు నొకరుకారని తేలినది. ముప్పదియిద్దరు మంత్రులలోఁ బేరొన్నవాఁడు శ్రీనాథునితో సమకాలికుఁడు. ఇతనినిగూర్చియే శ్రీనాథుఁడు—

"స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు?"

అని చెప్పియున్నాఁడు.

శరణమంత్రికాలము పదునాఱవశ శతాబ్దియందుత్తరార్ధమని తిమ్మయ చారిత్రమువలనఁ దెలిసికొనవచ్చును.

ఈతని సభాభిరామమందలి విషయములేమియో తెలియరాలేదు.

# 198 నందూరి మల్లయకవి



ఇతఁడు హరిదత్తోపాఖ్యాన మను ప్రబంధమును రచించినట్లు రామాపెగ్గడ జగ్గనకవి తనప్రబంధరత్నాకరమునందుదాహరించిన పద్యమునుబట్టి తెలియవచ్చినది. ఈగ్రంథమునఁ జెప్పినకథ యేదియో తెలియరాలేదు. ఈకవి చరిత్రమును దెలిసినది కాదు. ఈతనిగ్రంథము నామమాత్రావశేషమైనది. ఆపద్యము నీక్రిందవ్రాయుచున్నాఁడను.

చ. నవరుచి పల్లవస్థితిఁ దనర్చి లసత్సుమనస్సమృద్ధి నై
భవమునఁ బొంది గంధవహబంధురతం దగి యాశ్రితద్విజో
త్సవములఁ బొల్చి వారవనితామణిరీతిఁ దివిష్టపంబు శే
వ వరగజంబు మాడ్కిఁ గ్రతువాటిగతిన్ బురతోఁట లొప్పగున్.

ఇందు హరిదత్తునికథ వర్ణితమైనట్లు గ్రంథనామమునుబట్టి యూహింప నగుచున్నది. ఈహరిదత్తుఁ డెవ్వరో తెలియరాలేదు.



# 199 చెనమల్లు శ్రీగిరన్న



ఆంధ్రసాహిత్య పరిషత్తులో నున్న యుదాహరణ గ్రంథములో చెనమల్లు శ్రీగిరన్న శ్రీరంగమాహాత్మ్యములోనివని నాల్గుపద్యము లుదాహరింపఁబడియున్నవి. అవి ప్రబంధరత్నావళిలో ప్రకటితము లైనవి. ఈతని శ్రీరంగమాహాత్మ్య మెచ్చటను గన్పట్టుటలేదు. శ్రీరంగ మాహాత్మ్యమును భైరవకవియు, కట్టా వరదరాజకవియు, ముకుంద యోగియు, వరమల నరసామాత్యుఁడును, భాగవతుల రామకవియు గుండుపల్లి జగన్నాథకవియు, విజయరంగ బొక్కనాథుఁడును రచియించియున్నారు. ఈశ్రీగిరన్ననుగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఆతని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

క. కాలాగురు కుంకుమ స
మ్మేళనబాలాకుచాగ్రమేదురపరిరం
భాలోలలీలచే హిమ
కాలముఁ గడుపుదురు జనులు కౌతుకమతులై.

చ. తమము నుదుగ్రవజంబు భరింతంబుగ నంతటఁ దూర్పుదిక్కునన్
హిమకరజన్మవేళ నుదయించిన పాండిమ మించి పాటిఁ బ
శ్చిమమున కభ్రలక్ష్మికుచసీమఁ గురంగమదంబలంది హా
రములిడి తాదుకూలమున రత్నగఁ బయ్యెదఁ గప్పిచొప్పునన్

సీ. దీపించు నేవేల్పు దివ్యాంగకంబులఁ
గాళీకుచాంగరాగంబు భూతి!
కొమరొందు నేవేల్పు గురుజటాభరసీమ
నమృతాంశుఖండంబు నభ్రగంగ!
కడుమించు నేవేల్పు గాత్రవల్లిక చుట్టు
వ్యాఘ్రచర్మము వారణాజినంబు?
కరమొప్పు నేవేల్పు కంఠపీఠంబున
భుజగేంద్రహారంబు పునుకపేరు

గీ. అట్టివేలుపు శంకరుం డాదిమూర్తి
వేదవేదాంతవేద్యుండు విశ్వభర్త
వికసితోజ్జ్వలవదనారవిందుఁడగుచు
నుచితరీతిఁ బేరోలగం బున్నయంత

శా. సంతోషంబునఁ బొంది యేలెవిమలస్వాంతున్ మహాదాన వ
ధ్వాంతవ్యూహవిదారణోజ్జ్వల వివస్వంతున్ యశఃపూరితా
శాంతున్ సాహసవంతు నిర్భరజయాయత్తైక విశ్రాంతు ధీ
మంతున్ భర్మనగేంద్రకాంతుని హనూమంతున్ జవాత్యంతునిన్.

"చిరతరపరికాశ శ్రీగిరీశ" యనుమకుటముతో రచియింపఁబడిన సీసపద్య శతక మొకటి శ్రీగిరి శతకమను పేరున నున్నట్లు మడికి సింగనకవి తన సకలనీతిసమ్మతమున నుదాహరించిన యీక్రింది పద్యములనఁ దెలియుచున్నది.

సీ. శీతంబు గిలిబిలి చిలుకలు దూరంబు
వహిఁజూడ నదిపొల్లవ్రాఁతకల్ల
అపరాధములుకోటి నృపుఁ జంపఁ జనుపాటి
మూర్ఖత వెడ వెడ మాటబొంకు
కోపంబు ముమ్మడి కోలాసనలువాడి
సత్యమారజమిాగి జమలితొట్లు
ఆచారమెడఁదప్పు నాశ్రమ మట్టిట్టు
దొరతనంబది పూఁత దురము లేఁత
చరితమెల్ల నింద్రజాలంబు తలఁపెల్ల
నెల్లినంబు మాటలెల్లదంబ
మిట్టికుమతిఁ గొలిచి యెవ్వాఁడు మనఁనోపుఁ
జిరతరప్రకాశ శ్రీగిరీశ.

ఈశతక మీచెన్నమల్లు శ్రీగిరన్నదే యని యనుచున్నారు. కాని యందుల కాధారము గన్పడలేదు. మదరాసు ప్రా. పు. భాండాగారమున నొకతాళపత్రప్రతి శ్రీగిరీశశతక మున్నది. కాని దానికర్త యెవ్వరో తెలియదు. ఈశతకమీతనిదే యైనచో నీతఁడు మడికి సింగనకుఁ బూర్వుఁడై యుండును.

గౌరనకవి విరచితమైన నవనాథచరిత్ర ద్విపదకావ్యమునందు శ్రీగిరికవి పద్యప్రబంధమున రచించిన గ్రంథమునుబట్టి తాను ద్విపద వ్రాసితినని, యీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

"అవికలయోగవిద్యాధికు లైన
నవనాథవరుల పుణ్యప్రవర్తనము
పరఁగ శ్రీగిరికవి పద్యబంధమున
విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర"

ఆశ్రీగిరి యీతఁడేయని యనుచున్నారు. నవనాథచరిత్ర పద్యకావ్యము లభింపకపోవుటచే నాతఁ డీతఁడగునో కాదో నిర్ణయింప

లేకున్నాఁడను. అయినను బలవత్తరమగు సాక్ష్యము లభించువఱ కును నవనాథచరిత్ర కర్త యాతఁడే యనియనుకొందము. అది సత్య మగునేని గౌరనమంత్రి క్రి. శ. ౧౩౮౦-౧౪౪౦ ప్రాంతమువాఁడు కావున నీశ్రీగిరన్న నంతకుపూర్వుఁడై, పదునాల్గవ శతాబ్దియందుఁ బ్రథమార్థమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును. అనఁగా నీశ్రీగిరన్న శ్రీనాథునకంటె నించుక పూర్వుఁడగును. నవనాథ చరిత్రమును రచి యించియుండుటచే నీతఁడు శ్రీశైల ప్రాంతమువాఁడనియును శివభక్తుఁ డనియుఁ దలంపవచ్చును. కాని శ్రీరంగమహాత్మ్య కృతికర్తయగుటచే వైష్ణవమతద్వేషి కాఁడని కూడ తలంపవలసియున్నది.

ఈశ్రీరంగమాహాత్మ్యమందలి పద్యములు కొన్ని రామాప్రెగ్గడ జగ్గకవి తనప్రబంధరత్నావళి యందుదాహరించియుండుటచే నీశ్రీగిరన్న క్రి. శ. ౧౫౬౦ కి పూర్వుఁడగుట నిశ్చయము.

---

# 200 తెనాలిరామభద్రకవి



ఇతఁడు యాజ్ఞ్యవల్క్య నియోగిబ్రాహ్మణుఁడు; పాండురంగ విజయాది గ్రంథ నిర్మాతయై సుప్రసిద్ధ కవిశేఖరుఁడని వినుతిఁగాంచిన రామకృష్ణకవికిఁ దమ్ముని మనుమఁడు. సుదక్షిణాపరిణయ గ్రంథకర్త యగు తెనాలియన్నయకవి కన్నమనుమఁడు; శ్రీశైలమాహాత్మ్యమును రచించిన తెనాలి శ్రీగిరికి మనుమఁడు. అభినవ రామకృష్ణకవికిఁ బుత్త్రుఁడు. ఇతని తల్లి తిమ్మమాంబ.

ఇతఁ డిందుమతీ పరిణయమనుప్రబంధమును రచించి, పాలచూరి కృష్ణభూపాలున కంకితము చేసెను. ఆగ్రంథమందలి యీక్రిందిపద్య ములవలన గ్రంథకర్త వృత్తాంతము తెలియుచున్నది.

మ. నను శ్రీరామ పదాంబుజాతయుగళీనంద ద్విరేఫాయమా
　నని జస్వాంతుఁ దెనాలివంశమణి సన్మానంబు మీఱంగ ర

మ్మని కారుణ్యసమగ్రితం బిలిచి భోజాధీశధీశాలి యి
ట్లనియెం బూర్వకృతి ప్రసంగమున నత్యాసంప సంధాయి తై.

తే. రామభద్రకవీంద్ర! నీరచనదనరు
ధీనుతం బైన యిందుమతీ పరిణయ
మంకితంబుగ మాకు నిమ్మనఘ మైన
కృతిని గా....... తెంకీర్తి గలదె.

సీ. ప్రౌఢి మాపెదతాత పాండురంగాది స
త్కృతులు జేసెను రామకృష్ణసుకవి
యనుజుం డన్నప్ప మాపినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణాపరిణయంబు
మాతాత శ్రీగిరి చాతురివిఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్య కృతియొనర్చెఁ
గడిమి మాతండ్రి యిమ్మడి రామకృష్ణార్యుం
డనగీర్తిఁగనె సంస్కృతాంధ్రములను

తే. వారలను మించె మాయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జకవి రామభద్రసుకవి.

ఈ రామభద్రకవి, తెనాల్యగ్రహారనిర్ణేత యగు తెనాలి రామ కృష్ణుని సోదరునకు మనుమఁ డగుటచే నాయగ్రహారముననే నివసించి యుండెనని తలంపవచ్చును. తెనాలి యిప్పుడు గుంటూరు మండల ములోఁ జేరియున్నది.

కృతిపతియైన పాలచురి కృష్ణభూపాలుఁడు శూద్రుఁ డైనట్లును, తిరుమల శ్రీనివాసాచార్యునకు శిష్యుఁ డైనట్లు నీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడియున్నది.

ఉ. అట్టి చతుర్థగోత్రమున నంబుధినేతకుఁ జంద్రుఁ డోలిమై
పుట్టువిధంబునన్ భువనపుంజము రంజిలి పొంగ సత్కళా

ధట్టమునన్ బుధార్థిజనతానయనోత్పల మోదహేతువై
పుట్టెను రామభూవిభుఁడు ప్రోడలు మండలనాథుఁ డౌనన౯.

తే. తిరుమల శ్రీనివాసాఖ్య దేశికునకుఁ
బ్రబలషడ్దర్శనైకపారఁగతునకు
శ్రీవరునకుఁ బ్రియశిష్యుఁ డగుచు
భక్తిచిగురొత్తఁ గృష్ణభూపాలుఁ డలరు.

కృతిపతికిఁ దాతయైన కృష్ణభూపాలుఁడు కొండపల్లి ప్రభువైన వేంగళనాథుని కుమార్తెను పెండ్లియాడినట్లును, కృతిపతి కొండపలి మాచభూపుని తనయ యగుకృష్ణమాంబను బరిణయమైనట్లును నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

ఉ. మండలనాథ సాంద్రమణి మండనశస్త సమస్తమస్తకో
త్ఖండనచండతాండవవిధా పిచఁడిల మండలాగ్రుఁ డా
కొండపలీవిభుండు రణకోవిదుఁడైతగు వేంగళక్షమా
ఖండలు కూర్మిపుత్రిక జగన్నుత మానవతీ శిరోమణి౯

ఉ. శ్రీనిధియైన కొండపలిసింధుసుధానిధి మాచభూవిభుం
డానతరత్నరాజిమకుటాంబితపాదుఁడు భూపమాత్రుఁడే.

కృతిపతులను వారికిఁ బిల్లలనిచ్చిన కొండపల్లివారిని భూపతులని వర్ణించినను, వారు వాస్తవమున గొప్పరాజ్యాధిపతులని తలంపరాదు. ఆకాలమున రణవిద్యయందు నిపుణులై కొంతసైన్యమును గూర్చుకొని ఒకయూరునో కొన్నియూళ్ళనో స్వాధీనమునం దుంచుకొని యొక రాజునకు సామంతులై వారికిఁ గప్పములఁ గట్టుచు యుద్ధములలో ససైన్యులై వారికి సాహాయ్యమును జేయుచునుఁడువా రనేకులుండెడి వారు. కవులట్టివారిని భూపతులనియే వర్ణించుచువచ్చిరి. వారి నననేల గ్రామమునఁ బెద్దయై యాగ్రామ వ్యవహారములను జక్కఁ బెట్టుచుండు పెత్తనగాండ్రనుగూడ నాకాలమునఁ గవులు, ప్రభువులనియే వర్ణించియుండిరి. ఈపాలచూరి, కొండపలి భూపతు లట్టి చిన్నదండనాయకులని యూహింపఁదగియున్నది. కొండపల్లి కృష్ణా

మండలమునసున్నది. పాలచూరిప్పాడీపేర నెచ్చటనున్నదో తెలియ లేదు. కొండపల్లికి నాతిదూరమున నైజాము రాష్ట్రమున నుండి యుండును.

రామభద్రకవి కవిత్వరసమును జవిచూచుట కాగ్రంథము నాకు లభింపలేదు. ఉదాహృతపద్యములనుబట్టి మనోహరమైన కవిత్వమని తోఁచుచున్నది. ఈగ్రంథముయొక్క యముద్రితప్రతి తంజావూరు సరస్వతీమహాలు నందున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రకటించిన పట్టికలో నుదాహరింపఁబడిన రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. రాజీవకల్హార రాజీవసలిబంభ
రాజీవకాసార రాజితంబు
రాగాది కాంభోజ రాగాదికృతబంధు
రాగాధివాస రమ్యస్థలంబు
నాళీకశరశాత నాళీకలలితాంగ
నాళీకనద్గణికాలయంబు
సంతానభూమిజ సంతానవరభూజ
సంతాన సంత. తాంచద్వనాళి
తే. యతులవాతూలచలకేతనాగబద్ధ
ఘంటికారావతోషితగాంగపులిన
వాలుకాదేవతార్చాతిలోల హృదయ
రైవతకదంబు యయోధ్యాపురంబు.
సీ. బ్రహ్మసంతతికి సౌభాగ్యంబు లొనఁగూడె
మునులకు సంతతామోద మొదవె
వేదాధ్యయనములు వివిధయాగములు
ప్రబలమై విశ్వంభరను జెలఁగె
కామధేనువు లట్ల కడవలకొలఁదిగా
గోగణమ్ములు పాలు కురియఁదొడఁగె

వలెనన్నయప్పుడె వర్షింప మేఘముల్
కొలుచు టెల్లెడ గంపకొలల మించె
ఆ. గృహము బలిసద్మ మయ్యె నయ్యహముల కెల్ల
సకలవర్ణాశ్రమసరణు లొప్పె
యాయురభివృద్ధి ప్రజలందుఁ బెండె
రాజ్యభరమయ్యజునియందుఁ బ్రాజ్యమైన.

ఇక్ష్వాకువంశజుఁడైన యజమహారాజునకును, ఇందుమతికిని జరిగిన పరిణయకథ యిందు వర్ణితమయినది. ఈకథనే మఱికొందఱు కూడఁ బ్రబంధములుగా రచించియున్నారు.

తిమ్మకవి- ఇందుమతీ కళ్యాణమింకను లభింపలేదు

ఈకవి తాతయైన శ్రీగిరికాలము పదునాఱవ శతాబ్దిఁ బూర్వార్ధమని యాతని చారిత్రమున వ్రాసియుంటిని. దానినిబట్టి యీకవి కాల మాశతాబ్దియం దుత్తరార్ధమని నిర్ణయింపవచ్చును.

ఇందుమతీపరిణయ కృతిపతిగురువు తిరుమల శ్రీనివాసాచార్యులని తెలుపు పద్యమును పైని వ్రాసియుంటిని. సాంబోపాఖ్యాన కృతికర్తయైన రామరాజు రంగపరాజునకును దిరుమల శ్రీనివాసాచార్యులే గురువు. ఆ శ్రీనివాసాచార్యులు యౌవనమున రంగపరాజునకును వృద్ధాప్యమునఁ బోలచురి కృష్ణభూపాలునకును గురువైనట్లు తలంచినచోఁ గాలవ్యత్యాసముండదు. రామభద్రకవి క్రీ. శ. ౧౫౭౫ ప్రాంతమున నీయిందుమతీ పరిణయమును రచియించియుండునని తోఁచుచున్నది.

# 201 దామెరల వెంగళభూపాలుఁడు



ఇతఁడు పద్మనాయకకులోత్తంసుఁడు; ఇనగాల గోత్రుఁడు; వెంకటాద్రికిని గురవమాంబకును బుత్త్రుఁడు; వెంగళాధిపతి లక్ష్మాంబి కలకుఁ బౌత్త్రుఁడు.

ఈకవి బహుళాశ్వచరిత్ర మను నైదాశ్వాసముల పద్య కావ్యమును రచియించి, తండ్రికిఁ గృతియొసఁగెను. పద్మనాయకు లను వెలమవారని యీ ప్రాంతములలో ననుచున్నారు. పద్మనాయ కులు శ్రీవిష్ణుపాదోద్భవులని కవి యీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

క. శ్రీపతిపదపద్మమున ఘృ
ణాపటిమ జనించి పద్మనాయకమణులై
దీపొందితి నేపారిన
శ్రీపాదప్రభున కబ్జనృపతి జనించెన్.

ఈదామెరలవారు శూరాగ్రగణ్యులై దండనాథులై పెక్కు యుద్ధములలోఁ బాల్గొనినట్లు బహుళాశ్వ చరిత్రమునందలి వర్ణనము లనుబట్టి తెలియుచున్నది. ఈదామెరలవారు వెంకటగిరి సంస్థానా ధీశులైన వెలుగోటివారి పూర్వులతో కన్యలనిచ్చి పుచ్చుకొని బాంధవ్యములను నెరపినవారు. ఈకృతికర్తకు సవతియన్నగారైన చెన్నభూపతి వెలుగోటి యాచనరపతి సోదరియైన యక్కమ్మను బరిణయమాడెను. ఈగ్రంథకర్తకుఁ మేనత్తయైన వెంకటమ్మను వెలుగోటి యాచకస్తూరిరంగనృపాలుఁడు వివాహమాడెను. వీరి కుమార్తెయే పైనిజెప్పిన అక్కమ్మ వీరికుమారులగు యాచభూప తియు సింగభూపతియుఁ గవికి మేనత్తకుమారులు. ఈకవికిఁ బ్రపితా మహుఁడైన ధర్మారాయఁడు వెలుగోటి తిమ్మయప్రభుని కుమార్తె యైన వెంగళాంబను బెండ్లియాడెను. వీరివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




ఈకవి వెంగళభూపాలుఁడు, ప్రస్తుతమునఁ గాళహస్తి సంస్థానమును బరిపాలించుచున్న దామెర్లవారి పూర్వుఁడని బహుళాశ్వ చరిత్రపీఠికాకారులు వ్రాసియున్నారు. కాని కవికాలమునాటికిఁ గాళహస్తిరాజ్యము వీరిక్రింద నున్నట్లు గాన్పింపదు. ఈకవి పూర్వులు ప్రత్యేక మొకరాజ్యమునకుఁ బాలకులు గానున్నట్లు బహుళాశ్వ చరిత్రయందలి పద్యములవలనఁ గనుపట్టదు. కాని కవి తన తండ్రినిగూర్చి షష్ఠ్యంత పద్యములలో "వాలూరిపురిపతికి" "గడికోట మల్లబిరుదునకు" "ఆంధ్రధరాధినాథునకు" "కొర్గొండసింహబిరుదునకు" అనియు ప్రథమాశ్వాసాంత పద్యములో "భుజాగ్రమహోగ్రజయాంక నిజామశా హైదులశాకుతుపనశాహసమాగత హాటకఘోటకఝాటకరిప్రవరా" అని సంబోధించియుండుటంబట్టి కవిపూర్వు లేదియో చిన్నసంస్థానమున

కధిపతులై కర్ణాటరాజులకు సామంతులై యుండిన ప్రశంసింపఁదగి యున్నది.

కవి తనకు సవతియన్నగారైన చెన్నభూపతిని బది పద్యము లలో వర్ణించియున్నాఁడు. అందుఁ జరిత్రాంశములున్న రెండు పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

సీ. మునుమున్న యేరాజు మున్నవిబైళ్ళను
వేలూరి లింగభూవిభునిఁ గొట్టెఁ
బంచవన్నియడాలు పట్టించె నేరాజు
పరవీరభద్రేభపటలి రెచ్చి
ధీరత గూఢలాతూరిలో నేరాజు
శాత్రవబలముల సంహరించె
శుక్రవారమునాడె చొరఁబాఱి యేరాజు
పాండీని బలముల భంగపఱచె
నతఁడు సామాన్యుఁడే దామరాన్వవాయ
కలశవారాశిపూర్ణరాకాశశాంకుఁ
డనఁగ గడికోటమల్లశుభాంకయుతుఁడు
వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు.

మ. పరిఘాసౌధగభీరతోన్నతులచే బల్రాయిడిం బెందియుం
దరియంజాలరు పన్నగామరులన న్గాసిల్లునాదీప్రవ
ర్పిరమన్వేలురిరాజధానిని దృణప్రాయంబుగాఁ గొన్నయ
న్నరనాథాగ్రణిఁ జెన్నభూపమణి నెన్నన్ శక్యమే యేరికిన్.

సీ. తనకీర్తి విధునిరీతినిఁ బొల్పుగనుటనో
కలశవారాశితోఁ గలసిమెలఁగుఁ
దనసాంద్రధామంబు తరణితీరగుటనో
ద్వీపాంతరంబులఁ దిరుగుచుండుఁ
దనవిక్రమము జిష్ణునవువన మనుటనో
యెపుడు సుధర్మాప్తి నింపుఁగాంచుఁ

దనయాగి సురభిచందమున వర్తిలుటనో
సుమనోమనోహరస్ఫురణ మించు
ననుచు జను లనుదినమును వినుతిసేయ
రాయసింహాసనసముద్ధరణధురీణ
శీల దామర్ల వేంకటక్షితితలేంద్రు
తనయుఁడైనట్టి చెన్నభూధవుఁడు వెలయు.

ఇందలి గడికోట కడపమండలమున రాయచూటితాలూకాలో రాయచూటి కీశాన్యమున ౧౬ మైళ్లలో నున్నది. ఈతని రాజధానియైన వేలూరు ఉత్తరార్కాడు మండలమున నిప్పుడు రాయవెల్లూరని యనుచున్న గ్రామమైయుండును.

పై పద్యములోఁ జెన్నభూపతిని "రాయసింహాసన సముద్ధరణధురీణు"డని చెప్పియుండుటచే నీతఁడు కృష్ణదేవరాయలకుఁ బిమ్మటఁ గర్ణాట రాజ్యమును బరిపాలించిన యొక రాయలకు సామంతుఁడుగానో దండనాయకుఁడుగానో యుండి యుద్ధములలోఁ బాల్గొనినటూహింపఁదగియున్నది. ఈరాయలు సదాశివరాయలై యుండును.

ప్రథమాశ్వాసాంతపద్యములోఁ గృతిపతిని "నిజామశహైదులశాకుతుపశాహసమాగత హాటక ఘోటక ఝాటకరిప్రవరా" అని సంబోధించియుండుటచేఁ గవితండ్రియైన వెంకటాద్రి కులీకుతుబ్షాకాలములో నున్నవాఁడు. కావునఁ గవి క్రీ. శ. ౧౫౫౦—౧౫౯౦ నడుమనున్నవాఁడని బహులాశ్వచరిత్రపీఠికాకారులు వ్రాసియున్నారు. వెలుగోటి కస్తూరిరంగభూపతిని బట్టియు నాతని తనయుఁడైన బంగారు యాచభూపతి ననుసరించియు నీకాలము సరియయినదని ధ్రువపడుచున్నది.

కవి కన్నగారైన చెన్నభూపతి వెలుగోటి కస్తూరి రంగనాయని కల్లుఁడు. బంగారు యాచమనాయని సోదరీభర్త. ఈతనినిగూర్చి దామెర్ల అంకభూపాలుని చారిత్రమున వ్రాయుదును. వెంగళభూపాలునకు రెండవయన్నగారైన కేశవనాయనిశాసన మొకటి

నెల్లూరు మండలమునఁ గలదు. అది శా. శ. 1501 (క్రీ. శ. 1579) నాఁటిది ౧. కావునఁ గవికాలము పైనిఁజెప్పినదేయగును. పది-పదు నైదేండ్లీవలకు వచ్చునుగాని వెనుకకుఁబోవదు. ఇతని కాలము ౧౫౪౦-౧౬౦౦ నడుమననియు, ౧౫౮౦ ప్రాంతమున నీకావ్యము పుట్టియుండుననియు నిశ్చయింపవచ్చును. ఈదామెరవారు కవిపండితపోషకు లగుటయేగాక స్వయముగఁ బండితులై కవులై కీర్తికాయులై యుండిరి.

ఈ వెంగళభూపాలుని కవిత్వము ప్రౌఢమై చక్కని భావములం గల్గి మనోహరముగా నున్నది. శైలికై యాశ్వాసమున కొక్కపద్య ముదాహరించెదను.

బహులాశ్వచరిత్రము:—

శా. ఏమీ సంయమసార్వభౌములు శుభంబే హవ్యకవ్యక్రియా
సామర్థ్యంబునఁ దొంటియట్లనె కదా శక్రాహిత శ్రేణిచే
బాముల్రావుగదా! ముదాస్పదములై భద్రోన్నతు లూచ్చెదుఁ
మీమీమోములె యంతెచాలు నివిసుమ్మా నేఁడుమాకిష్టముల్ ఆ ౧

చ. చిలుకలలోనఁ జిల్కలయి, చెల్వఁపుఁ బొన్నలలోనఁ బొన్నలై
యలరులలోనఁ దామలరులై, నునుదీవలలోనఁ దీవలై
తలిరులలోనఁ గెందలిరుతండములై, మృదువాణు లగ్ర్యనా
భులు దరహాస లుజ్జ్వలవపు ల్మధురాధర లాటలాడుచుఁ. ఆ ౨

ఉ. క్రిక్కిఱియం గవుంగిట బిగించెదు నీయెద కౌస్తుభంబు నా
చిక్కని గుబ్బసందిటను జిక్కెను దుత్తుము రౌనటన్న నీ
చక్కెర మోవి మానికమె చక్కఁగఁ జిక్కె నదేటి కన్న మే
ల్గ్రిక్కిన నెక్కళావతికిఁ గానుక చేసితొ నందనందనా!... ఆ. 3

౧. నె. శా. సం. 2 పుట 659- చెన్నప్పనాయనితండ్రి వరదానాయఁడని యిందు న్నది. దీనినిబట్టి కవికిఁ జెన్నప్పనాయఁడు సవతియన్న కాక పెదతండ్రి కుమారుఁ డగును.

ఉ. రామునిఁజూచి కాముని శరంబులఁ గాసిలి చేష్ట దక్కి కాం
తామణి యుండె నోర్తు రఘునందన పాదరజంబుచేత ముం
గోమలిరేఖ రాతి కొనఁగూడెనొ లేదొ యటంచు నెంచిలీ
లామహితాంగ మొదఁగశిలామయరూపముఁదాల్చెనో యనన్ ఆ.౪

ఉ. ఎక్కువ దెచ్చి తక్కువకు నింటికడ న్నర కమ్మఁజూచుటో
వక్కలు నాకులమ్మబుధవారపు సంతకు జట్టిగట్టుటో
లెక్కల సంపుటంబుఁ బ్రిబలించుటో కోమటివారి పిన్నవాఁ
డెక్కడ లంజెబేర మదియెక్కడ నెక్కడికెక్క డక్కటా! ఆ.౫

---

# 202 గౌరనకవి



రామాప్రెగ్గడ జగన్నాథకవి తనప్రబంధరత్నాకరమునం దీక్రింది రెండుపద్యములను గౌరనకవి నవగ్రహ స్తోత్రములోనివిగా నుదాహరించియున్నాఁడు. ఈకవినిగూర్చి యేమియుఁ దెలియదు. హరిశ్చంద్ర చరిత్ర నవనాథ చరిత్రలను రచియించిన గౌరనకవి యొకఁడు కలఁడు కాని ఆయన గ్రంథములు ద్విపద కావ్యములు. ఈక్రింది పద్యములను బట్టి చూడఁగా నీకవి నవగ్రహస్తోత్రమను కావ్యమును రచియించి యుండలేదనియు, తొమ్మిదిగ్రహములను దొమ్మిది చాటుపద్యములలో స్తోత్రముచేసియుండుననియు, లేదా సత్యవోలు భగవత్కవి రుక్మిణీపరిణయములోని దశావతార పద్యములవలె, నితొమ్మిదిపద్యము లేదేని యొకకావ్యము లోనివయియుండుననియు నూహింపఁదగి యున్నది.

ఉ. మొక్కులయిక్క కాంతిగల మువ్వురువేల్పులమూర్తి చీఁకటిన్
మెక్కెడిమిత్తి పద్మములమేలు నవగ్రహరాజు మింటిపై
నెక్కెడు మానికంబు దినమేలిక సింహవిభుండు ముక్తిపెన్
జక్కెర యింద్రమిత్రుఁడు ప్రసన్నత మాకుఁ బ్రసన్నుఁడయ్యెడిన్.

చ. హరుతలపూ చకోరములయామని పాల్కడ లుబ్బువందు శ్రీ
వరునిమఱంది తారకలవల్లభుఁ డిందిరతోడఁబుట్టువం
బురుహముదాయ కల్పలతప్రోది యనంగునిమామ తేవిభుం
డరయఁగఁ గర్కటేశుఁడమృతాంశుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్

ఈకవిచరిత్ర మింతకంటె నేమియుఁ దెలియరాదయ్యె. సూర్య చంద్రులను వర్ణించిన పై రెండుపద్యములుదక్క ఇతర గ్రహవర్ణనము లభింపలేదు.

---

# 203 చెదలువాడ మల్లయకవి



ఇతఁడారువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; లింగనామాత్యునకును, గామాత్యంబకును బుత్రుఁడు యెఱ్ఱనామాత్యునకుఁ బౌత్రుఁడు; మల్లనామాత్యునకుఁ బ్రపౌత్రుఁడు భారతకవిత్రయములో నొకఁడై యసమాన ప్రతిభఁగాంచిన యెఱ్ఱాప్రెగ్గడ వంశములోనివాఁడు.

మల్లయకవి విప్రనారాయణ చరిత్రమను నైదాశ్వాసముల శృంగార పద్యకావ్యమును, రుక్మాంగద చరిత్రమను ద్విపదకావ్యమును రచించెను. ఈతఁడు విప్రనారాయణ చరిత్రమునఁ దనవంశకర్తయగు నెఱ్ఱాప్రెగ్గడ నీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప
నేర్తునే నైన నేను వర్ణింతునతని
చిన్నమనుమఁడఁ గావునఁ జిరుతవాండ్ర
కొదలుపలుకులు ముద్దుచేయుదురుగాదె

సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవులపండువులు గాఁగ

వల్మీకభవవచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణ మొనర్చి హరిమెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ (రెండును)
రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న

ఆ. దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద
ల్వాడనిలయు నాదవంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ
డను నుతింప బ్రహ్మకును దరంబె.

కృతిపతిపలికినట్లు కవి రచించిన యీ క్రిందిపద్యమును బట్టి కొందఱీకవి కవిత్రయములోని యెఱ్ఱాప్రెగ్గడకు సాక్షాత్పౌత్రుఁడని భ్రమపడుచున్నారు కాని యది సత్యము కాదు.

క. అనుపమ రచనఁ ద్విపదగ
మును రుక్మాంగద చరిత్రమును మహిమ నొన
ర్చినకృతి నెఱ్ఱాప్రెగ్గడ
మనుమఁడ వనఘుఁడవు నీవు మల్లనసుకవీ!

పై పద్యములలోని "చిన్నమనుమఁడ"నియు "నాదవంశకర్త" యనియు ఈక్రింద నుదాహరింపఁబడిన గద్యలో "ప్రబంధ పరమేశ్వర వంశపవిత్ర" యనియుఁ జెప్పుకొనుటచే నెఱ్ఱాప్రెగ్గడకీతఁడు కేవల పౌత్రుఁడు కాఁడని స్పష్టమగుచున్నది.

గద్య:— ఇది శ్రీశంకరస్వామి సంయమీశ్వరచరణ సరోరుహధ్యానానంద సౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వర వంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చెదల్వాడ మల్లన నామధేయ ప్రణీతం బైన విప్రనారాయణ చరిత్రంబను మహాప్రబంధంబు "ఈతని తాత యెఱ్ఱనయనుట వాస్తవమే కాని యతఁడు కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ కాఁడు."

కవి యీవిప్రనారాయణ చరిత్రమును. కాఙ్చీటిసగర సంస్థానాధిపతి యగు తిరుమలరాజున కంకితము చేసియున్నాఁడు. కృతిపతి తననుగూర్చి పలికినట్లుగా రచించిన యీక్రింది పద్యములవలన కవి కులగోత్రాదులు తెలియుచున్నవి.

క. వినయోన్నతుఁ గామాక్షీ
జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని నార్వేలాన్వయ
జనితుని శ్రీవత్సగోత్రు శైవాచారుఁ.

గీ. నన్నుఁ బిలిపించి యర్ధాసనమున నునిచి
యాదరోక్తుల నిట్లని యానతిచ్చెఁ
బెక్కుదేశగులఁ గృతులు చెప్పించుకొంటి
నైన నాకొక్క పద్యకావ్యంబు వలయు.

ఉ. శాతకృపాణనిర్గళిత శత్రుఁడు సాళ్వనారసింహ ధా
త్రీతల భర్తయు గజపతి ప్రముఖుల్ చతురంతయానభూ
పాతపనీయ వస్తువులొసంగఁ దనర్చిరి నీయనుంగుము
త్తాతయుఁ దాతయు న్భువివిధాతలు మల్లన యెఱ్ఱనార్యులే.

శా. రాజుల్ మెచ్చఁగఁ జెప్పి కావ్యములు హేరాళంబుగా నద్రిక
న్యాజాని న్భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినముం బంచాక్షరీ మంత్రముం
దేజోవంతుఁడు లింగనార్యుఁడు గుణోత్కృష్టుండు మాతండ్రియుఁ.

కవితండ్రియైన యీలింగనార్యుఁడు రచించిన గ్రంథములేవియో తెలియలేదు. కవికిఁ దాతయైన యెఱ్ఱనార్యుఁడును ముత్తాతయైన మల్లనామాత్యుఁడును, సాళువ నరసింహరాయనిచేతను గజపతులచేతను బహూకరింపఁబడినట్లు చెప్పఁబడిన పై పద్యమునుబట్టి యీకవికాలమును నిర్ణయింపవచ్చును.

ఇందుదాహరింపఁబడిన సాళువనరసింహరాజు, పిల్లలమఱ్ఱి పినవీరనకవిచే జైమినీభారతమును గృతినందినవాఁడే కాని యన్యుఁడు

కాఁడు. ఇతఁడు క్రి. శ. ౧౪౫౬ మొదలు ౧౪౭౦ వఱకును కర్ణాట రాజుల దండనాయకుఁడుగను కర్ణాట రాజ్యాధిపతిగను నుండెను. ఈతనినిగూర్చి పినవీరనకవి చారిత్రమునను నంది మల్లయ్య, ఘంట సింగయ్య కవుల చరిత్రమునను విపులముగాఁ జర్చించియున్నాఁడను. పై పద్యములోఁ జెప్పఁబడిన గజపతులు నెల్లూరుమండలములోని యుదయగిరి వఱకును రాజ్యపరిపాలనము చేసినవారు శ్రీకృష్ణదేవరాయలుదయగిరి దుర్గమున వీరప్రతాపరాయని క్రి. శ. ౧౫౧౫ వ సంవత్సరమునఁ బట్టుకొని యుదయగిరిదుర్గమును స్వాధీనముచేసికొను వఱకును గజపతు లాప్రాంత దేశమును బరిపాలించుచుండిరి. దీనినిబట్టి కవి తాతముత్తాతలు క్రి. శ. ౧౪౫౦–౧౫౧౫ నడుమ నుండి రని చెప్పవచ్చును. కవి తండ్రి ౧౫౫౦ ప్రాంతమునను కవి ౧౫౮౦ ప్రాంతమున నున్నా రని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు.

విప్రనారాయణ చరిత్ర కృతిపతి మాకరాజు కుమారుఁడైన తిరుమలరాజు. ఇతఁడు కార్వేటి నగరసంస్థానాధిపతి. కార్వేటినగర ముత్తరార్కాడు మండలములోనిది. ఈ కార్వేటినగర సంస్థానమును జైమినిభారత కృతిపతియైన సాళువగుండ నరసింహరాజు పరిపాలించి నట్లు కొందఱు తలంచుచున్నారు కాని యందు సత్యమున్నట్లు కన్పట్టదు. కార్వేటి నగరసంస్థానాధిపతులుకూడ మొట్టమొదట 'సాళువ' యను గృహనామము గలవారే, కాని వారు రెడ్డికులజులు- జైమిని భారత కృతిపతులయిన సాళువవారు చంద్రవంశపు క్షత్రియులు. ఈ సాళువవారికిని ఆ సాళువవారికిని సంబంధములేదు. కార్వేటినగర రాజ్యాధిపతులను గురించి స్క్వాయల్ పండితుఁడిట్లు వ్రాసియున్నాఁడు. (ద. హిం. శా. చరిత్ర సం ౨ పుట. ౧౮౪)

"గోదావరి మండలములోని పిఠాపుర ప్రాంతమునుండి యెనిమిదియవ లేక తొమ్మిదవ శతాబ్దులయందు వలసవచ్చిన సాళువ రెడ్డి రాజుల పరిపాలనములో కార్వేటి నగర సంస్థానము పూర్వముండెడిది. వీరిలో సాళువ నరసారెడ్డి యనునాతఁడు తూర్పుచాళుక్య

రాజులలో కడపటివాఁడైన విక్రమాదిత్యునివలన (క్రి. శ. ౧౦౧౬–౧౦౨౩) తిరుపతిప్రాంతదేశమునకు సామంతుఁడుగా జేయఁబడియెను. అతఁడచ్చటఁ దనపేర నరసాపురమను పట్టణమును గట్టించెను. అతని వంశవృక్షము కొంతవఱకు క్రింద నీయఁబడినది.

సాలువ నరసారెడ్డి (మొదటి ప్రభువు క్రి. శ. ౧౦౨౦)
|
....
సాళువ వెంకటపతి నాయుఁడు (చోళులీతని రాజ్యభ్రష్టునిగావించిరి)
|
సాళువ భీమానాయఁడు (తండ్రిరాజ్యమును దిరిగి సంపాదించెను)
|
సాళువ నరసింహనాయఁడు (ఇతఁడు చేరరాజయిన కీర్తివర్మకు సాహాయ్యము చేసి యాతని వలన స్వాతంత్ర్యమును బడసి ౩౫ సంవత్సరములు రాజ్యముచేసెను.)
|
సాళ్వ భుజంగనాయఁడు (పడమటి చాళుక్యరాజయిన వీర సోమేశ్వరుఁ డీతనిని జయించి చెఱగొనిపోయి కల్యాణపురమున నుంచెను. ఈతఁడందే చనిపోయెను.)
|
...
|
... సంస్థానమును తిరిగి సంపాదించెను.

శా. శ. ౧౧౫౨ (క్రి. శ. ౧౨౩౦) లో చోళవంశీయుఁడగు రెండవరాజరా జీసంస్థానముక్రింద ౨౮ గ్రామములనుంచి తక్కిన దేశమును దన రాజ్యమునఁ గలుపుకొనియెను. కాని పిమ్మట నాలుగుతరములలో చోళులపరాక్రమము తగ్గిపోవుటచేఁ గార్వేటినగరమువారుబలవంతులై తమరాజ్యమును బెంపొందించుకొనిరి. శా.శ. ౧౨౩౬ (క్రి.శ.

౧౩౧౮ లో నీకార్వేటి నగరపు రెడ్డిరాజు కొండవీటి రెడ్డి రాజులలో మొదటివాఁడైన ప్రోలయరెడ్డిని తనకల్లునిగాఁ జేసికొనఁగలిగెను. అటుపిమ్మట నీసాళువరెడ్డిరాజులు క్రమముగా విజయనగర రాజులకు సామంతులై దాదాపు రెండువందల సంవత్సరములు కార్వేటినగరరాజ్యమును బరిపాలించిరి. అప్పు డీసాళ్వరెడ్డిరాజుల వంశమంతరించినది. అటుపిదప నారాజ్యము బొమ్మరాజు వంశమువారి స్వాధీనమైనది. సాళువరాజులలో కడపటివాఁడైన శేషాచలరెడ్డి తనతరువాత రాజ్యమునకువచ్చువారందఱును సాళువనామమును ధరించుచుండవలయునను నియమమేర్పరచెను. అందుచే నీకార్వేటినగరరాజు లందరును 'సాళువ' బిరుదమును వహించుచున్నవారు. ఈరాజ్యము మొదట తూర్పుచాళుక్యులయనుగ్రహముచే వచ్చినందులకు సూచకముగ వారిరాజ్యలాంఛనములను వీరును ధరించుచున్నారు.

ఈ కార్వేటినగర సంస్థానమును గురించి ఉత్తరార్కాడు మండలము యొక్క మాన్యూయల్‌లో నిట్లు వ్రాయఁబడియున్నది. "ఉత్తర సర్కారులోని యొక క్షత్రియ కుటుంబమునందలి గద్దెమాకరాజు, బొప్పరాజు, అనునిరువు రీకార్వేటినగర ప్రాంతమునకువచ్చి యచ్చట నున్న బందెపోటు దొంగల గుంపులను బరిమార్చిరి. అప్పటిప్రభువా వార్తను విని వారిని బిలిపించి తన సంస్థానమునం దుంచుకొనియెను. ఆప్రభువు సంతానవిహీనుఁడు కాఁగా మాకరాజు సింహాసనస్థుఁడయ్యెను బొప్పరాజు మంత్రియయ్యెను. వీరు శుద్ధక్షత్రియులు."

దీనినిబట్టి చూడఁగా, జైమిని భారతకృతిపతు లగు సాళువవారికిని, కార్వేటినగర రాజులగు సాళువవారికిని సంబంధము లేనట్లు స్పష్టమగుచున్నది. కార్వేటినగర రాజ్యమును క్షత్రియులగు సాళువవారెప్పుడును బరిపాలించలేదనియు, దానిని పదునొకొండవ శతాబ్ది మొదలు పదునైదవ శతాబ్దివఱకును సాళువ రెడ్డిరాజులును, బిమ్మట మాకరాజు వంశీయులును, ఆతరువాత వెల్లంటివారును బరిపాలించినట్లు

గన్పట్టుచున్నది. మాకరాజువారును, వెల్లంటివారును గూడ సాళ్వ బిరుదమును ఇప్పటివఱకును వహించుచునే యున్నారు.

మల్లయకవి రచించిన విప్రనారాయణ చరిత్రములోని యీ క్రింది పద్యమువలన మాకరాజువారి యింటిపేరు పాకమువారయిన ట్లును వీరు చంద్రవంశపు రాజు లైనట్లును దెలియుచున్నది.

ఉ. ఆ కమనీయమూర్తికి యయాతి జనించెను తత్కులంబునం
బాకము రాచిరాజనునృపాలుఁడు పుట్టె బలంబు శత్రులుం
టాకముగాఁగ లోకము ననారతమై జభుజాపదానజ
ల్పాకముఁగ మించెను దపఃపరిపాకమహత్త్వసంపదన్.

కృతిపతి వంశమును గవి నుప్పది పద్యములలో వర్ణించియు న్నాఁడు. వానినిబట్టి యీవంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

రాచిరాజు
- తిప్పరాజు
  - ముమ్మడిరాజు
    - పెదమాకరాజు
    - ఎఱమాకరాజు
      - కుమారమాకరాజు
        - సింగరాజు
    - లక్ష్మీపతిరాజు
    - ముమ్మడిరాజు
      - ఎఱమాకరాజు
      - వెంగళరాజు
      - బయ్యమాకరాజు
      - రఘుపతిరాజు
      - లక్ష్మీపతిరాజు
      - తిప్పరాజు
      - తిమ్మరాజు
        - లక్ష్మీపతిరాజు
          - చినతిరుమలరాజు
        - మాకరాజు (కోట)
          - తిమ్మరాజు కృతిపతి
          - బొమ్మరాజు
          - లక్ష్మీపతిరాజు
        - పాపరాజు
      - రామరాజు
      - నాదరాజు
      - ఎఱమాకరాజు
    - ఎఱ్ఱరాజు
    - తిమ్మరాజు

ఈరాజులను వర్ణించిన పద్యములను బట్టి యిందే మాకరాజు కార్వేటి నగరరాజ్యమును సంపాదించెనో చెప్పవీలుకలుగలేదు. కృతిపతియైన తిమ్మరాజును, "సాళ్వతిమ్మాధిపుఁ" "సాళ్వమాకధరణీశ్వరు తిమ్మనృపాలు"ననియు కవి వర్ణించియుండుటచే, స్క్వాయల్ పండితుఁడు వ్రాసిన కథ సత్యమని విశ్వసింపఁదగియున్నది. తిమ్మరాజు నామధారులు క్షత్రియ సాళ్వవంశమందు పెక్కురుండుటచే నీతఁడు వారిలో నెవ్వరైన నయియుండునని కొందఱు భ్రమకొందుచున్నారు కాని యది సత్యముకాదు. క్షత్రియ సాళ్వులలో మాకరాజు పేరుగల వారు లేరు. పై వంశవృక్షములో చెప్పఁబడినవారు క్షత్రియులైనను, వారు వేసికొనిన సాళ్వబిరుదము క్షత్రియసాళ్వులను బట్టి వచ్చినది కాక రెడ్డిసాళ్వులనుబట్టి వచ్చినదిగా నూహింపఁదగియున్నది. కృతిపతియైన తిరుమలరాజును "నరనుతకఠారి సాళువవరబిరుదాంకునకు" అని యొక పద్యములోఁ గవి వర్ణించియున్నాఁడు. కఠారిసాళువ మేదినిమీసరగండ బిరుదములు క్షత్రియులైన సాళువవారికిఁ జెందినవైయున్నవి. ఈబిరుదములను రెడ్డిసాళువవారుకూడ వేసికొనిరేమో! విప్రనారాయణ చరిత్రమునఁ గార్వేటినగర ప్రశంసగాని దాని పూర్వనామమయిన తుండీరమండల ప్రశంసగాని కన్పట్టుటలేదు. కారణము దురూహ్యముగా నున్నది. కాని యీ కవికాలమున కార్వేటినగరము సాళువ రెడ్డిరాజుల పరిపాలనములో నున్నదని చెప్పుటకుఁ దగిన యాధారములు గానరావు. స్క్వాయల్ పండితుని గ్రంథమునుబట్టి క్రి. శ. ౧౫౩౦ ప్రాంతమువఱకును నీరాజ్యము సాళువరెడ్ల పరిపాలనములో నున్నట్లును దరువాత మాకరాజు వంశీయులకు వచ్చినట్లును దెలియుచున్నది. మల్లయకవి తాతతండ్రులను బట్టి మల్లయకవి క్రి. శ. ౧౫౮౦ ప్రాంతమువాఁడని నిర్ణయించియున్నాము. కృతిపతి కాలముకూడ నిదియేకదా! ఈతని తండ్రియైన మాకరాజు ౧౫౫౦ ప్రాంతమువాఁడని తేలుచున్నది. స్క్వాయల్ పండితుని కాలమును ఈకాలమును, నించుమించుగా సరిపోవుచున్నది. ఈమాకరాజును విప్రనారాయణ చరిత్రకృత్యాదియందు,

శా. ఆలక్ష్మీపతి సోదరుండు నయవిద్యాశాలి మాకావసీ
పాలుం డాదిమ దానవర్తనమునం బ్రఖ్యాతుఁడై వైభవ
శ్రీలన్నించెను బంధుజాలమును బ్రోచె న్నీతిచే భూతలం
బేలెన్ వైరులఁదోలె వింధ్యగిరి మధ్యకాననశ్రేణికిన్.

మ. నృపచూడామణి యావదాన్యగుణశాలీనుండు జన్యక్రియా
నిపుణుల్ జెప్పఁదియేడుపాళెములు మన్నీలేక మైవైచ గుం
డ్లపయి న్వచ్చినఁ గోటవెల్వడియె లీలన్ గోటమాకక్షమా
ధిపుఁ డంచు న్నుతియింప వారిభుజశక్తిన్ గెల్చె సామాన్యుఁడే?

అని వర్ణించియున్నాఁడు. ఈపద్యములలోఁ జెప్పఁబడిన విషయములే స్యూయల్ గ్రంథమున 'దోపిడి దొంగలగుంపు" అని వర్ణింపఁబడియెనేమో యని యూహకల్గుచున్నది. ఇది నిజమయ్యెనేని క్రీ.శ. ౧౫౩౦ ప్రాంతమున నీకార్వేటినగరరాజ్యము మాకరాజు వంశములోనికి వచ్చియుండునని యూహింపఁదగియున్నది.

ఈకవి రచించిన రుక్మాంగద విజయద్విపద కావ్య మిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. కాకునూరియప్పకవి రుక్మాంగద విజయ ద్విపదకావ్యములోనిదని యీక్రింది ద్విపదము నుదాహరించినాఁడు.

శ్రీకరగుణసాంద్ర చిరయశోరుంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర!

దీనినిబట్టి యీకావ్యము రామయామాత్య భాస్కరున కంకితమైనట్లు నిశ్చయింపవచ్చును. ఈభాస్కరునిగూర్చి నారన సూరన చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఈతనికాలము ౧౫౫౦ ప్రాంతము. విప్రనారాయణ చారిత్రమునకుఁ బూర్వ మీద్విపదకావ్యమును గవి రచించియుండెను. కావున ౧౫౬౦ ప్రాంతమున దీనిని రామయామాత్య భాస్కరునకును ౧౫౮౦ ప్రాంతమున విప్రనారాయణ చారిత్రమును దిరుమలరాజునకును గృతియిచ్చెనని నిర్ణయించుటకు సంశయమక్కఱలేదు.

మాకరాజు కుమారుఁడైన తిరుమలరాజుయొక్క కొడుకు రాజ్యముచేయుచుండగాఁ గార్వేటినగర సంస్థానములోఁ జేరిన

"నారాయణవన" గ్రామమునందలి కల్యాణ వేంకటేశ్వరస్వామికి ౧౫౪౪–౧౫౪౫ శాకాబ్దములలోఁ గొందఱు భూమ్యాదిదానములు చేసినట్లు దేవాలయములమీఁద రెండుశాసనము లున్నవని విప్రనారాయణచరిత్రపీఠికాకారులు వ్రాసియున్నారు. ఈ తిరుమలరాజు కృతిపతి యనుటకు సంశయింపనక్కఱలేదు. నూకరాజుకొడుకు తిరుమలరాజింకొకఁడులేఁడు. ఇతని కుమారుఁడు క్రి. శ. ౧౬౨౩ లో రాజ్యము చేయుచున్నాఁడని చెప్పుటచేత తిరుమలరాజు క్రి. శ ౧౫౮౦ ప్రాంతమునందున్నాఁడని నిశ్చయింపవచ్చును. ఈకాలము పైనవ్రాసిన కవికాలముతో సరిపోవుచున్నది. కృతిపతియైన తిరుమలరాజు కర్ణాటభూపాలునివలన బహుమానముల నందిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది

మహాస్రగ్ధర: కర్ణాటాధీశదత్తోత్కట వివిధమణీ కంకణానర్ఘరోచి
స్స్వర్ణగ్రైవేయ భూషాచకచకరుచిరాస్థానమొల్లంకెలౌఁగా
నిర్ణిద్రాశేషవిద్యానిపుణకవిసుధీనీతివిద్యాసమాసా
భ్యర్ణుండై భద్రపీఠిం బ్రకటితవిభవప్రౌఢిఁ గొల్వుండి వేడ్కన్

ఇతనిని గౌరవించిన కర్ణాటభూపాలుని నామమును జెప్పకపోవుటచేఁ గాలనిర్ణయమున కేపద్యము తోడుపడలేదు

సారంగు తమ్మయ్య రచించిన వైజయంతీ విలాసమునందలి కథయును, నీ విప్రనారాయణ చరిత్రమందలి కథయు నొక్కటియే యైయున్నది. ఇరువురును దాదాపుగా సమకాలికులే ఒకరికావ్యము నొకరు చూడక వ్రాసియుందురు. పరమయోగి విలాసమునం దీకథను సిద్ధిరాజు తిమ్మరాజు కవికూడ వ్రాసియున్నాఁడు. మల్లయకవి కవిత్వము రసవంతమై యలరారుచున్నది. పాత్రౌచిత్యమునందు తమ్మయకంటె మల్లయకవి యించుక ప్రౌఢుఁడని విప్రనారాయణ చరిత్ర పీఠికాకారులు సహేతుకముగా వ్రాసియున్నారు. ఈతనికవిత్వశైలి తెలియుటకై విప్రనారాయణ చరిత్రమునందలి పద్యములఁ గొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

మ. జననీదుర్భర గర్భగోళమున నే సన్న్యస్తుఁడై ప్రజ్ఞచే
ఘనతఁ బొల్చెను దత్పరాశరుని శేఖన్ భూరివైరాగ్య బో
ధనిరూఢిక్ శుకయోగి చంద్రమున సంసారంబంటెఁ దా నెన్నఁడే
జననంబొందె నతండదే మొదలుగా సన్న్యాసహో మండలిన్.

ఉ. పాటలగంధి! సౌఖ్యపరిపాటి యెఱుంగనిమూఢుఁ డౌట నే
పాటియు వీఁడు తాఁ దనకె వైకొనఁ డాయెను గాక కాక నా
పాటల నాటల న్మధురభాషలఁ జొక్కి లతాంతబాణుచే
వాటిలఁ జిక్కి కెంజిగురుఁ బాన్పుఁ జెందకయుండక శక్యమే ౨ ఆ.

చ. పడఁతుక తేనెలుట్టిపడఁ బల్కెను మానికులావతంస! యిం
పడరఁగ మార్ధవంబు నెలవయ్యెడు నీచరణంబు లొత్తెదన్
బడలినవారలిం దనుకఁ బొదలు తీర్చియుఁ గారెమెత్తియున్
మడవలు దీర్చియుం బిడపమార్చియుఁగాలువలేర్పఱించియున్ ౩ ఆ.

మ. కొలఁదుల్ మీఱినసంపదల్ గలభుజంగు ల్వీటలేరో! వదా
న్యులుగారో! వలవంతలం గలఁగి నిన్నుంగోరి రారో! నవో
త్పలపత్రేక్షణ! వీనిమాయలకు బందాగాక నీయీడు భా
వలలో వన్నెయు వాసియుంగలిగియున్నా! సొమ్ములార్జింపవే ౪ ఆ.

చ. కనకపుఁగిన్నెఁ దెచ్చి విటకంటకి కిచ్చినవాఁడ నేను మ
త్తనయుఁడు వీఁడు సూ! కొడుకు తండ్రిధనంబున కర్హుఁడౌట ము
న్వినవె? వివేకిగాని ధరణీధవురాజ్యమునం బ్రజానురం
జనమొనఁగూడ నేర్చునె? విచారము లేదె యొకించుకేనియున్ ౫ ఆ.



ఇతఁడు శ్రీరంగ మాహాత్మ్యమును ద్విపద కావ్యముగా రచియించి శ్రీరంగేశున కంకితముచేసెను. ఇతఁడు కందాళ అప్పలాచార్య శిష్యుఁడు- గద్యయిట్లున్నది.

"కొమరొప్పఁ గాశ్యపగోత్ర పవిత్రుఁ
డమరంగ కోవిలకందాళయణ్ణ
గారి సత్పుత్రులు గాంభీర్యవనులు
భూరిసన్నుతులు భాసురకీర్తిహారు
లనఁగ నందగ్రజుండగు నాయనయ్యా
కనుజుండు ఘనుఁ డప్పలచార్యవర్య
గురుకృపాసాంద్ర ముకుంద యోగీంద్ర
విరచితం బగు రంగవిభుచరిత్రంబు
కవిరాజు లక్కడక్కడ విని పొగడ
నవని నాచంద్రతారార్కమై వెలయు.

ఈకవినిగూర్చి యింక నేమియుఁ దెలియలేదు. ఈగ్రంథము యొక్క యముద్రిత ప్రతులు రెండు తంజావూరులిఖిత పుస్తకభాండాగారమునందున్నవి. మరొకు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందొక ప్రతియున్నది.

కవి కాశ్యపగోత్రుఁడయిన ట్లీక్రింది ద్విపదవలనఁ దెలియుచున్నది.

ధాత్రిఁ గశ్యపుఁడనఁ దనరు సన్మౌని
గోత్రంబువాఁడ ముకుందాహ్వయుఁడను
మది నుబ్బి శ్రీరంగమాహాత్మ్యమేను
బదరక వినెడు శ్రీపరమవైష్ణవులు

దీపింపఁ దెలుఁగున ద్విపదకావ్యంబు
గావింతుఁ దత్కథాక్రమ మెట్టిదనిన.

కందాళంవారు శ్రీవైష్ణవులు. వాధూలసగోత్రులు. కవి తన గురువు కోవిలకందాళం అణ్ణయాచార్యుల తనయుఁడైన యప్పలాచార్యులనియుఁ గాశ్యపగోత్రుఁడనియు ననుచున్నాఁడు. కందాళవంశమును గోవిలకందాళవంశమును భిన్నము లేమో! కోవిలకందాళంవారు కాశ్యప గోత్రులేమో! తెలియదు. తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన వంశవృక్షములలోఁ గోవిలకందాళం అప్పసండితుని వంశవృక్ష (Table No 210) మున్నది. అందుఁ దండ్రి పేరియు లేదు. సోదరుని పేరును లేదు. ఈకవి గురువాతఁడే యైనయెడల నాతని శాసన మొకటి క్రి.శ. 1539 లో నున్నది. కావున నీకవి పదునాఱవ శతాబ్దియందుత్తరార్ధమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును ఈగ్రంథమును నేను చూడ లేదు. కావున శైలిచూపలేకపోయితిని.

వివేకసింధు వనుపేర నొకవేదాంత గ్రంథమును వచనకావ్యముగా రచియించిన ముకుందయోగి యొకఁడున్నట్లు వేగినాటి కొండనార్యుఁడు రచించిన పద్యవివేకసింధువువలనఁ దెలియుచున్నది. ఆముకుందయోగియు నీతఁడు నొక్కరో భిన్నులో చెప్పుట కాధారములు లభింప లేదు.

# 205 కాకమాని మూర్తికవి



ఇతఁడు వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; రామబుధునకుఁ బ్రపౌత్త్రుఁడు; ప్రబోధ పండితునకుఁ బౌత్త్రుఁడు; రామలింగార్యునకుఁ దిమ్మమాంబికకుఁ బుత్త్రుఁడు; సూర్యనారాయణ నామధేయులిరువు రీతనికి సోదరులు; చినరామభట్టు పినతండ్రి.

ఈతని నివాసము గుంటూరు మండలములోని బాపట్లతాలూకా యందున్న "కాకమాను" అను గ్రామము. గ్రామనామమునుబట్టి యీతనిని కాకమానిమూర్తి యని పిలుచుచున్నారు. కాని వీరి గృహనామము పెన్నావా రయినట్లితఁడు రచించిన రాజవాహన విజయమునం దీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. గుణధన్యుఁ గౌండిన్యగోత్ర నాపస్తంబ
సూత్రుని వెలనాటి శుభచరిత్రుఁ
గాకమానీ మహాగ్రామాబ్జమిత్రుఁ బె
న్నాకలశాబ్ధి తారాకళత్రు
సరసవిద్వత్కవిసార్వభౌముని రామ
బుధసంభవునకుఁ బ్రబోధసుధికిఁ
బౌత్రునిఁ జినరామభట్టాగ్రజన్ముఁడై
నట్టిరామలింగనకుఁ దిమ్మ
గీ. మాంబికకుఁ బుత్రు సూర్యనారాయణన్న
యైకసహజన్ము నుభయభాషాకవిత్వ
తత్త్వనిధి నన్ను మూర్తి విద్వత్కవీంద్రు
హర్షమునఁ జూచి యిట్లని యానతిచ్చె...... ౧౨

ఈపద్యమునందలి రెండవపాదమునను్న "బెన్నాకలశాబ్ధి" అను పదమునకు బదులుగా ముద్రితప్రతిలో "బెన్నేకులవార్ధి" అనియున్నది.

దానినిబట్టి కవి యింటిపేరు "పెన్నేకలవారని" ముద్రితప్రతి పీఠికా
కారులు వ్రాసియున్నారు. కాని యది పొరపాటు. కవియింటిపేరు
పెన్నావారయినను వీరిని కాకమానివారనియే పిలుచుచున్నట్లు కవి
తన పితామహుని వర్ణించిన యీక్రింది పద్యములో నున్నది.

గీ. అనఘమణి కాకమానిరామాహ్వయుండు
నీకు ముత్తాత యుభయభాషాకవిత్వ
తత్త్వనిత్యప్రబోధపితామహుండు
నీవు కవిపట్టభద్రుఁడ వెవ్వరీడు. ౧౮

ఈకవి రాజవాహనవిజయము నేకాక. పాంచాలీపరిణయ మను
మఱియొక ప్రబంధమును బహుళాశ్వ చరిత్ర మను నింకొక ప్రబంధ
మును రచియించియున్నవాఁడు. పాంచాలీ పరిణయములోని యీ
క్రిందిపద్యమువలన నీకవినిగూడ కాకమానివారనియే పిలుచుచున్నట్లు
చెప్పికొనియున్నాఁడు.

గీ. అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంభనంబును
కాకమానిరాయ నీకె కలదు.

ఈపద్యమందలి "కాకమానిరాయ" శబ్దమును, పైసీస పద్యము
లోని "కాకమానీమహాగ్రామాబ్జమిత్రు" అను వాక్యమును బట్టిచూ
డఁగా నీకాకమానివారి కాగ్రామ మగ్రహారమో, మొఖాసాయో
యయియుండునని తెలియుచున్నది. లేదా, ఈకుటుంబము వారాగ్రామ
మున నితరాపేక్షలేని పెద్దగృహస్థులయి గౌరవముగా జీవనము గడిపిన
వారైన నయియుందురు.

కొన్ని ప్రతులలో, పైనివ్రాసిన సీసపద్యములో "పెన్నా" అను
టకు మాఱుగా "వెన్నా" అని యున్నది. అందుచే నీకవి గృహనా
మము వెన్నావారయినను గావచ్చును.

పాండురంగ మాహాత్మ్యమును రచించిన తెనాలి రామకృష్ణుని౯ బై పద్యములోఁ బేర్కొనియుండుటచే నీతఁడు రామకృష్ణునకుఁ దరువాతివాఁడో, సమకాలికుఁడో అయియుండును. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మనలు క్రీ. శ. 1530 ప్రాంతమువారును రామకృష్ణుఁడు క్రీ. శ. 1540–1550 సంవత్సర ప్రాంతమువాఁడు నగుటచే నీకవి క్రీ.శ. 1530 సంవత్సర ప్రాంతమునం దుండియుండునని బ్ర. వీరేశలింగము పంతులుగారు కవుల చారిత్రమున వ్రాసియున్నారు. రాజవాహన విజయమునకుఁ బీఠిక వ్రాసిన నందిరాజు చలపతిరావుగారు, పంచమాశ్వాసమునందలి-

సీ. అఖిలసీమాము లైన దుర్గమ్ము లు
వ్మలికలు గలకమ్మ వెలమదొరలు
చేసి కైదేసివేల్ శివరాయల వరాల
నెలకట్టడల పటాణీ ల్గరీబు
లూళ్లాయములమీఁద హారపుత్తేవుగన్న
రాయకై జీతంపురాయవారు
పగటిగాసంబు దప్పకయుఁడ దినరోజు
మాదిరినొంటిరి జోదుమూక

గీ. మొదలుగాగల ఛారులు మొనకు నిల్చి
పొడిచి పేర్వాడి వీధు లేర్పడఁగఁ జేసి
గాసి గావించి యరులఁ జేవాసియెదుటఁ
జూపినిలకేడు మూఁడుమెచ్చులునమెచ్చ.

అను పద్యముననున్న “శివరాయల వరాల”ను వాక్యమును గ్రహించి, శివరాయలనఁగా సదాశివరాయలని తలంచి, అచ్యుతదేవరాయలకుఁ బిమ్మటవచ్చిన సదాశివరాయల రాజ్యకాలములో నాణెములుగా నున్నవరాలను దలపెట్టినవాఁడగుటచే నీమూర్తికవి క్రీ. శ. 1568 సంవత్సరప్రాంతమున నున్నాఁడని తలంపవచ్చునని వ్రాసియుండిరి.

ఎట్లయినను రాజవాహన విజయము క్రీ. శ. 1550 సంవత్సరము నకుఁ బూర్వము రచింపఁబడలేదనియే చెప్పవచ్చును. సదాశివరాయలకును, తెనాలిరామకృష్ణునకును దరువాత నెంత కాలములో నీకవి యున్నదియు నిశ్చయించుటకు బైని చెప్పిన రెండుపద్యములు నంతగా తోడ్పడుట లేదు. కాని సదాశివరాయల వరాలవిషయమాతని ననేకేండ్లా నంతరమునఁ జెప్పుట సమంజసముగా నుండదు. కావున నీతఁడు సదాశివ రాయల కాలములో ననఁగా కవుల చరిత్రకారులనినట్లు క్రీ. శ. 1560 సంవత్సర ప్రాంతమున నుండెనని నిశ్చయింపవచ్చును.

కొందఱు వసుచరిత్రకారుఁడగు భట్టుమూర్తియు. నీకవియు నొక్కరే యని భ్రమపడియున్నారు. కాని యది సత్యము కాదు. ఆతఁడు వందికులమునకుఁ జెందినవాఁడు. ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. మూర్తినామసామ్యముచే నట్టిభ్రమ కలిగినది.

రాజవాహనవిజయ మైదాశ్వాసములు కలది. దండికృతమగు దశకుమార చరిత్రమందలి రాజవాహనుని చరిత్రయే యించుకమార్పులతో నిందు వర్ణితమయినది. మగధదేశమందలి కుసుమపుర ప్రభువగు రాజహంసునకు, శ్రీకృష్ణ వరప్రసాదమున నత్యంత సౌందర్యవంతుఁడగు రాజవాహనుం డను తనయుఁడు జన్మించి విద్యాబుద్ధులు నేర్చి పరాక్రమవంతుఁడై యువరాజపట్టమునంది సైన్యసమేతుఁడై దిగ్విజయార్థము వెడలి యనేక దేశాధీశుల జయించి, మార్గమధ్యమున మాళవేంద్రుఁడగు మానసారుని యుద్యానముం జొచ్చి యందు విహరించు నవంతిసుందరియను నారాజు తనయం గాంచి, మోహితుండగుటయు, నక్కన్యయు నీతనిం జూచి, ప్రేమఁగొని బాలచంద్రికయను చెలికత్తెమూలమున దన మనోరథము నాతనికిఁ దెల్పుటయు. రాజవాహనుఁడా మాళవేంద్రుని రణమునఁ జయించుటయు. నాతఁడు తనకూఁతు నవంతిసుందరిని రాజవాహనునకిచ్చి పరిణయము సేయుటయు నిందలి కథ.

ఈకవి తన కవిత్వమునుగూర్చి రాజవాహనవిజయమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

క. కృతిలోఁ బ్రతిపద్య చమ
త్కృతి గలుగఁగఁ బలుకనేర్చుకృతి నీవు మహా
కృతి మాకొనరుచు భాషా
కృతి భారవి కాకమాని శ్రీమూర్తికవీ! ౧౯

క. ప్రతిపద్య ప్రతివాక్యో
న్నతి కావ్యము రాజవాహనవిజయమఁట యీ
కృతికిం బతి శేషాచల
పతియఁట నేఁడింతకంటె భాగ్యము కలదే ౨౦

ప్రతిపద్యమునందును, ప్రతి వాక్యమునందును చమత్కారము గలుగునట్లు కావ్యమును రచించితినని కవి తన సామర్థ్యమును జెప్పుకొనియున్నాఁడు. ఈవాక్యములయం దుత్ప్రేక్ష చాలగానున్నను, మొత్తముమీఁదఁ గావ్యము రసవత్తరమై మనోహరముగా నున్నదని చెప్పవచ్చును. శ్రీ వెంకటేశ్వరస్వామి కలలోఁ బ్రత్యక్షమై తన కీకావ్యముఁ గృతియిమ్మనుటచే నాదేవునకే కృతినొసంగితినని యీ క్రింది రెండు పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఈక్షితి మున్న సత్కవులనేకులు హా! కవితాలతాంగులన్
లక్షలొసంగియుండి యధునాతన కావ్యవధూటి వేంకటా
ధ్యక్షుఁడు పాటిసేయఁడుగదా! యననేటికి నెట్టివానికిన్
బక్షము పిన్నభార్యపయిఁ జాయకయుండుట యెంత యెంతయున్.

ఉ. చెప్పినపద్యమెల్లఁ జెవిజేర్చి విను న్వినఁ డొంకుగల్గినం
దప్పులు గిప్పు లెన్నఁడొకనాఁడును నేఁడు వేడుచో
నప్పున నెట్టిపో డడిఁగినన్ని వరా లిడుఁ గొండమీఁదితి
మ్మప్పనివంటి కావ్యపతి యబ్బుట యబ్బురమి బ్బుధాళికిన్.

శైలికై కొన్ని పద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

ఉ. శాతుమనం బెఱింగి జలరాశి చివుక్కున దాటి హుంక్రియా
జ్ఞాతతనాగు వాగె కుఱుసన్నఘటింపదు సాటిచుట్టుఁ గ

ద్రాతలఁబెట్టునో యనుభయాంబున శిక్షణవేళనుం గశా
ఘాతము లేకయుండు తెలుఁగంబడుఁ డిట్టిరి వాజిరాజికిన్. ౧ ఆ

క. పసరినఁ గార్యము సెడు సం
పద చెదరు మహాపదలకుఁ బడపడు "సహసా
విదధీత నక్రియా" మను
చదు వార్యులు చదువ విన వె శశివంశమణీ. ౨ఆ.

శా. పుష్పం దీవెల తూఁగుటుయ్యెలల సొంఫుల్ నింపఁగాఁ దూఁగున
ప్పూవ్వింబోడుల గబ్బిగుబ్బవలిపెంబుల్ జారి వ్రాలింపఁగా
న వ్వేళన్ సరిదూఁగర మ్మనుచు భూపా రావభాషాస్ఫుటిం
గొప్పుల్ మీఱఁగ వేల్పుజవ్వనులకుంగొంగిచ్చినట్లొప్పెడిన్. ౩ఆ.

ఉ. బంగరుకమ్మివంటి మనబాలతనూలత వెండితీగెలో
సంగతిసల్పె నమ్మకరశాఖలకుం దఱువిచ్చు గాజులన్
ముంగలికేగెనమ్మ చనుముత్తెములఁశునిపాతచాత్రియా
సంగము లయ్యెనమ్మ మహిజానిసుధాంశుకథావృథావ్యథన్ ౪ఆ.

మ. కలకంఠీమణి సౌధజాలములఁ గాంక్షంజూడ నమ్మక్క చు
క్కలరా జద్దిర కాఁడుగా సురనదీకంజాతమో హారోపురే
యాఘుస్కంఠశిరోగృహైకముకురం బంచుం బురీవాసుల
గ్గలముం బందెముౖచి చూచిరపుడా కాంతాముఖాంభోజమున్ ౫ఆ

ఈకవి రచించిన బహుళాశ్వచరిత్ర మిప్పుడు లభించుటలేదు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహములో బహుళాశ్వ చరిత్రములోని యీక్రింది పద్యముల నుదాహరించియున్నాఁడు.

శా. అంచుల్ రాయనివ న్నెరాల్ పులుగు కేడాసీనులూత ప్రానం
బంచాస్యంబులు గల్గుపాపదార గ్రామ్యబ్రహ్మచారుల్ దువా
ళించన్ బచ్చనవ్రాతలూడివడుమే లిక్కుల్గలమన్యంబు లో
చంచద్వ్యాహము లంచు మంటపము పంచంజేరి విశ్రాంతుఁడై.

క. లెక్కలుపెట్టఁగవచ్చు
జుక్కలు దద్భక్ష్యభోజ్య చోష్యాదులక

మ్మక్క వఱిలెక్కయొక్కడి
దక్కడి యొక్కొక్కకడి వె యాఱులు సేయున్.

క. ఆరేడు వగలచారుల్
నూరువిధంబుల రసావళుల్ వేయువప్పు
ల్గూఱులు బచ్చళ్లు న్నిం
డూఱుం గాయాలకు లెక్కయున్ మఱికలదే...

ఇతఁడు రచించిన మైదాశ్వాసములుగల పాంచాలీపరిణయమును శ్రీరంగేశున కంకితముచేసెను. ఇందు ద్రౌపదీదేవి జననమాదిగా నర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టినపిదపఁ బాండవులైదుగురు నామెను బరిణయమగువఱకును గలకథ వర్ణింపఁబడినది. ధృతరాష్ట్రుఁ డింద్రప్రస్థపట్టణ మిచ్చినట్లును నారాజ్యమును బాండవులు పరిపాలించుచు సుఖముగా నుండినట్లును జెప్పి కవిగ్రంథమును ముగించెను.

ఈకవి మిక్కిలిభోజనప్రియునివలెఁ గన్పించుచున్నాఁడు. ఈతఁడు రచించిన గ్రంథత్రయమునందును బ్రాహ్మణసంతర్పణమును వర్ణించుట కవకాశమును గల్పించుకొని, అరఁటియాకు మొదలు భోజనపదార్థములను భోజనపద్ధతులనువడ్డించువారినిఁగూడవర్ణించియున్నాఁడు. శైలి తెలియుటకై పాంచాలీపరిణయము నుండి పద్యముల నుదాహరించుటలో నాసంతర్పణసందర్భమున రచించిన పద్యములను గొన్నిఁటిని బాఠకులకు వినోదముగా నుండుననితలంచి యిట వ్రాయుచున్నాఁడను.

క. కడలేని వెడలుపెంతే
నిడివియు నగ్రములతగులు నిగనిగలిగురుం
గడిమిగల యనఁటియాకుల
యొడఁ జూచినఁ గడుపు నిండదే భోక్తలకున్.

ఉ. ఇక్కడఁ గూరుచుండుటల కీరతె పెద్దలు లేచిరండు మీ
రొక్కరు వంటశాల కడుయోగ్యము మీకది తేమకేమి యీ
ముక్కలిపీట మీఁది యదిమూర్ఖులచోటిట మేలటంచు స
ద్వాక్కుల నక్కలాధికుల వైదికులం దగుచోట నుంచినన్.

క. చేత మెతు కంటకుండన్
సీతాభోగముల వారిచిన యోగిర మా
రా తుమ్మిపూల తెలుపౌ
హా తావి యయారె వేఁడియని వేఁడిరోగిన్

క. నేస్తులకుఁ బసిఁడి గిన్నెల
కస్తూరియనంగ నెంత కర్పూరంబే
శస్త మన వాసికెక్కిన
నిస్తులసద్యోఘృతంబు నెలఁతుక వంచెన్

ఆ. ఉప్పు పులుసుఁ బెట్టి యొక్కింత మిరియంబు
ముట్టితిరుగఁబోఁత చుట్టిచుట్టి
నేత వేఁచినట్టి నిడుపుఁ గాకరకాయ
వరుస నిడియె నొక్క వంటలక్క.

క. ఉడికినపిమ్మట మిరియము
పొడి బెల్లముచల్లి యుద్దుపొడి రాలిచి నే
యిడి నెఱ్ఱఁగ వేఁచిన వేఁ
పుడుఁ గంద మిళిందవేణి పొందుగనిడియెన్.

క. ఇడఁ దగినపులుసు మిరియము
గుడుముం గలవేఁడివేఁడి గుమ్మడితునకల్
బెడిదంపురసము గూడఁగ
బడఁతుక వడ్డించె నొకతె బడలికఁ దీఱన్.

## 206 ఆవందూరి నరసింహభట్టు



రామాప్రెగడ జగ్గనకవి తన ప్రబంధరత్నాకరమునందు, ఆమ డూరి నరసింహభట్టు షోడశరాజ చరిత్రములోనిదని యీక్రిందిప ద్యము నుదాహరించియున్నాఁడు. ఇంతకంటె నీకవిచరిత్ర మించుకం తయుఁ దెలియరాలేదు.

శా. జంఘాలప్రతిభాను లాస్యకవితాసంఘాతు లాశుక్రియా
సంఘుస్రష్టలు సంఘశశికలశజుల్ సాహిత్యసర్వంకషుల్
సంఘశ్లాఘ్యులు కాక కాకవులు లక్ష్యంబె హాలిగ్రామఘా
ణంఘుశ్రైవ్యకశరణ్యు బల్బజ (?) నిబంధల్ మత్కటాక్షేక్షుకున్.

ఈపద్యము కృత్యాదియందలి కుకవినిరసనముగాఁ గన్పట్టు చున్నవి. ఇతఁడు క్రీ శ. ౧౫౭౦ కిఁ బూర్వుఁడు. ఈగ్రంథ మిప్పు డెచ్చటను గన్పట్టుటలేదు.

---

## 207 వటమూలుఁడు



ఈకవినిగూర్చి శ్రీ నిడుదవోలు వెంకటరావు పంతులుగారు భారతి పత్రిక (సం. ౧౩ భా. ౧ పుట. ౪౩) లో నిట్లు వ్రాసియు న్నారు.

"ఈతఁడు "వటమూలమందిరా" అనుమకుటముగల శతకమున కుఁ గర్త. ఇందు కవి తన్నుతానే సంబోధించుకొనినాఁడు. ఈసంప్ర దాయమితనితో నారంభమయినటు కనఁబడుచున్నది. క్రీ. శ. ౧౫౮౦ వ సంవత్సరమున వెలసిన తురగారామన, అయ్యంకి బాలసరస్వతి యను జంటకవులు తమనాగరఖండమున నితని స్తుతించినారు. కావున నీతఁ

డంతకంటె పూర్వుఁడని చెప్పవచ్చును. ఈతని శతకములో నుండి కొన్నిపద్యములు "భారతి" యందుఁ బ్రకటింపఁబడినవి. ఆపద్యములఁ జూచినచో వేదాంతవిషయములను యోగవిషయములను జాను తెనుఁగున నీకవి యెంతయిమిడికగఁ జెప్పఁగలఁడో తెలియఁగలదు."

ఈతని నిజనామము దెలియక పైనిఁజెప్పిన కవిద్వయ మీశతకమునుబట్టి యీతనిని వటమూలుఁడని యనిరేమో యనిసంశయించుట కవకాశము కల్గుచున్నది. భారతియందుఁ బ్రకటింపఁబడిన పద్యములీక్రింద నుదాహరించుచున్నాఁడను. ఈతనిపేరిదివఱకు చరిత్రముల కెక్కలేదు. ఇంతకంటె నీతని చరిత్రము తెలియదు.

ఉ. చూపులు రెండు ముక్కుతుదఁ జొన్పియు జూచినచూపు వెంటనే
లోపలఁ జూచి చండకరులో శశిఁగూర్చి చతుర్దళంబుపై
దీపము వెట్టి దానితుదితేజము తానయి విశ్వమంతయుఁ
వ్యాపకుఁడైన పుణ్యుఁడు మహాత్ముఁ డగున్ వటమూలమందిరా!

ఉ. కన్నులుమూసి నాదుమది గన్ను (?) త్రికోణమునందు జొన్పి, లో
సన్నపుదిండిఁ దూర్చి జలజంబుల నిచ్చెనయెక్కి మింటిపై
వెన్నెలరాజుఁ జేరి సుఖవేళలయందును నీవు నేనయై
యున్నను గాని నాహృదయ ముబ్బదయా వటమూలమందిరా!

ఉ. కట్టిగ వేదలార్గురిని ఖండలు సేయక యేడుచింతలఁ
గొట్టక మూడ్గురిండ్లు చెడగూల్పక(...) ముబ్బునాభువిఁ
బొట్టును బోనముఁ (...) పోకులు బూడిదపూఁత లూరకే
పెట్టుదుగాని నీదుదయ పెర్పదునా వటమూలమందిరా!

ఉ. వాలినయింద్రియాలయ కవాటములన్నియు మూసినెమ్మదిఁ
దాళము వెట్టి లోవెలుఁగు తత్త్వము గన్గొని తట్టి సుందరీ
లాలితనాగకన్య నుపలాలనచేసినవాఁడె యోగియా
మాలినవేషముల్ జముని మార్కొనునే వటమూలమందిరా!

ఉ. సాగిన కోపవహ్ని నిజశాంతజలంబులఁ జల్లనార్చి యా
శాగిరులన్ నివృత్తిశిఖిశాహుతి నుగ్గుగఁ జేసి యత్తమో
నాగవిభున్ వివేకమృగనాయకుచే నణఁగించి లోన సం
యోగ వియోగముల్ విడువ యోగియగున్ వటమూలమందిరా!

---

## 208 నూతనకవి సూరన్న



ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యప గోత్రుఁడు; అనంతసేనుని మల్లయామాత్య పౌత్త్రుఁడు; తిప్పయకును పార్వతికిని బుత్త్రుఁడు; ముదిగొండ ధూర్జటికి శిష్యుఁడు.

ఇతఁడు ధనాభిరామ మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి, దాక్షారామ భీమేశ్వరునకుఁ గృతియొసంగెను. కవి తననుగూర్చి యాగ్రంథమున నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. విస్తీర్ణవిభవ యాపస్తంబసూత్రుండ
కాశ్యపగోత్ర విఖ్యాతయుతుఁడ
ఘనతననంతసేనుని మల్లయామాత్యు
పౌత్త్రుండ తిప్పయప్రభుని సుతుఁడ
పార్వతీశుభగర్భపాథోనిధాన సం
పూర్ణచంద్రుఁడ రాజపూజితుఁడను
రాజాధిశేఖర పూజావిశేష సం
ధానైకచిత్తుఁడ మానధనుఁడ
భద్రవైభవ శ్రీవీరభద్రలబ్ధ
జనితచాతుర్య కావ్య లక్షణవిచిత్ర
విమలవాచాసమగ్రసంవిశదమతిని
సూరయామాత్యతిలకుండ సుకవివరుఁడ

తాను మహాభారతకృతికర్త యగు తిక్కన సోమయాజి కులవర్ధనుఁడనని కవి యీక్రిందిపద్యములోఁ దెల్పుకొని యున్నాఁడు.

చ. అనువుగ భారతాంబునిధి యవ్వలికిన్ దగ నీది యందులో
ఘనకవితామృతంబు చవిగాంచిన తిక్కనసోమయాజి పా
వనతరమైన యట్టికులవర్ధనుఁ డ న్మహిఁ బేరుగల్గు నూ
తనకవి సూరనాహ్వయుఁడ ధర్మగుణ ప్రతిపాలనీయుఁడన్.

తిక్కనసోమయాజి వంశములోనివాఁడననియు, "నూతనకవి" బిరుదనామమనియుఁ జెప్పుకొనుట కవి యభిప్రాయమేమో! అని యీపద్యమువలనఁ దోఁచుచున్నది. కాని తిక్కనసోమయాజి గౌతమ గోత్రుఁడును, ఈతఁడు కౌశికగోత్రుఁడునగుట నావంశమువాఁడని చెప్పవీలులేదు. తానును నియోగి బ్రాహ్మణుఁడ నని చెప్పి తిక్కన సోమయాజియందుఁ దనకుఁగల గౌరవమును వ్యక్తీకరించుటయే కవి యుద్దేశమని గ్రహింపవలసియున్నది.

ఈకవి యేకాలమువాఁడో తెలియఁదగిన యాధారములేమియుఁ దొరకలేదు. పూర్వకవిస్తుతిలో నీక్రిందిపద్యమున పురాణయుగకవులను మాత్రమే పేర్కొనియున్నాఁడు.

చ. అఘుని శబ్దశాశనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె
న్నలరిన చిమ్మపూడియమరాధిపు భాస్కరు రంగనాథునిన్
దలఁతు నపూర్వదివ్యకవితామహనీయ సమగ్రచిత్తులన్.

ఇంతమంది పూర్వకవులను జెప్పి మధ్యకవులలో నొక్కనిని జెప్పకపోవుటచేత నితఁడు మధ్యకవులలోఁ జేరినవాఁడేమో యని సందేహము కలుగుచున్నది. అయినను స్వతంత్రములైన యితరాధారములు లేక మధ్యకవులను పేర్కొనకపోయినంతమాత్రమున నితఁడు మధ్యకవియని నిశ్చయించుటకు వలనుపడదు. కాని యితఁడిన్నూఱు సంవత్సరములక్రిందటివాఁడని యైనను జెప్పవచ్చునని తోఁచుచున్నది. అని బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రములో వ్రాసియున్నారు.

దేవేంద్రసభయందొకనాఁడు నాట్యమొనర్చుటకై వచ్చి యున్న రంభాద్యప్సరసలు. ఇంతలో మన్మథుఁ డచ్చటకురాఁగా నితనిఁబు మరచి యాతనిఁ జూచుచుండు సమయంబున నింద్రుండు వారలఁజూచి మీకవశ్యము కావలసినది ధనమా ? రూపమా? యని ప్రశ్నింప నాయప్సరస లొకరిమొగముల నొకరు చూచుచు నిరుత్తరులై యుండ మన్మథుఁడు కామినులకు రూపమే యాకర్షణీయమనియు, రూపవంతునివలచినట్లు ధనదునంతవాని నైనను ధనవంతుని గౌరవింపరని యొక్కించుక గర్వముతోఁ బ్రత్యుత్తరమొసంగెను. ఆసభయందున్న కుబేరుఁ డందులకుఁ గినిసి, మన్మథునిమాట యసత్యమనియు

చ. సరసతలేనివాని నతిజాడ్యుని రూపములేనివాని ము
　ష్కరుని వివర్ణునిన్ తనువుఁజాగమూసినవాని ప్రామిడిన్
　వెరివిడువాని నైన మఱివింతలుసేయఁగ బిల్తు రంగనల్
　కరమరుదైన వస్త్రములు కాంచనముల్ తగనిచ్చి పంపినన్.

అందుపై మన్మథ కుబేరులకు రూపధనాధిక్యతలనుగూర్చి వాగ్వివాదము పెరిగి తుదకు కుబేరుఁడు

చ. తరిమిడి యిన్నిమాటలు వృథాపనిలేదు సమస్తవైభవో
　త్కరమగు దక్షవాటి పురిగల్గుధరాస్థలిఁగోనఁ బోయినీ
　నిరుపమరూపసంపదయు నేరుపుఁ జూపుము నేను వచ్చి యా
　పురవరసీమఁ జూపెదను భూరిధనంబున నామహత్వమున్.

అనిపలికి, ఓడినవా రింద్రసభకు రాకుండుటయే పణముగా పన్నిదము వైవమన్మథుఁ డందుల కంగీకరించెను.

పిదప మన్మథుఁడు ద్రాక్షారామునందలి భీమేశ్వరాలయమునకుఁ బోఁగా నటకు నాట్యమునకయి యరుదెంచిన సుగుణవతియను వేశ్య యాతనిఁజూచి మోహించి యింటికేఁగి యాతని నెల్లయినఁ దన యింటికిఁ దోడితెమ్మని తనవయస్యను వేఁడుకొనఁగా నామె:

ఉ. అక్కట వాసి వన్నెగలయట్టికులంబునఁ బుట్టి రూపుచే
　నెక్కుడు భాగ్యసంపదల నెన్నికకెక్కినదాన నింతలో

నెక్కుడివానికి న్వలచ్చి తెయ్యదొ వాసికులంబు విన్నవా
రొక్కట నవ్వరే విడువు మత్పలలోచన నీకు మ్రొక్కెదన్.
ఉ. నిచ్చలునిండి వల్లభులు నీకడ గానఁగ లేక కానుకల్
తెచ్చి తమంతఁ గ్రందుకొని తేఁకువ మోసలఁ గాచుచుండఁగాఁ
జెచ్చెర వారలన్ ఘనముచేయక డాయక యూరకున్నచో
నొచ్చెము కాదె నీకును బయోరుహలోచన యిప్పరంబునన్
చ. కలికితనంబు మీఱఁగ వికారముతోడ మనోజకేళి ని
చ్చలుఁ దమకంబు పుట్టి విటసంఘముతెచ్చి యొసంగు నీమహో
జ్జ్వలమణిభూషణాది ఘనవస్తువులొందుట కీర్తిగాక తా
వలచుట పంతమా ధరణివారవధూమణికిం దలోదరి.

అని యపారధనమిచ్చెడు విటు లనేకులుండఁగా ధనమియ్యఁ జాలని క్రొత్తవానిని కేవలరూపసంపదనుజూచి వలచుట వారకాంతకు ధర్మముకాదని బుద్ధిచెప్పియుఁ గార్యముఁ గానక తుదకు మన్మథుని దానియింటికిఁదెచ్చి యప్పగించెను. సుగుణవతియు మన్మథుఁడును గొంతకాలమీప్రకారముగా సుఖమనుభవించుచుండఁగా కుబేరుఁడు యోగివేషమున వచ్చి భీమేశ్వరస్వామి యాలయమునఁ జేరి యచ్చటికి వచ్చెడు వేశ్యలకెల్లను ధనములు చీరలును కొల్లలుగా నొసఁగసాగెను. అంత సుగుణవతి తల్లియు నొకనాఁడచ్చటికిఁ బోయి యాతఁ డిచ్చిన ధనకనకాంబరములను దెచ్చి కూఁతునకుఁజూపి బోధించి మతిమరలించి రూపవంతుఁడయిన మారుని విడనాడి విత్తవంతుఁడైన కుబేరునిఁ గూడు నట్లుగుణవతి నొడఁబఱచెను. అంతట మన్మథుఁ డోడిపోయి, దేవాలయముఁజేరి భీమేశ్వరుని ప్రార్థింపఁగా నతఁడు సాక్షాత్కరించి, యొకప్పుడు ధనమును మఱొకప్పుడు రూపమును విజయమునొందినను మొత్తముమీఁద ధన సౌందర్యములు రెండును సమానములే యని తెలియఁ బలికి వారిరువురిని సమాధానపఱచి వారి స్థానములకు వారిని బంపివేసెను.

ఇది ధనాభిరామమందలి కథ. తుదకు ధనమే జయమందుటచే దీనికి ధనాభిరామ మనిపేరువచ్చినది.

స్వర్గమున రంభాద్యప్సరసలుండ, భూలోకమున వేనవేలు వేశ్యాలయములుండ, మన్మథ కుబేరులు ద్రాక్షారామ వేశ్యలను దీక్షగు లనుగా నెన్నుకొనుటవలనను, కృతిపతియు సమాధానకర్తయు భీమేశ్వరుఁడగుటనుబట్టియుఁ జూడఁగాఁ గవి గోదావరి మండలములోని వాఁడును, విశేషించి, ద్రాక్షారామ పరిసరములవాఁడనియుఁ దోఁచు చున్నది.

కవికిఁ గురువైన ముదిగొండ ధూర్జటి యఘోర మంత్రనిరతుఁ డైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియనగును.

చ. దొరయు నఘోరమంత్రనిరతున్ ప్రతివాది మహాంబురాశిని
స్తరబడబానలున్ ఘనవిశుద్ధచరిత్రుని శాంతమూర్తి భా
సురనిగమార్థతత్త్వగుణశోభితు దేశికచక్రవర్తి మ
ద్గురు ముదిగొండ వంశగురు ధూర్జటిఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

ఇకారసంధి మొదలుగాగల ప్రయోగములున్నను నీతనికవిత్వము మొత్తముమీఁద సరసముగనే యున్నది. శైలికై పైనిదాహరించిన పద్యములే చాలియున్నను మఱిమూఁడు పద్యముల నిట వ్రాయుచు న్నాఁడను.

ఉ. లాలితరూపయావనవిలాససమగ్రత చాల నొప్పునీ
లాలక వేడ్కతోడ తనయాత్మసుఖంబునకై స్వరూప సం
జాలతతోడఁ బోల్పఁ దగు చక్కనివాని రమించుగాక తా
మేమిధనంబులిచ్చినను చేకొనునే వికృతాంగు నెంతయున్. ౧ ఆ.

చ. ఇరువదియాఱు వీక్షణములెన్నఁగ నాలుగు వర్ణచేష్టలున్
బిరుదుగ నేడు భూనటన లర్వదినాలుగు దోర్విలాసముల్
సరసతఁ జూపి హంసవృషసామజవాయస శుద్ధసంగతుల్
పరువడి మెట్టునిల్పి సితపంకజలోచన లాడుచుండఁగన్. ౨ఆ.

ఉ. నాయిక నీవు యావయసునన్ గడియింపక విత్తమబ్బనే
ప్రాయము రూపు సంపదయు భవ్యసమున్నత దేహకాంతులున్

బోయినమీఁద వేడినను బోకయుఁ బుట్టదు వారకాంతకుఁ
వేయును జెప్పనేటి కిఁక వేగమె సిద్ధునిఁజూడు భామినీ. 3 ఆ.

ఈధనాభిరామమందలి పద్యములు కొన్ని రామామాత్యపెగ్గడ ప్రబంధరత్నాకరమునం దుదాహరించియుండుటచే నీసూరనకవి క్రీ.శ ౧౫౬౮ కిఁ బూర్వుఁడును, ౧౪౦౦ వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడు నగుట నిశ్చయము.

# 209 పాలపర్తి సోమేశ్వరుఁడు



ఈక్రింది రెండుసీసపద్యము లీకవికృతములని రామామాత్యపెగ్గడ జగ్గన కవి తన ప్రబంధ రత్నాకరమునం దుదాహరించినాఁడు. ఇవి యేగ్రంథములోనివో యాతఁడు చెప్పలేదు. ఈపద్యములయందు త్రిపురాసుర సంహారము వర్ణితమైనది. రెండును రెండు శతకములలోనివని తోఁచుచున్నది. కవిచరిత్రమేమియుఁ దెలియదు. జగ్గనకవికంటెఁ బూర్వుఁడు. నిజామురాష్ట్రవాసుఁడని యూహ కలుగుచున్నది.

సీ. తలకమ్మికొండయు విలుకమ్మికొండయు
గడయును నడుముగాఁ గలుగు తేరు,
సరసిజముకుళంబు సద్వాక్యసకలంబు
మాతయు నా లగుమాతలియును,
మిన్నులఁ జనువాఁడు కన్నుల వినువాఁడు
నాకపర్యంకంబు లైనశరము,
చల్లని పవనంబు నెల్లైనభువనంబు
మేపును మోపుగా మెలఁగునారి,

గీ. కాఁకకోర్చువిల్లు గఱిగలగుఱ్ఱాలు
పగలు రేయుఁ దిరుగుబండికండ్లు
గలుగఁ బురజయంబుఁ గైకొన్న నినుఁగొల్తు
చిరశుభాంక! సోమశేఖరాంక!

సీ. వింటిక్రిందటికొమ్మ వికలించి పెఱికిన
భూకాంతకును నాభి పొలుపు మిగిలె
నమ్మ్రుచ్చుకొనఁగ నమితతరంగముల్
పాలసముద్రంబునఁ బ్రజ్వరిల్లె
బండికండులు రెండు పండ్లిగిలించిన
గలువలు దామరల్ చెలిమిచేసె
వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ
జిచ్చుకు నాఁకలిచిచ్చు పుట్టె

గీ. నారి సంధింపఁ గశ్యపువారి వడకె
గోలసంధింప లచ్చికి గోలపుట్టె
విల్లుఁ దెగఁ బాపి పురములు ద్రెళ్లసేసి
తరిదివిలుకాఁడ వాఁడుమో శరభలింగ.

## 210 దామరాజు సోమయ్య



ఇతఁడు భరతము అనుగ్రంథమును రచియించెనని రామాభ్ర
గ్గడ జగ్గనకవి ప్రబంధ రత్నాకరమున నైదుపద్యముల నుదాహరించ
టచే నీకవినామ మెఱుఁగనయ్యెను. ఈగ్రంథము నాట్యశాస్త్రమున
బోధించుచున్నది. ఈకవి చారిత్రమేమియుఁ దెలియరాలేదు. ఆయైద
పద్యముల నిట నుదాహరించి తృప్తిచెందెదను.

ఉ. అంబరసీమఁ దారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా
ళంబున హారసంతతు లిలాస్థలి బూవులవక్షముల్ ప్రసూ

నంబులు సత్కృతాంజలి ననంపగి మౌక్తికతుల్యమాళి గం
గాంబుకణంబు లుట్టిపడ నాడెడు శంభుఁడు మిమ్ముఁ బ్రోవుతన్.

మ. అడుగుల్ ముప్పదియాఱిటన్ వెడలు పై హస్తత్రిషట్కంబుచే
నిడుపై యున్నతమై సమస్థలమునై నిర్మోకహస్తాంకమై
వృడమిత్ర (?) పులందువాకిలొకలై మించం గవాక్షంబు లిం
పడఁగన్ శాలను రాజు షడ్విధము నాట్యంబిట్టు సేయించుటన్.

ఉ. నందిమృదంగరావము ఘనస్తనితంబని మ్రోల నున్నయా
స్కందుని వాహనం బగుశిఖండి యఖండిత నృత్యమాడ భీ
తిం దనహస్తరంధ్రము గతిం జొరనాభరణాహిరాజి వో
వం దలయూచు విఘ్నపతి భాసురపూత్కృతి మమ్ముఁ బ్రోవుతన్.

సీ. ప్రాకారములయందుఁ బటుగోపురంబుల
దామరమ్యద్వారసీమలందు;
విపణిగృహంబుల వెలయు నాయుధహస్త
భటులను హితముగాఁ బ్రౌఢినిల్పి
రక్షితం బొనరించి రాజబింబద్యుతుల్
మించికాయుచునున్న మంచివేళ
మహిమనాప్తసుబంధుమధ్యస్థలమునందుఁ
జెలఁగి రత్నాసనాసీనుఁడగుచు

గీ. నర్తకేళీలాస్య నటనాగతులచేత
శాస్త్రసమ్మతముగ జనులకెల్ల
వేడ్క సూపి మఘవవిభవుఁడై కొలువుండ
వలయు నిఖిలకళలు నెఱిగి.

సీ. మొదలి పుష్పాంజలి ముదమునఁ గావించి
కరబాళి మొగబాళి పరువులెత్తి
యురుపృథుబాళము లొగిఁ బిల్లమురువును
హస్తపక్షికరణము లేననువుపఱచి

కడకట్టుశబ్దంబు కడఁగి దర్వులుజిందు
బాగైనగీతప్రబంధములును
కుండలిబహురూపదండలాస్యవిలాస
దేశిమార్గంబులతెఱవులెఱిఁగి
గీ. నయము బిఱుసును నరిగతుల్ కడిఁదిగాను
తిరువు మురువును నిలుకడ తిన్ననగుచు,
పాత్రఁ గొనిపించఁ గొనఁగను బ్రౌఢియైన
వాఁడె నటుఁ డనఁబరఁగు నీవసుధయందు.

---

# 211 సిద్ధనప్రెగడ



ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథములో సిద్ధన ప్రెగడ శాకుంతలములోనిదని యీక్రింది పద్య మొకటి యుదాహరింపఁబడినది. ఈగ్రంథకర్తనుగూర్చిన విషయము లేమియుఁ దెలియలేదు.

ఉ. నీరజమిత్రుతో బయలనిల్చి చలంబునఁ గిట్టి మైమయిం
బోరుట దుర్లభంబనుచు బూరితమఃపటలంబు లొక్కమై
సూరెలఁ గోటవట్టి పొడసూపఁగనొక్కొ యెదిర్చె నాఁగఁ బ్రా
కారనిబద్ధనీలమణికాంతిఁ గనుంగొన నొప్పు నెంతయుఁన్.

తిక్కనసోమయాజి పూర్వులలో నిరువురు సిద్ధనలున్నారు. కాని వారు కవులైనట్లు గాన్పింపదు. భావిపరిశోధనమువలన నీసిద్ధన బయట పడవలసియున్నాఁడు.

# 212 రామా పెగ్గడ జగన్నాథకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశిక గోత్రుఁడు; గంగనామాత్యునకును జానమకును బుత్త్రుఁడు; రామ మంత్రివీరమాంబలకుఁ బౌత్త్రుఁడు; ఈకవి కాపురస్థలము కృష్ణామండలమునందలి యేలూరు సమీపముననున్న పెదపాడు నివాసుఁడగుటచే నీతనిని పెదపాటి జగ్గనయని వాడుచున్నారు. కాని వీరి యింటిపేరు రామాప్రెగడవారయిన ట్లీక్రింది పద్యములో నున్నది.

ఈకవి, అనేకకవుల గ్రంథములలోని వర్ణనాంశములు గలపద్యముల నేర్చి యయిదాశ్వాసములుగాఁ గూర్చి దానికిఁ బ్రబంధరత్నాకరమని పేరుపెట్టి, దానిని శ్రీజగన్నాథస్వామి కంకితము చేసెను. ఇందు మూఁడాశ్వాసములు మాత్రమే తంజావూరు పుస్తకభాండాగారమునందున్నది. ఆగ్రంథమందలి కృత్యాది పద్యములను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు తమ ప్రబంధరత్నావళిలోఁ బ్రకటించియున్న వాని నీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను. గ్రంథవిస్తరభీతియున్నను, ఈకవి కాలనిర్ణయ మనేకకవుల కాలనిర్ణయమునకు దోడుపడునది యగుటచే నీజగ్గనకవి కాలమును సరిగాఁ దెలిసికొనుటకై భావిపరిశోధకులకు సాహాయ్యమగునను తలంపున నాపద్యముల నన్నిటి నుదాహరించితిని. జగన్నాథస్వామి కలలోఁ గన్పడి తన కీగ్రంథము నంకితము సేయుమని యానతిచ్చినట్లు కవి చెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీకరనవపుండరీక సంపదలకుఁ
గవయైన నేత్రయుగ్మంబుతోడ
శంఖశార్ఙ్గస్ఫురచ్చక్రగదాశోభి
తములైన హస్తపద్మములతోడఁ
నూర్జిత మకుటకేయూరకౌస్తుభచారు
రమణీయమణిభూషణములతోడఁ

బదియాఱువన్నెల పసిమించు తళుకుల
వలనైన పసిఁడిదువ్వలువతోడ
గీ. నిరతమును గూర్మిమీఱి పేరురమునందుఁ
గాపురం బున్నదుగ్ధాబ్ధి కన్యతోడ
శ్రీజగన్నాథుఁ డెలమి నాశ్రితనిధాన
మర్థిఁ గల నాకుఁ బ్రత్యక్ష మైనఁజూచి.
సీ. నీలాచలాగ్రసన్నిహితనిత్యనివాస!
వాసవార్చితదివ్యవస్తునిరత!
రతగోపకన్యకాచతురతాతత్పర!
బరతత్త్వవాసనాప్రకటసార!
సారసోద్భవనుత! శయనపారావార!
వారణోద్ధరదయావరవిశేష!
శేషాహితల్ప! సుస్థిరసచ్చిదానంద!
నందవ్రజస్ఫుటోన్నతవిహార!
గీ. హారకేయూరమకుటమంజీరవిసర
సరసభూషణభూషితస్ఫారరుచిర
చిరదయాలోల! రక్షణస్నేహవిజయ!
జయజగన్నాథ! దేవతాసార్వభౌమ!
గీ. అనుచు నుతియించు నాదునెమ్మనము సెలఁగ
ననఘుఁ డాద్యుండు పురుషోత్తమాఖ్యపురపు
శ్రీజగన్నాయకుఁడు సమాశ్రితనిధాన
మాదరంబున న్నిట్లని యానతిచ్చె
ఉ. ఆరయ రామప్రెగ్గడకులాగ్రణి గంగయమంత్రిజగ్గ! మా
పేరిటివాఁడ వెప్పుడును బ్రేమ ఘనంబగు మాకు నీపయిన్
గౌరవలీల నీవు సమకట్టిన మేలిమికావ్యసార మిం
పారఁగ మత్సమర్పణము నన్వహకీర్తి గఁ జేయు నావుడున్
వ. మనమునఁ బ్రమోదాయత్తుండనై యిట్లని వితర్కించితి.

చ. జననుతులౌ కవీశ్వరుల సత్కృతిసారము కావ్యసారవ
ర్ణన మని చేసి నీలగిరినాథుని కర్పణసేయుటొప్పుఁ జ
క్కని పదియాఱువన్నె కనకంబున వాసనకస్తురిన్
గనదురుకాంతియున్ జెలువునన్ ఫలమబ్బుట భాగ్యమే కదా!

వ. అని కృతనిశ్చయుండనై జగన్నాథదేవ కరుణాసుధాసారంబునఁ గావ్యసారం బొనరింపఁ బ్రారంభించి మదీయ వంశావతారం బభివర్ణించెద.

సీ. తనప్రభుత్వము దేవతాప్రభుత్వమున కం
తయు నొప్పు వేయినేత్రములవానిఁ,
దనలావునన భూతధాత్రీతలం బెల్లఁ
దలఁబూనుకొను వేయుఁదలలవానిఁ,
దనపేరుఁ దడవినజనుల పాపౌఘముల్
మర్దించు వేయునామములవానిఁ,
దనమూర్తి త్రిభువనతమసమాలసమునంగఁ
దఱిమెడు వేయుఁ బాదములవానిఁ,

గీ. దనదుకూరిమిసుతునిఁగాఁ గనినవానిఁ
దరమె వర్ణింప సంతతోద్దారకీర్తి
ననుపమజ్ఞానమూర్తి దయానువర్తి
భవ్యగుణఖనిఁ గశ్యపబ్రహ్మమౌని

శా. ఆమౌనీంద్రు శుభాన్వయప్రకటదుగ్ధాంబోధి శుభ్రాంశుఁడౌ
రామప్రెగ్గడ గంగరాజునకు విభ్రాజద్యశస్స్ఫూర్తి వ
ల్లామాత్యుం డుదయించి కాంచె నురుభవ్యాకారులన్ బేర్మి రా
మామాత్యాగ్రణి గంగరాయని సముద్యద్బంధుమందారులన్.

ఉ. దండెగు (?) ప్రత్తిపాటి పురధాముఁడు వల్లనరామమంత్రి తా
నిండినవేడ్క నారరథినీపతి వీరమనున్ వివాహమై
కొండయ తిమ్మమంత్రి మణికోవిదులన్ గనియెం బ్రసూనకో
దండ జయంతతుల్యసముదంచిత రూపవిలాసవంతులన్.

చ. శరనిధికన్యకామణిని శౌరి వరించిన సొంపునన్ మనో
హరగుణశాలి గంగసచివాగ్రణి సమ్మతిఁ బెండ్లియాడె నా
హరితపవిత్రగోత్రుఁ డగునబ్బరిలింగన కూర్మిపుత్త్రి సు
స్థిరగుణధాత్రిఁ జానమ నశేషశుభాంచితగాత్రి నుర్వరన్

చ. సతతము సజ్జనాగ్రిబుధసన్నుతులై విలసిల్లునట్టి దం
పతులకు నుద్భవించితిమి పంకజనాభకృపాసమృద్ధిచే
ధృతినమరాద్రితుల్యు లగుతిమ్మయ వల్లయలున్ సమున్నత
స్థితిఁ గవిమిత్రబాంధవవిధేయుఁడ జగ్గనమంత్రివర్యుఁడన్.

శా. భారద్వాజనితాంతగోత్రుఁడని చెప్పన్మించునాదాలెపల్
సూరామాత్యుని పుత్త్రి నమ్మనను సంశోభాంగి నుద్వాహమై
సారోదారుఁడు తిమ్మమంత్రి గనియెన్ సత్పుత్రునిన్ వేంగనన్
గారా మొప్పఁగఁ గొండమంత్రిమణి నాగంగయ్య చానార్యులన్

గీ. లలి భరద్వాజ గోత్రుఁడౌ వెలఁగలేటి
కొండనామాత్యశేఖరు కూర్మిపుత్త్రి
వసుధరామాంబఁ బెండ్లియై వల్లమంత్రి
మదన సమమూర్తి సింగనామాత్యుఁ గనియె.

సీ. శాశ్వతవిక్రమైశ్వర్య సంపదలందుఁ
కపికేతు వృషకేతు గరుడకేతు
భుజబలకారుణ్య భూరిప్రతిజ్ఞల
బలరాము రఘురాముఁ బరశురాము
సత్కార్యవితరణ సౌందర్యములయందుఁ
బాణుఁ బన్నగబాణుఁ బ్రసవబాణు
ఘనతరమానస కాంతిపెన్నిధులందు
రారాజు ద్విజరాజు రాజరాజు

గీ. సాటిసేయంగఁదగుఁ జతుర్జలధివేష్టి
తావనీచక్రరాజసభాంతరముల
రమ్యతరభాగ్యగుణశాలి రామప్రెగడ
మంత్రి గంగయవల్లనామాత్యవరుని.

ఈజగ్గకవియే కాకుండ నీకనొకయాతఁడుకూడ నిట్లే పూర్వ కవులగ్రంథములలోనుండి వర్ణనాంశములతోఁ గూడియుండిన పద్యములను సేకరించి, యొకగ్రంథముగా సంధానించియున్నాఁడు. ఈ రెండవ సంధానకర్తపేరెఱుంగరాదు. ఈగ్రంథము నుదాహరణ గ్రంథమని వాడుచున్నారు. పండితాగ్రగణ్యులగు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిలు గారు చాల శ్రమచేసి యీరెండు గ్రంథములలోని పద్యములను సమకూర్చి ప్రబంధరత్నావళి యనుపేరున నొకగ్రంథముగాఁ బ్రకటించి యున్నవారు. ఇందుమూలమున దాదాపు డెబ్బదిమంది కవులపేర్లును వారు రచించిన గ్రంథనామములును దెలియవచ్చుచున్నవి. ఆయుదాహరణ గ్రంథములను, జాగ్రతగఁ బరిశీలించినచో, మరియు జగ్గనకవి కృతమైన ప్రబంధరత్నాకరమునందలి తక్కిన రెండాశ్వాసములును లభించినచో నింకను మఱికొందఱు కవులు బయలుపడవచ్చును.

ఈసంధాతల కాలనిర్ణయముకొఱకై శ్రీ ప్రభాకరశాస్త్రిలువారీక్రిందివాక్యములను వ్రాసియున్నారు. "ఇర్వురు సంధాతలును గొంచెమించుమించుగా సమకాలమువారనియే తలఁపవచ్చును. మనమెఱింగినంతలో జగన్నాథకవి యుదాహరించిన వారిలో మాదయ్యగారి మల్లయ్య, తెనాలి రామలింగయయును, రెండవసంధాత యుదాహరించినవారిలో నల్లసాని పెద్దనార్యుఁడును నర్వాచీనులు. జగన్నాథకవికంటె నిర్వాదేండ్లు రెండవసంధాత ప్రాచీనుఁడయినఁ గావచ్చును."

సుప్రసిద్ధకవిశేఖరు లగు పింగళి సూరనార్యుఁడు రామరాజభూషణుఁడు మొదలగువారి పద్యము లీగ్రంథములో నుదాహృతములైనట్లు కాన్పింపదు. దీనినిబట్టి యీజగన్నాథకవి క్రీ.శ. ౧౫౫౦–౬౦ ప్రాంతమువాఁడని నిర్ణయింపవచ్చును.

ప్రబంధరత్నావళియం దుదాహృతులైన కవుల నీగ్రంథమున నచ్చటచ్చటఁ జేర్చుచు వచ్చితిని. ఈసందర్భమున శ్రీప్రభాకరశాస్త్రిలుగారియాంధ్రసేవ యత్యంతము కొనియాడఁదగినదని చెప్పవలసియున్నది.

---

# 213 పింగళి సూరనార్యుఁడు



కవితాప్రపంచమున నిష్కళంకసుధామయూఖ ప్రభలతోఁ బ్రకాశించుచున్న యీకవిచంద్రుఁడు, ఈనిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు; గౌతమగోత్రుఁడు; అమరనామాత్య యబ్బమాంబికల పుత్త్రుఁడు; సూరయామాత్యయమలమాంబికలకుఁ బౌత్త్రుఁడు.

ఈమహాకవి గరుడపురాణము, గిరిజాకల్యాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, ఇంకననేక కృతులు రచియించినవాఁడు ఇందు మొదటి రెండుగ్రంథములు నిప్పుడు లభించుటలేదు. రాఘవపాండవీయమునఁ గవి తన వృత్తాంతమును గృతిపతి పలుకులుగా నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు
సుచరిత్రుఁ బింగళసూరసుకవి
పౌత్త్రు నన్నవసతిభావనదౌహిత్త్రు
నమరధీమణికి నబ్బమకుఁ బుత్త్రు
ననుజన్ము లైనట్టియమలన యెల్లనా
ర్యులు భక్తి సేవింప నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని
సూరననామవిశ్రుతుని నన్నుఁ

ఆ. బ్రియము సంధిలంగఁ బిలిపించి బహువస్త్ర
భూషణాదిదానములఁ గరంబు
సంతసంబొనర్చి యొంతయు గారవ
మెసఁగ మధురఫణితి నిట్టులనియె.

పింగళియను గ్రామనామమునుబట్టియే యీకవి గృహనామ మేర్పడినదనియు గోకనామాత్యుఁ డీవంశమునకు మూలపురుషుఁడ

నియు నాతఁ డొకగంధర్వుని దాసిగా నేలెననియు. నాతని వంశము వారే పలనాటను, పాకనాటను, పలుతావులకుఁ బోయి వాసముచేయు చుండిరనియు, కవి తనప్రభావతీ ప్రద్యుమ్నమునం దీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. ఆగౌతమగోత్రంబున
నాగమవిధి పుట్టె గోకనామాత్యుఁడు స
ద్భోగక్షేత్రస్వామ్య స
మాగతిఁ బింగలిపురాంకుఁడై యతఁడొప్పెన్.

ఉ. పేర్వెలయంగ నాఘనుఁడు పింగలిగోకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తుఁ జేకొయనుదానిని దాసిఁగ నేలె యోగితా
గుర్వనుభావుఁడై నెరపె గోపకుమారుని ఖడ్గవర్ణనం
బర్వపునిండు వెన్నెలలపై నెఱిఁ జూపెడుకీర్తిసంపదన్.

ఉ. సంతతిలేక మున్నతనిజాయ సభక్తిని సూర్యసేవ య
శ్రాంతముఁ జేయఁగా నతఁడు సద్ద్విజుఁడై కలవచ్చి దొండబె
ట్టింతికి నిచ్చి చాల ఫలించును నీకిది పోఁదిచేసికొ
మ్మెంతయు నంచుఁ బల్కెనఁట యింతియు నాకలగాంచి ధన్యయై

తే. సకలదిశలకు శాఖోపశాఖలిడుచుఁ
బొదలిఫలియించు దొండయుఁ బోలి ప్రబలి
యాత్మసంతతి పుత్త్రపౌత్రాదిబహుప
రంపరల నొప్పు వెలసె భర్తయును దాను

మ. తరములెన్నాల్గయి రెండు నెందు నగుఁ దత్తద్గ్రామ నామంబులన్
బరఁగున్ వంశములెల్లఁ బూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో పింగలినామ మందుఁ జిరకాలావాస్యులై యున్నసు
స్థిరతద్గోకనమంత్రి వంశజులకున్ జెన్నొందు మిన్నందుచున్

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళి రామయాదులు లలిం బలనాటను బాకనాటనుం

బింగళిగానయామాదు లిటఁ బెంపుసహించిన యస్మదాదులా
పింగళిగోకమంత్రియిలు పేరనె చాలప్రసిద్ధులెల్లచోన్.

ఈపద్యమునందు "ఇట" అని చెప్పెనే కాని తనవాసగ్రామమేదియో చెప్పలేదు. కాని యీతనినివాసము "గౌతమీపరిసరము" "కృష్ణ కెలంకులు" "పలనాఁడు" "పాకనాడు" మాత్రము కాదని తోఁచుచున్నది. పింగలి యనుపురమెచ్చటనున్నదియుఁ దెలియలేదు. నిజాము రాష్ట్రములోనున్నదని యనుచున్నారు. రాఘవపాండవీయమునందలి "శోభిత ఆపస్తంబసూత్రుఁ" డనుపద్యమే కృతిపతిపలికినట్లుగాఁ గళాపూర్ణోదయమునందును వేసికొనినాఁడు.

ఈకవికి మూలపురుషుఁడైన గోకనామాత్యుఁడు గంధర్వి నొక దానిని దాసిగా నేలెననుటనుగురించి యొకకథ కలదు. ఆకథను బ్ర. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. ఆకథను వారి వాక్యములతో నిట వ్రాయుచున్నాఁడను.

''ఈపింగళివారి పేకికథను జనులీప్రాంతములయం దిప్పుడు సహితము వాడుకగా చెప్పుకొనుచున్నారు. పింగళిగోకనామాత్యుఁ డొకనాఁ డరణ్యములో సంచరించుచుండఁగా, ఆతని కొకసుందరమయిన పూస దొరికినదఁట. అతఁడాపూసను దెచ్చి తనపెట్టెలోవేసి దాఁచెనట! ఆదినమునందే పేకియనుపేరుతో నొకతెవచ్చి వారియింట దాసిగా కుదిరి మిక్కిలి విశ్వాసముతో పనులు చేయ మొదలుపెట్టెనఁట ఇట్లు కొంతకాలము జరిగినతరువాత గోంకనామాత్యునిభార్య గర్భవతియై ప్రసవసమయము సమీపించినప్పు డాపురిటియింటిలో పేకిని కావలిపెట్టిరనియు, అది యాకావలియున్న దినములలో నొకనాఁటి రాత్రి తాను శయనించినస్థలమునుండి లేవకయే నాలుకను దీర్ఘముగా చాచి దానితో దీపమెగసనఁ ద్రోచెననియు, అదిచూచి యాతని భార్య భయపడి జరిగినవృత్తాంతమును భర్తతో చెప్పెననియు, అందు మీఁద వారు దాని నేలాగునైన వదల్చుకోవలెనని యెటువంటి యసాధ్యములగుపనులు చెప్పినను, పేకివానినెల్ల నిముషములో నిర్వహించుచు

వచ్చెననియు అందుమీఁద వారు దానిని వదల్చుకొను సాధనము లేక కాశికిపోయి గంగతెమ్మని దానిని దూరదేశమునకుఁ బంపి యది యింటలేని సమయమునందు సమస్త సామగ్రితోను పొరుగూరికి లేచిపోయిరనియు, ఇంతలో పేకి కాశినుండి గంగ తీసికొనివచ్చి యింటివారు పొరుగూరికి పోవుచప్పుడింట దిగవిడిచిపోయిన నలువు రెత్త లేని పెద్దఱాతిరుబ్బురోటిని నెత్తిమీఁద పెట్టుకొని యదివఱచి వచ్చితిరని పొరుగూరికిపోయి వారికి చేర్చినదనియు, అప్పుడు గోఁక నామాత్యుఁడు నీవుమమ్మెట్లువిడి చెదవని దానిని మంచిమాటలతో నడుగఁగా నాఁడరణ్యములో దొరకిన పూసనిచ్చివేసినయెడల పోయెద నని యది చెప్పెననియు. అంతట దానియభిమతమును దీర్చివారు దానిని పంపివేసిరనియు కథ చెప్పుచున్నారు." వదల్చుకొనుటకు వీలులేని సంద్భము వచ్చినప్పుడు "పింగళివారి పేకివలె" మమ్మిట్లు పట్టుకొంటివని సామెతగాకూడ నిప్పటికిని యీకథను వాఁడుచున్నారు

ఈతఁడు రచించిన గ్రంథములలో మనకు లభించుచున్న వాని యందు మొదటిది రాఘవపాండవీయము. ఇదినాల్గాశ్వాసములుగల ద్వ్యర్థికావ్యము. ఒకేపద్యమునందు రామాయణ భారతార్థములు రెండును వచ్చునట్లీతఁడీ గ్రంథమును రచియించి, ఆకువీటిప్రభువై భు వగు పెదవెంకటాద్రి ప్రేరణమున శ్రీ విరూపాక్షస్వామికిఁ గృతియొ సంగెను. రెండర్థములుగల కావ్యములలో నిదియే మొదటిది. అంతకు పూర్వము వేములవాఁడ భీమకవి యొకరాఘవ పాండవీయమును రచించియుండెనను ప్రతీతి సూరనార్యుని కాలమునాఁటికే కలదు. కాని అందలియొక్క పద్యమైన నప్పటికే లభించుటలేదని యీక్రింది రెండు పద్యములవలనఁ దెలియుచున్నది.

శా. రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుందద్గతిఁ గావ్యమొల్లసగునే నోహో యనంజేయుదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బంబద్భుతంబంద్రు ద
క్షుండెవ్వాఁడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

ఉ. భీమన తొల్లిచెప్పె ననుపెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గాన రటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నామదిఁ దద్ద్వయార్థకృతినైపుణియుం గలదంచు నెంచెదన్.

కృతిపతి యైన పెదవెంకటాద్రివిభుఁడు, రాఘవపాండవీయమును రచించి యాకువీటియందలి శ్రీ విరూపాక్షస్వామి కంకితసేయుమని చెప్పిన ట్లీక్రింది రెండుపద్యములను గవి రచించియున్నాఁడు

క. చాటుప్రబంధరచనా
పాటవకలితుఁడవు శబ్దపరిచితి యందున్
మేటివి దీనిం దెనుఁగునఁ
బాటించి రచింప నీవ ప్రౌఢుఁడ వరయన్.

ఉ. దక్షత యింతగల్గి విశదంబుగఁ గాంచియు నీవు దీని ఫలా
పేక్ష ఘనంబుగామి నిది యిట్టిన గొంకెద నీకునోలలా
టాక్షుణభక్తిశీల! రచియించుట యిష్టము కాదె శ్రీవిరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్.

వ. అని సవినయభక్తికంబు లగు మధురభాషణంబుల నిజాభిలాషంబు తెఱం గెఱింగించిన నేనునుం దదీయంబులగు నతిమాత్రగౌరవ సంభావనాది విశేషంబులచేతం బ్రీతచేతస్కుండనై యునికిం జేసి శక్యాశక్య విచారంబు లేక యంగీకారభంగీతరంగితంబగు నంతరంగంబుతో నతని నభివీక్షించి".

ఈవాక్యములవలనఁ గవి కేవలధనాశపరుఁడై వెంకటాద్రిప్రభువు నాశ్రయింపలేదనియు. నాతనికడ నుచితమర్యాదతో నుండి స్వతంత్ర జీవనము చేయుచున్నవాఁడనియు, దెలియుచున్నది. ప్రభావతీ ప్రద్యుమ్నషష్ఠ్యంతములలోఁ దండ్రిని నుతియించుచుఁ గవి రచించిన యీక్రిందిపద్యములనుబట్టి వీ రగ్రహారికులైనట్లు గానవచ్చుచున్నది.

క. పృథులాంకాశీసేతు
ప్రథనిడుమానూరి కృష్ణరాయ సముద్ర

పరిథితాగ్రహారభోగా
తిథేయ నిజసంతతిప్రతీతాత్మనకున్.

దీనినిబట్టి కవినివాసమీ గ్రామములలో నేదియైనఁ గావచ్చును. నిడమానూరు కృష్ణామండలమున బెజవాడ తాలూకాలోనున్నది.

రెండర్థములు గల కావ్యమును రచించుటయందుఁ దనకుఁగల సామర్థ్యము నీక్రిందిపద్యములలోఁ జెప్పుచుఁ గవి తన గ్రంథమును జదువునప్పుడు, ప్రతిపద్యమునకును రెండర్థములను ఎప్పటి కప్పుడే చూడక ఒకకథనే దృష్టియందుంచుకొని గ్రంథమునే కార్థకావ్యమువలెనే రెండుసారులు చదువుకొనవలయునని పాఠకులను హెచ్చరించుచున్నాఁడు.

ఉ. రాఘవపాండవీయకథ రమ్యముగా నొకకావ్యసృష్టి నా
హా! ఘటియింపఁగా వశమె యాంధ్రకవీంద్రుల కైనఁ దావక
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యము గావునఁ గోవిదానుకం
పాఘనబుద్ధిఁ జూపెదఁ జమత్కృతి మత్కృతిశ్లేషమున్.

సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష
యొక్కొక్కచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న
ర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొక్కతఱి
నర్థాన్వయము వేఱెయగుచు మనికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక్క
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు

తే. మూఁడు గూడుట యన సముజ్జ్వలముగాఁగ
నాకుఁ దోఁచినగతి బెక్కుఁబోకలమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచుచు మతుల కేర్పడ నాచరింతు.

క. ఒకకథవినియెడి తరి వే
ఱొకకథపై దృష్టినిడిన నొకయర్థముఁ దోఁ
పకపోవుఁ గాననేకా
ర్థకావ్యమెట్లొక్క వినఁగఁదగు నొకటొకటిన్.

తే. ప్రభువు సత్కారగుణమిందుఁ బాయుననియు
శ్రీవిరూపాక్ష సేవావిశేష మనియు
సుజను లిందుగుణాంశంబ చూతు రనియుఁ
జలిపితి నసాధ్యకృతి కిట్లు సాహసంబు.

రాఘవపాండవీయ కృతిపతియైన పెదవెంకటాద్రి క్షత్రియుఁడనియుఁ గౌండిన్యగోత్రుఁడనియు, ఆకువీడుపట్టణప్రభువనియు రాఘవపాండవీయమున వర్ణింపఁబడియున్నాఁడు. ఆకువీఁడు పంపానదీతీరమున నున్నట్లు గన్పట్టుచున్నది. అదియిప్పుడే పేరుననున్నదో తెలియదు. గోదావరి మండలమున భీమవరాంతికముననున్న ఆకువీఁడు కలదుకాని యిదియనికాదు. ఈపెదవెంకటాద్రి విజయనగరములో నొకమేటియై యుండెనని యీక్రింది పద్యమువలనఁ దెలియఁగలదు.

క. వడిగలతనాన, సీగిని,
యిడిముడిపసఁ, బ్రాభవమున విజయనగరిలోఁ
గడు నెన్ననేర్పుఁగలమే
లడకలఁ బెదవెంకటాద్రి నరవరుఁ డొప్పున్.

పెదవెంకటాద్రి తమ్ముఁడైన చినవెంకటాద్రిని గవి యీక్రిఁది పద్యములో వర్ణించియున్నాఁడు.

తే. అమరవరభూమిభృన్మస్తకములఁ గ్రిందు
పఱచు నిజపాదకటక సత్ప్రౌఢిచేత
విమలధృతిఁ గేశవప్రాయణమున వెలయు
వేంకటాద్రియనఁ జినవెంకటాద్రి.

ఈచినవెంకటాద్రి కుమారధూర్జటిచేఁ గృష్ణరాయ విజయమును రచియింపఁ జేసెనని కొందఱనుచున్నారు. కాని యదిసత్యముకాదు: ఈవిషయమునుగూర్చి కుమార ధూర్జటిచారిత్రమునఁ జర్చించెదను.

రాఘవ పాండవీయమునందలి యీక్రింది యాశ్వాసాంత పద్యములలోఁ గూడ, కృతిపతియైన విరూపాక్షస్వామి పంపాతటము నందలి హేమకూటపర్వతముపై నున్నవాఁడని స్పష్టమగుచున్నది.

క. పెదవెంకటాద్రి హృదయా
స్పదపదవిన్యాస తుంగభద్రావీచీ
మృదుసీకరవిరచితనిజ
సదనాంగణరంగవల్లి సౌభాగ్యకళా!

క. శ్రీపంపాసరసక్రీ
డాపండిత పెద్దవేంకటక్ష్మాపతి చి
త్తోపాసితపద ప్రత్య
గ్రూపవిరూపాక్ష హేమకూటాధ్యక్షా.

పై పద్యములనుబట్టి ఆకువీడుపురమును విరూపాక్షస్వామియుఁ దుంగభద్రా నదీతీరమున నున్నట్లు స్పష్టమగుచున్నది. ఈయాకువీటి ప్రభువులు చిన్నసంస్థానాధిపతులై కర్ణాటకరాజులకు సామంతులై యుద్ధములలో వారికి సాహాయ్యమొనర్చుచున్నట్లు గన్పట్టుచున్నది. పెదవెంకటాద్రికిఁ బితామహుఁడైనయిమ్మరాజు రాజమహేంద్రవరముపై జరిగిన యుద్ధములోఁ బాల్గొనిన ట్లీక్రిందిపద్యములోఁ గవి వర్ణించియున్నాఁడు.

క. రాజమహేంద్రవరాధిపు
రీజైత్రవిచిత్రములఁ బరిభాజితుఁడై
యాజిఘనుం డాయిమ్మమ
హీజాని ప్రసిద్ధిఁ గాంచె నెంతయు మహిమన్.

శ్రీకృష్ణదేవరాయలు శాలివాహనశకము ౧౪౧౪ వ సంవత్సరమున రాజమహేంద్రవరమును గజపతినుండి జయించియుండెను. ఆయుద్ధమున నీయిమ్మరాజు పాల్గొనిన ట్లూహింపఁదగియున్నది. ఈయిమ్మరాజున కప్పటికి నలువది సంవత్సరముల వయసుండునని తలంచితిమేని, పెదవెంకటాద్రికి ౨౫ సంవత్సరముల వయసున నన(గా శాలివాహనశకము ౧౫౭౫ సంవత్సర ప్రాంతమున నీకావ్యమును రచియించెనని తలంపవలసియుండును.

కవి సంజీవని యనులక్షణగ్రంథమును రచించిన ముద్దరాజు రామనకవి యీ రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమును రచించెను. ఈ ద్వ్యర్థికావ్యరచనమునకుఁ బిమ్మట రెండర్థములుగల కావ్యములు మఱికొన్ని బయలు వెడలినవి కాని యవి యింత ప్రౌఢముగా లేవు. తిక్కనసోమయాజికిఁ బిమ్మట నింత ప్రౌఢముగా, నింతమనోహరముగా, నింతచాతుర్యముగాఁ గవిత్వము చెప్పినవాఁ డీతఁడే. ఆంధ్రకవుల నెన్నువేళ నీతఁడు తప్పక ద్వితీయస్థాన మాక్రమించుకొను ననుటకు సందియము లేదు. ఇంతకంటె పాండిత్యమును జూపిన కవివరుల గ్రంథములు కొన్ని కలవు. కాని కవిచరిత్రకారులనిన ట్లీతనివలె సర్వతోముఖచాతుర్యమును జూపినకవి యింకొకఁడు లేఁడు. తిక్కన భారతమును విడచితిమేని, యీతని గ్రంథములను జదువునప్పుడు గలిగెడు యానందము వేఱుపుస్తక పఠనమువలనఁ గలుగదని నొక్కవాక్యమును వ్రాసి, ముగించెదను. రాఘవపాండవీయమునందలి నైదు పద్యములీతని శైలి తెలియుటకై యిట వ్రాసెదను.

చ. తెలివి నతిప్రగల్భుఁ డసదృగ్బలుఁ డాతఁడు భీష్మచాపకౌ
శలమె సహాయమై యమరశత్రుల నేపడఁపన్ వలంతియై
నిలుకడ నేలె విశ్వధరణిం దనమిత్రకులంబు నైభవో
జ్జ్వలతఁ దలిర్ప బౌరవసుసంతతి రాజులకెల్ల హెచ్చుగన్ ౧౭.

శా. అంతన్ వారలు రామభద్రపద రాజ్యారూఢిచే నెంతయుం
జింతాతీతవిశేషసౌప్రబలలక్ష్మి న్మించు చుం జద్ఘనో
పాంతం దత్పురిగూఢరాజపదవిప్రాకారరేఖన్ శుచి
స్వాంతుల్ సేరిరి తత్పురోహితముఖవ్యాకీర్ణప్రసన్నాత్ములై ౨౭.

చ. అతఁడును దత్తపోమహిమ యచ్చపుమానులు వచ్చి చెప్పఁగా
నతికుతుకంబునన్ వినుచు నచ్చటికిం జనియెం బరాజితో
ద్ధతి విలసద్వయోమ్యగయుతన్ వనలక్ష్మి నశేషలోక సం
స్తుతగుణవున్ ధరాత్మజను జూపియుఁ జెప్పియు వేడ్కసేయుచున్. ౩౭

ఉ. అతతవేగయానమున నంతట నావిలసన్మలుండు గో
త్రాతనయాభివర్ణన విధాన ముకంబితవృత్తిమై సము
ద్ధ్యోతిలనేగి కాంచి రయమొప్పఁగఁ బల్కె నృపాలసూను ని
ర్ధూతతరాఘునుత్తరు గరుస్ఫుటసంభ్రమచిత్తుఁ జేయుచున్. ౧౪.

చ. నరుఁ డని లెక్కసేయఁడు మనంబున శాత్రవు నమ్మహాత్ముచే
యురణముఁ బెక్కుచోట్లఁ గనియున్ మననాయకుఁ డేమిచెప్ప ని
ద్దురమును మున్నుగాఁ దెలిపి తోడుగ నిన్నెటులైనఁ దేకయి
ట్లరికృత భీష్మహాని ననయంబును దుర్బలుఁడయ్యెనక్కటా! ౧౫.

ఈమహాకవి రచనములలో రెండవది కళాపూర్ణోదయము. ఇది యొక యత్యద్భుత కల్పనా కావ్యము. ఇది యేపురాణములోను గనుపట్టదు. ఎనిమిదియాశ్వాసములుగల యీమహా కావ్యమును నంద్యాల ప్రభు వగుకృష్ణమరాజున కంకితముచేసెను. గ్రంథవిస్తరభీతిచే నిందలి కథాసారమును వ్రాయఁజాలకపోయితిని. ఈకథాసారమును తడకమళ్ల కృష్ణారావుగారు వ్రాసియుండిరి అది యముద్రితము. దానితాళపత్ర ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయపండితు లగు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారుకూడ వ్రాసియుండిరని వినుచున్నాఁడను.

నంద్యాల కృష్ణమరాజు వంశమునకు మూలపురుషుఁడు ఆరవీటి బుక్కరాజు. ఆరవీటి పట్టణము రాజధానిగా రాజ్యముచేయుటచే నీత నికి ఆరవీటి బుక్కరాజు అనిపేరువచ్చినది. ఇతఁడు చంద్రవంశపు క్షత్రి యుఁడని చెప్పుదురు. ఈతనికి అబ్బలమ్మ, బల్లాంబిక యని యిరువురు భార్యలు. అబ్బలమ్మయందు సింగరాజు, రామరాజు, అహోబలరాజు అను మువ్వురు కుమారులు. ఇందులో సింగరాజునకు నరసింహరాజు నారపరాజు, తిమ్మరాజు అని ముగ్గురు తనయులు. ఈమువ్వురిలో పెద్దవాఁడైన నరసింగరాజు నంద్యాలపురాధిపత్యమును గైకొనుటచే నప్పటినుండియు నీతని సంతతివారికి నంద్యాలవారని పేరువచ్చినది.

ఈవిషయమునుగూర్చి కవి కళాపూర్ణోదయమునం దిట్లు వర్ణించి యున్నాఁడు.

ఉ. వ్రాలినకీర్తిఁ బెంపెసఁగి వారలలో నరశింహరాజు నం
 ద్యాలపురాధిపత్య విభవాతిశయంబు వహించి మించె ను
 ద్వేల నిరూఢి నెల్లెడల విశ్రుతమై తనవంశ మెల్ల నం
 ద్యాలపదప్రసిద్ధిఁ దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్;

ఈనరసింహరాజున కైదుగురు తనయులు. ఇందు రెండవ యాతఁడు నారపరాజు. ఈనారపరాజు కొడుకు నరసింగరాజు. ఇతనికిఁ బెదకొండమ, చినకొండమ యని యిరువురు భార్యలు. ఇందు చినకొండమ కుమారుఁడైన కృష్ణమరాజే కళాపూర్ణోదయ కృతిపతి. ఈవంశవృక్షమును బరికించితిమేని, ఆర్వీటి బుక్కరాజునకుఁ మూల పురుషుఁడైన కృతిపతి కృష్ణనురాజు, మునిమనుమని మనుమఁ డగుచున్నాఁడు కృతిపతికిఁ బితామహుఁడైన నారపరాజు, కొండవీటివద్ద కుతుబన మల్కుతో జరిగినయుద్ధములోఁ బాల్గొనిన ట్లీక్రింది పద్యములోఁ గవివర్ణించియున్నాఁడు.

చ. వదలక యుత్కళేంద్రునిసవాయి బరీదు నడంచు దుర్జయున్
 గుదుపనమల్కుఁ దల్లడిలఁగొట్టె మహాద్భుత సంగరంబులో
 నెదిరిచి కొండవీటికడ నెవ్వరుసాటి విచిత్రశౌర్య సం
 పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్.

కొండవీటివద్ద కుతుబనమల్కును జయించినది శ్రీకృష్ణదేవరాయ లనియు నీయుద్ధము హమాణశకము ౧౫౧౫ వ సంవత్సరమున జరిగిన దనియు, చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఆయుద్ధమునం దీనంద్యాల నారపరాజు శ్రీకృష్ణరాయలకు సాహాయ్య మొనర్చెనని చరిత్రకారులు వ్రాసి, పైపద్యము నుదాహరించియున్నారు. కృష్ణదేవరాయలకు సహాయులుగా నున్నవారిని వర్ణించిన కృష్ణరాయ విజయము నందలి యీక్రింది పద్యములో నంద్యాలవారుకూడ నుండుటచే, యీ

నారపరాజే కృష్ణదేవరాయనికి సాహాయ్యమొనర్చినవాఁడని నిశ్చయింపవచ్చును.

సీ. కోటలు దుర్గముల్ గొనుచు దోఃప్రతాపబల
ధాటిచే మించునార్వీటివారు
కంటకామితకంఠలుంటనోద్ధతలీల
దంటలై తగుతోరగంటివారు
నిర్భరంబుగ శత్రునికరంబు నడఁగించి
ధీరులై మించు గొబ్బూరివారు
చాలదోర్బలలీల సరదారి సంఘంబు
దూలించి వెలయు నంద్యాలవారు
నాదిగాఁ గల్గురాజులు మేదురగతిఁ
దళువదొరలును బోయలు దురుసుగాఁగఁ
బ్రతిదినంబును ఘోరమౌ రణమొనర్ప
నిలిచిపోరాడె గజపతిబలము లపుడు.

ఈనంద్యాల నారపరాజు శాలివాహన శకము ౧౪౭౦ అగు కీలక సంవత్సర మీనమాస బహుళపక్ష పంచమి సోమవారమునాఁడు పల్లిపట్టు, గుండిపూండి అను రెండు గ్రామములను శ్రీ వెంకటేశ్వర స్వామివారికి సమర్పించినట్లొక శిలాశాసనము తిరుపతిలో నున్నది. ఆపస్తంబ సూత్రుఁడును యజుశ్శాఖీయుఁడును ఆత్రేయగోత్రుఁడును నంద్యాల నరసింగరాజు కుమారుఁడునగు నారపరాజని యందువ్రాయఁబడియుండుటచే, ఆనారపరాజీతఁడే యనుటకు సంశయములేదు. శాసనమందీయఁబడిన దినము హూణశకము ౧౫౪౯ సం. మార్చి 18వ తేదీ అయినది. అప్పటికి సదాశివరాయలు కర్ణాటరాజ్యము పాలించుచున్నట్లాశాసనమునందున్నది. నారపరాజీదానమును తనవృద్ధాప్యమునఁ జేసి యుండునవియు, నప్పటి కాతనికి డెబ్బది సంవత్సరముల వయసుండు ననియు, భావించితిమేని యాతనికి ౧౫౧౫ వ సంవత్సరపు యుద్ధము నాటికి ౩౫ సంవత్సరముల వయసుండునని తేలుచున్నది. అది సత్య

మున కంతదూరముగా నుండదని నాయభిప్రాయము. అట్లయినచో నారపరాజు జన్మము ౧౪౮౦ ప్రాంతమును నాతని కుమారుఁడైన నరసింగరాజు జననము ౧౫౦౫ ప్రాంతమును కృతిపతియైన కృష్ణమరాజు జననము ౧౫౩౦ ప్రాంతమునైయుండి, యాతనికిరువది లేక యిరువది యైదు సంవత్సరముల వయసునాఁ డనఁగా క్రీ. శ. ౧౫౫౦ సంవత్సర ప్రాంతమున కళాపూర్ణోదయ రచనము జరిగియుండవచ్చును.

కృతిపతి యీ కావ్యమును రచించి తనకంకితమొనర్పుమని, కవిని గోరిన ట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. నీచే నొక్క మహాప్రబంధము గడుఀ నిర్నిద్రసారస్య లీ
లాచిత్రంబగుదాని నోయనఘ! వాలాయంబు చేయించుకో
మాచిత్తంబున వేడ్క యుండునది నీమాధుర్యధుర్యోక్తు వా
గ్వైచిత్రిఀ సఫలంబు చేయుము సుధీవర్గంబు లోహో యనన్.

మ. ఇట మున్నారుడసంహితాదికృతు లింపొందఁగాఁ జెక్కి న
ద్భుట విన్నారము చెప్పనేల యవి సంస్తుత్యోభయశ్లేష స
ఘటనఀ రాఘవపాండవీయకృతి శక్యంబె రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీకె చెల్లెనది భాషాకావ్యముం జేయఁగన్.

క. అని యాదరణము మిగులం
దనర నియోగింప నేను నాకొలఁది గనుం
గొనకీయకొంటిఁ దగ నా
యనఘుఁడు సంకల్పసిద్ధుఁ డను నమ్మికచేఀ.

వ. ఇవ్విధంబునం బూని యమ్మహాప్రభువు సగౌరవ నియోగంబున కు ననుగుణంబుగా మదీయశక్త్యనుసారంబున విచారించి యపూర్వ కథాసంవిధానవైచిత్రీమహనీయంబును శృంగారరసప్రాయంబును బుణ్య వస్తువర్ణనాకర్ణనీయంబును నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు నిర్మింపం గడంగితి.

ఈకవి కవిత్వమెట్లుండవలయునో గ్రంథమందలి పాత్రలచేఁ జెప్పించి వానిచేఁ దనకవిత్వమావిధముగా నున్నదని సూచింపఁజేయుచుండును. అందుల కీక్రిందిపద్యములు తార్కాణములు.

సీ. పొసఁగ ముత్తెపుసరు లొప్పహాళించినలిలఁ
దమరోవ దొరయు శబ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నస్థానంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి

తే. యనురసుపమాదులును యమకాదులునగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె!

లయవిభాతి: చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసగు కప్పురపు బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జనముల మిగుల బెం
పెసగు నలయసవరంపు గొదములకు మాధురిత్వం
బలవడిననీడు మఱికల దనఁగవచ్చుఁ
గడు వెలయఁ గలయీసుకవిపలుకులకు నెంచన్
కళాపూర్ణోదయము.

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్లనక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక

పరికృతార్థభావంబు బాదుకో నడుచు
నుపపత్తి యొందు నత్యూర్జితముగ
తే. నొకటం బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె.

ప్రభావతీప్రద్యుమ్నము.

ఈతని కవిత్వశైలి రుచిచూపుటకై కళాపూర్ణోదయమునందలి పది పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

మ. తమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చను దెంచు రీతిఁ గనుఁగొంటే దివ్యమానీంద్ర నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్ద్రాఁచులాగొప్పెడున్. ౧ ఆ.
మ. భళిరా సత్కవివాదునిక్కమతగన్ భావించి నీవన్నయా
మెలపాఱియంపు మిటారికత్తెల బెడంగే నెందునుం గానవా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యా
దలఁ దన్నంజనుమట్లు మించెననినం దప్పేమి యొప్పేయగున్.
చ. అలయక, వేదశాస్త్రసతతాభ్యసనవ్యసనప్రసంగతిన్
దెలివి యొకింతఁ గాంచినగతిన్ నుతికెక్కియు వెఱ్ఱిదీరరోఁ
కవిదలఁ జుట్టినున్న క్రియఁ గా నొకకొందఱు నల్తురప్పటిం
గలుషపథప్రవర్తనమె కర్మపువాసన నన్యుఁగొల్వఁగన్; ౨ ఆ.
శా. ఆలీలన్ రతికేళిఁ దేలితు దయం దాయిద్దఱున్ గేలిభి
న్నాలంకారము లొక్కరొక్కరికి నింపొనట్లుగా దిద్దుచున్
లోలత్వంబుననుండ నచ్చటికి నాలోలత్పద శ్రేణిచా
ప్పాలోకింపుచు రంభ వేఱొకతె డాయన్వచ్చె చిత్రింబుగన్. ౩ ఆ.
ఉ. శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బారవైచి త
చ్ఛాయ యొకింత మున్నిఁగని చాలఁ గృశించితి గాజుపూసకై

నాయవివేకమేమనుకొనం దుదఁ దన్మణియబ్బెనన్న న
త్యాయతతత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నేఁచి యుండెదన్. ౪ ఆ.

చ. అటుదలఁ డౌర యెంతటిమహాత్ములు మీరలు నాదుమీఁద నా
కటకట మీవచోరచన కౌశలమో భువన ప్రపంచ సం
ఘటన ధురీణయన్న నగి కామిని యిందిపుడేమి గాంచి యీ
కిటుకు గడించి పల్కెదెఱఁగింపుము కల్గిననాకు నావుడున్. ౫ ఆ.

ఉ. మంగళసూత్ర మొక్కటియె మాని సమస్త విభూషణంబులుఙ్
రంగదభంగుర ప్రణయరవ్యత నొండొరు మీఱ నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చి ముందటను బోవిడు కాంతల రూపు తొంటికం
టెంగరగించెఁ గాంతు ప్రకటీకృత భక్తి యొసామ్మ సాధ్వికిఙ్. ౬ ఆ.

ఉ. ఏనుఁగు శైలతుల్యత వహించియు మందగతిత్వదోషముం
బూనుట వధ్యభావమును బొందెఁదనుస్థితి గాంచెమయ్యెఁ బం
చానన మెంతయున్ శరభ సాతిశయోత్పతన ప్రభావముం
బూనుట ఘాతుకత్వమును బొందెజయంబులు శౌర్యసాధ్యముల్ ౭ ఆ.

తే. నింగియని యొడి ప్రత్తి చేనికి నిరక్త
బలియిడిరనంగ నెఱసంజ తొలుతనదరఁ
దఱుచుగాఁ దానవిఱిసిన మెఱుఁగుఁబత్తి
విల్లునాఁ జుక్కలెంతయు నుల్లసిల్లె ౮ ఆ.

ఉ. ఇట్టిటు యామినీమణుఁ డేఁచఁగ నెప్పటిలీలఁ జాలఁ జూ
పట్టమిఁ జూచి శ్రీ నెలవు పద్మినిఁ గైకొనకప్పుడక్కటా
గట్టిగఁ దప్పి యాళితతికై రవిణి న్వెసఁ జేరెరాజుచే
పట్టినవారు దేవులను పల్కు యథార్థము చర్చ సేయఁగన్. ౮ ఆ.

ఈకవియొక్క తుదిరచనము ప్రభావతీప్రద్యుమ్నము. ఇది తన తండ్రియైన యమరయామాత్యున కంకితముచేసెను. తనతమ్ముఁడైన యెఱ్ఱన కాశీ, గయ మొదలగు పుణ్యక్షేత్రాదుల కేఁగి గయాశ్రాద్ధాదులొనర్చి పితృరుణమును దీర్చెననియుఁ దానీగ్రంథమునంకితము జేసి

తండ్రికి శాశ్వతకీర్తిని గల్గించెదననియు నిదివఱకు దాను రచించిన గ్రంథములలో దన వంశవర్ణనము గావింపలేఁననియు నాకొఱఁత నీగ్రంథములోఁ బూర్తి చేసెదననియుఁ గవి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

మ. జనములెచ్చఁగ మున్రచించితినుదంచద్వైఖరింగారుడం
బను శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మతి
నెనుఁగుంగబ్బములెన్నియేనియును మత్పిత్రాది వంశాభివ
ర్ణనలేమిం బరితుష్టినాకవియొనర్పంజాల వత్యంతమున్.

క. తండ్రియె సుతులకుదైవం
బంద్రుగదా వేదవాదులదివినియును నే
వీంద్రుసు వాంద్రుసు బలె మా
తండ్రిఁ బరమపూజ్యుఁగాఁగదలఁపమితగు నే.

మ. గయలోఁగాశిఁ బ్రియాగ శ్రీగిరిని గంగాద్వారనీలాచలో
జ్జయనీద్వారకలందయోధ్యమధురన్ సంస్తుత్య పుణ్యస్థలా
గ్రియతన్వొండియుమించు నైమిశకురుక్షేత్రాదులందర్పణ
క్రియచేనాపినతమ్మడెట్టిన యొనర్చెందండ్రి కాహ్లాదమున్.

క. ఏనుంబితృపూజననా
చేనైనన్లెద్దిస్సినఁ జేయఁగవలయున్
గానఁగృతియిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్.

ఎట్టిన యొనర్చినదానికంటె సూరనార్యుఁడుచేసిన కార్యమే యుత్కృష్టతమమైనది. తనకీర్తి నిస్థిరముగా చేయుటయేఁగాక సూరన, తనతండ్రియొక్క వంశముయొక్క యశము నాచంద్రార్కస్థాయిగా చేయఁగలిగినాఁడు. ప్రభావతీప్రద్యుమ్న రచనమునాటికి కవికఱువది యేండ్లుండునని భావింపవచ్చును. అప్పటికీతనికవిత్వము ముక్కాకలఁదీరి మేల్మిఁగాంచినది. అంతకంటె యెక్కువవయసుగలవాఁడందుమేని జరా

భారముచే నంతటి పటుత్వమును కవిత్వమునఁ గనుపరుపలేఁడని తలంచుచున్నాఁడను.

రాఘవపాండవీయమును ౧౫౮౫ వ సంవత్సర ప్రాంతముననుు, కళాపూర్ణోదయమును ౧౫౫౦ వ సంవత్సరప్రాంతమునను రచియించియుండవచ్చునని పైనివ్రాసియున్నాఁడను. ప్రభావతీప్రద్యుమ్నమును ౧౫౬౦ సంవత్సరప్రాంతమున ౬౦ ఏండ్లవయసున రచియించియుండవచ్చును. అట్లయినచోఁ గవి ౧౫౦౦ సంవత్సర ప్రాంతమున జనియించి, ౧౫౩౦ వఱకును విద్యార్థిదశయందును, శాస్త్రగ్రంథపఠనమునందును గడపి, గరుడ పురాణాదికృతులు ౧౫౪౦ సంవత్సర ప్రాంతమునాఁటికి రచియించియుండవచ్చునని తోఁచుచున్నది.

ఈకవి కృష్ణదేవరాయల యాస్థానమునందుండెనని కొందఱును లేఁడని కొందఱును చెప్పుచున్నారు. పైనివ్రాసిన ప్రకారము ౧౫౦౦ సంవత్సరప్రాంతమున నీకవి జన్మించినాఁడని యందుమేని, శ్రీకృష్ణదేవరాయల రాజ్యపరిపాలనాకాలము ౧౫౦౯ మొదలు ౧౫౩౦ వ సంవత్సరమువఱకునై యుండెను. కావున నప్పటికీతఁడు విద్యార్థిదశయందుండునే కాని యాస్థానకవులలో నొక్కఁడై యుండఁడు. ఎంత వెనుకకు నెట్టవలయునని చూచినను నీకవి జననము ౧౫౦౦ వ సంవత్సరమునకుఁ బూర్వమని చెప్పుటకుఁ దగిన యాధారములు లభింపలేదు. కావున నీతఁడు కృష్ణదేవరాయల కాలమున నుండెనని చెప్పవచ్చును గాని యతని యాస్థానకవియని చెప్పుటకవకాశము కన్పించుటలేదు. ఒకవేళ నీకవి ౧౫౨౫ వ సంవత్సరము మొదలు కవిత్వము చెప్పనారంభించెనని తలంచినను, కృష్ణదేవరాయల యాస్థానకవిగా నుండెనని యెట్లు చెప్పఁగలము? కృష్ణరాయల యాస్థానకవిగానుండెనని వదంతి యున్నది కాని గ్రంథస్థనిదర్శనము లేమియు లేవు.

"ఈసూరనార్యుఁడల్లసాని పెద్దన్న మనుమరాలి భర్తయనియుఁ, జిన్నతనములో నితఁడు చదువులేక మూఢుఁడై తిరుగుచుండుట చూచి యితనినిమాత్రమే కాక యాతని భార్యను సహితము మూఢభర్త ద్వార

కీనని యెల్లవారును పరిహసింపుచువచ్చిరనియు, అందుమీఁద సూ॥నకు రోషమువచ్చి దేశాంతరముపోయి చదువుకొని పండితుఁడై వచ్చి రాఘవ పాండవీయమును చేయనారంభించెననియు అప్పుడాచిన్నది తనభర్తను వెంటబెట్టుకొని తాతగారియొద్దకుఁబోయి నీమనుమఁడు రాఘవపాండవీయమును జేయుచున్నాఁడని చెప్పఁగా నతఁడందులోని పద్యము నొకదానిని చదువుమని యడిగెననియు, అందుమీఁద సూరన

"తలపంజొప్పడి యొప్పెనప్పుడు"

అనిపద్యమును జదువనారంభింపఁగానే యల్లసానిపెద్దన్న "యింతలోనే నాలుగు విరుపులా" యని యాక్షేపించెననియు, తరువాత సూరన పైభాగమునందుకొని

"తదుద్యక్షైత్రయాత్రాసము

త్కలికారింఖదసంఖ్య సంఖ్యజయవత్కాంక్షాణరింఖావిశ్రం
ఖలసంఘాతధరాపరాగపటలాకాన్తింతంబు మిస్నేరన
గ్గళభేరీరవనిర్దళద్గగన రేఖాలేపపం కాకృతిన్

అని చదువఁగా మెచ్చుకొనెననియు చెప్పుదురు కాని యీకథ విశ్వాసార్హమయినదిగాఁ గాన్పింపదు పెద్దనామాత్యుఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. సూరనార్యుఁడు ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఈ రెండు శాఖలవారికిని సంబంధబాంధవ్యములు చేసికొను నాచారముండెనా? యని సంశయము కలుగుచున్నది. ఒకవేళ నట్టి యాచారమున్నను దీనినిబట్టి సూరనార్యుని కాలనిర్ణయము గావించుటకు వలనుపడదు. ఈమనమరాలు పెద్దనకుఁ బౌత్రియో దౌహిత్రియో తెలియదు. పై నివాసిసిన సంగతులకంటె ఎక్కువ సత్యసమీపముగా కాలనిర్ణయమును జేయుటకీకథ యాధారముకానేరదు.

పింగళి సూరన్న గిరిజాకల్యాణములోనిదని యీక్రిందిపద్యము రంగరాట్ఛంధస్సులో నుదాహరింపఁబడియున్నది. కాని యీపుస్తకమిపు డెచ్చటను లభించుటలేదు.

క. కోపాటోపంబున ధర
ణీపాలకచంద్రముఁడు మునిశిఖామణులన్
ద్రోపించినవారు దురా
లాపములాడుచునుబోయి రాసమయమునన్.

ప్రభావతీ ప్రద్యుమ్నమునందలి కథ భాగవతమందలి ఉషాపరిణయ కథను బోలియుండును. వజ్రనాభుఁడను రాక్షసుఁడు బ్రహ్మ వలన వరములను వజ్రపురియను పట్టణమును బడసి లోకకంటకుఁడై దేవేంద్రాదులను దిరస్కరించుచుండెను ఆతనికిసునాభుఁడను సోదరుఁడు కలఁడు. వజ్రనాభునకుఁ బ్రభావతియను కన్యకయు సునాభునకు చంద్రవతి, గుణవతియను నిరువురు తనయులును గలరు. ప్రభావతి పార్వతీ వరప్రసాదిని ఆమెకు శ్రీకృష్ణుని తనయుఁడగు ప్రద్యుమ్నుని భర్తగా నిర్ణయించి స్వప్నమున నాతని చిత్రపటమును పార్వతి యొసంగెను. శుచిముఖియను రాజహంస దేవేంద్రునిచే ననుపఁబడి ప్రభావతీ ప్రద్యుమ్నులకు దౌత్యము నడపినది. ప్రద్యుమ్నుఁడును నాతని సోదరులగు గదసాంబులును నటకులఁబలె వజ్రనాభుని యాజ్ఞచేఁ దత్పురప్రవేశంబు గావించి వారితనయలఁ బొందవడసి, యారాక్షసుల సంహరించి, లోకంబు నిష్కంటకంబుగావించి, వారితనయలం బరిణయమాడి సంతో సముంగనిరి.

ప్రభావతీ ప్రద్యుమ్నము:—

ఉ. పాడిఁదొఱంగఁజన్నె యొకపట్టునఁ గొల్చెద నంచు నెంతమా
టాడితి సర్వదైవతకులాధిప! యోడలు బండ్లవచ్చు బం
డ్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో నను వైన తావులం
గూడుట యిష్టబంధులకుఁ గొత్తయె యిత్తఱినింతయేటికిన్ ఆ౧

చ. తడవులఁ బట్టి యేము సతతంబును బోదుము వానిపీటికిన్
గడుమతిచాలమిం గడుపుఁ గక్కఱితి స్సురలోకనాథ! మా
యెడఁగలయట్టితప్పిది సహింపుము పక్షుల మాట నొక్క వెం
బడి నిదిచెల్లెఁగాక రిపుప్రాంతము చేరెదు వారలాప్తులే. ఆ౧

ఉ. ఎమ్మెయిఁ బ్రజ్ఞమీఱ వచియించెద నన్న వచింపలేని య
క్కొమ్మ మనమ్మెఱుంగులోన నొకకోటి తమాంశము నైన నంతమా
త్రమ్మె మదుక్తిశక్తి యనరా దతివాఙ్మహిమాఢ్య నేను మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిగ నన్ను దిద్దుటన్. ఆ౧

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీ రుచిరూపబ్రహ్మముల్ హంసయో
షిద్వ్యాఖ్యార్థ్య ధురీణవాగుపనిషద్వృద్ధాంత మార్గాను సా
రోద్యత్ప్రజ్ఞను బల్మరున్ మననసంయుక్తంబు గావించుచున్
హృద్యైక్యంబై యది యంతకంత కలరెన్ నిర్వ్యాజయుం జిత్తముల్. ఆ౨

చ. ఎనయఁగ నెవ్వరెంత మనసిచ్చి వచించిరి తాను వారితోఁ
బనుపడ నంతమాత్రప్రతిభాషణ సూడుట యుక్తమంద్రు మీ
కొనరఁగఁ బన్ని సంపు గెలుపోటలు దీర్పఁగ నిప్పు డేను జె
ప్పినదియ చాలు నింకఁ దలపెట్టుట చెల్లదయొక్కడేమియున్ ఆ౩

ఉ. భావనచేసి చూడ క్షణ భంగుర మింతులతాల్మికల్మి వా
తావిలపల్లవాంచల హిమాంబుకణంబును నంతకంటె మే
ల్గావున నింక నెంత యవిలంబము సంగ్రహనేగి ప్రోచెదో
దేవ రచిత్త మాసతి యదృష్టము వేయును జెప్పనేటికిన్ ఆ౪

చ. సకలవిశేషశోధనకుఁ జాలిన యోనెఱజాణ వజ్రనా
భకులవతంసరత్న మా ప్రభావతి రోహితకంటకంబు తా
పకమగు చూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వఁగా నన
త్యకలుషవృత్తి నాసుకృతమంతయు నేఁడుసుమీ ఫలించుటల్ ఆ౪

చ. పడఁతుల చర్య లిట్టివి నృపాలకుమారక నేఁటిదాఁక గు
ట్టడలఁగ నీదుసూటమియపేక్షఁ బడంగల పాటులెల్లఁ దాఁ
బడియిపుడిష్టసంభృతిఁ బొఱుచుఁ దాఱుచు నేక్రీడ బెనం
గెడుఁ గనుఁగొంటె యంచుఁ జెలి కేల్గదియించె రతీశుచేతిలోన్ ఆ౫

ఈకవి ప్రభావతీప్రద్యుమ్నమునఁ గోడిపాతను మనోహరముగా వర్ణించియున్న పద్యము నీక్రిందనిచ్చుచున్నాఁడను.

మ. సమయాభిజ్ఞత గుక్కుటంబు వివిధశ్వాంకస్క్రియామంతరం
తిమయామోభగవాన్వృషిః కుసుమధన్వీ దేవతా మానినీ
రమణాయాం వినియోగయంచు నిది యారంభించెఁగాబోలు నా
నమరెం గద్ధ్వనిమానినుల్ రతికిదాసై నాథులం బైకొనన్.

పాఠకులకు హృదయరంజకముగా నుండునని యుత్తరప్రబంధములనుండి కోడికూతలను వర్ణించిన మరి రెండు మూడు పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. ఒకనాఁడిందుప్రియంత వేలుపు మదీయోక్తి న్విడంబించి తా
నొక కాలంబెఱిగింపవచ్చిముని శాపోద్వృత్తి పాలయ్యె మూ
వక శబ్దంబిది యెప్పమేతిరిమని సంభావ్య త్రికాలీ విబో
ధకమార్గరీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతందామ్రచూడౌఘముల్.

వసుచరిత్రము

మ. తగణిం దత్సమయాప్రతీక్షణ వినిద్రప్రౌఢి మెప్పించి త
ద్గరలబ్ధారుణదీప్తిమాళిఁగొని తత్త్రైలోక్యగవైత్రియా
పరిణామత్రిగుణత్వ వైభవము గోర్వగా సారెఁ గీర్తించుపై
ఖరిమోసెన్ జరణాయుధంబులుతిరేఖాభుగ్న కఠాగ్రటన్.

హరిశ్చంద్రనలోపాఖ్యానము.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మకవర్గత్రయికిన్ మదుశ్చరిత శబ్దజ్ఞానమే మూలమిం
తకుఁ బోల న్విను డంచుఁ దెల్పుగతిఁ జెంతం గొండపై పల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్.

ఈప్రభావతీ ప్రద్యుమ్న కావ్యమున కాధారము హరివంశమని కవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

తే. అఘహరణహరివంశకథాశ్రయంబు
నాత్మపుత్త్రిగుణస్తవనాంకితంబు

నైన యీకావ్యమునకు మహాప్రసిద్ధి
నిచ్చుఁ గావుత కరుణ లక్ష్మీశ్వరుండు

కేరళదేశీయుఁ డగురవివర్మదేవుఁడను నొకకవి సంస్కృత మునఁ బ్రద్యుమ్నాభ్యుదయమనుపేర నీకథనే నాటకముగా రచియించి యున్నాఁడు. ఆనాటకమునకును నీప్రబంధమునకును నితివృత్తమునం దును పాత్రల నామములలోను జాల పోలికలున్నవి. ఈరెండును జది వినవారికి ఎవరినెవరనుకరించిరని సంశయము కలుగును. గాని పరిశీ లించిచూచినచో వీరిరువురునుగూడ హరివంశము నాధారముగాఁగొని తమతమ గ్రంథములను రచియించి యుండిరని స్పష్టమగును. రవివర్మ దేవుఁడు క్రీ. శ. ౧౨౮౦ ప్రాంతమువాఁడని మూఁడు శాసనముల నాధారముగాఁ గొని పీఠికాకారు లగు శ్రీ త. గణపతిశాస్త్రిగారు నిర్ణయించియున్నారు.

ఈసూరనార్యునిఁ దను తమ గ్రంథములలో నుతించిన కవులు పెక్కురు కలరు. ఒక్క పద్యముదాహరించెదను.

ఉ. శ్లిష్టకవిత్వవైఖరి విచిత్రతరాఘవ పాండవీయ ము
త్కృష్టముగా రచించి జగదేకనుతుల్గని ధాత్రిలో నవ
దృష్టయనంగఁ బద్మభవసన్నిభుఁడైన మహాకవీశ్వరా
భీష్టతమప్రభావుఁ డగు పింగళిసూరకవీంద్రుఁ గొల్చెదన్.

పోడూరి పెదరామామాత్యుఁడు.

సాంబోపాఖ్యానకర్త యగుమోచెర్ల నన్నయకీసూరనార్యుఁడు మాతామహ వంశములోనివాఁడఁట-

"ప్రేమ మదీయమాతామహవంశవి
హారుఁ బింగళి సూరనార్యుఁ దలఁచి

సాంబోపాఖ్యానము.

ఈకవి రచించిన కళాపూర్ణోదయమునకు మూలాధారమును గూర్చి భారతి పత్రికలో పండితులు చర్చించియున్నారు. వివిధో ద్యానములనుండి బహువిధ కుసుమంబులం దెచ్చి రమ్యతర మగుమాలం

గూర్చి మాలాకారునింబోలె బహువిధ పురాణజ్ఞుఁడగుసూరనార్యుఁడు పురాణములయందలి యనేకఘట్టములం దీసికొని, తనకనుకూలముగ దిద్దితీర్చి యీయుగ్రంథమును నిర్మించి కృతకృత్యుఁడైనాఁడు. ఈ గ్రంథ మొకపురాణమునకుగాని, యందలి యొకభాగమునకుగాని యను వాదమును గాదు, అనుకరణమునుగాదు. ఇదియొక విచిత్రమైన ప్రబంధము. అత్యద్భుతమైన యితివృత్తము.

ఈమహాకవి తనగ్రంథములయందుఁ జిత్రకారునకుఁ జిత్రములను లిఖించుకొనుటకై యనువగు సూచన నొసంగుచుఁ జక్కని పద్యములను రచించియున్నాఁడు. సుప్రసిద్ధచిత్రకారుఁడగుంవివర్మ యాంధ్రభాషాజ్ఞానముకలవాఁడు కాకపోవుటచే సూరనార్యుని గ్రంథములఁ జదువమి నీచిత్రముల లిఖింపలేదని యూహింపఁజగియున్నది. అందలి పద్యములఁ గొన్నిఁటి నిట నుదాహరించుచున్నాఁడను.

మ. తమిఁ బూఁదీగెలఁ దూఁగుటుయ్యేలలఁ బంతాలాడుచుందూగునా
కొమరుం బ్రాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ జక్కఁగాజాఁగిమిం
టిమొగంబై చనుదెంచు తీవి గనుఁగొంటే దివ్యమానీంద్రనా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుంగాల్ద్రాఁచులాగొన్నడిక. 1ఆ43

గీ. ఒరగు మీఁదటఁజేరి కూర్చున్న ప్రియుని
యురము తరలంబు సోక మే నొయ్యవంచి
కనఁగఆవలసిన యది గనుం డనుచువంత
గుచభరాలస వోలె నక్కనను వ్రాలె 8ఆ190

కళాపూర్ణోదయము.

ఉ. ప్రాణసఖీ! నిను న్నెరయఁబాసి చనన్ దటి వచ్చెనాకుఁ గ
ళ్యాణి! తలంపుమీ సుసమయంబుల న న్నని పేర్మిమెంపునక
బాణి మెడం దగిల్చి తనపైకిఁ దదాస్యము వంపఁబూని సు
శ్రోణి నిజేశు మోమగుటచూచిత్రపాద్భుతమోదమగ్నతక. 5ఆ177

ఉత్సా:- అనుచు గగనభాగమునకు నంచయెగయఁజూచినన్
దనుజకన్యకాలలామ తనదురెండుచేతులన్
వినయమొప్పఁ బొదుగఁబట్టి వేనవేలభంగులన్
దనరఁ బ్రియముఁ జెప్పుచును ముదంబెలర్ప నిట్లనున్ 3ఆ65
పరిభావతీపరిద్యుమ్నము.

ఇట్టి వింకను గలవు

ఈమహాకవి చారిత్రము నెంతవ్రాసినను దృప్తి కలుగదు. గ్రంథ విస్తరభీతిచే నింతతో విరమించెదను.

# 214 రామరాజభూషణుఁడు



ఆంధ్రపంచకావ్యములలో నొకటిగా సుప్రసిద్ధినొందిన వసుచరిత్రము రచించినయీమహాకవి భట్టుమూర్తి; ఈతనియింటిపేరు ప్రబంధాంకమువారు; తండ్రి సూరపరాజు; తాత తిమ్మరాజు; ముత్తాత సింగరాజు; ఈకవిశేఖరుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమనుద్వ్యర్థి కావ్యమునుగూడ రచియించెను నరసభూపాలీయమని నామాంతరముగల కావ్యాలంకార సంగ్రహమునుగూడ నీతఁడే రచియించెనని కొందఱును, ఆగ్రంథకర్త వేఱని కొందఱును జెప్పుచున్నారు. కావున ముందుగ నీగ్రంథత్రయకర్తృత్వమునుగూర్చి విమర్శించుట యావశ్యకమైయున్నది. ఈవిషయమునఁ బండితులలో ననేకమాఱులు చర్చలు జరిగియున్నవి. గ్రంథములుకూడ బయలువెడలినవి. నేనేమి చెప్పినను జర్వితచర్వణమేయగును. అట్లని నేనావిషయమును దలపెట్టకుండుటయుచితము కాఁజాలదు. క్లుప్తముగా నందునుగూర్చిచర్చించెదను. ఈమూఁడు గ్రంథములయందును గవివృత్తాంతములను దెలుపుపద్యగద్యములనిట నుదాహరించుచున్నాఁడను. ఇందువలన వివాదవిషయము స్పష్టము కాఁగలదు.

సీ. శతలేఖినీపద్యసంధానధౌరేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని
రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య
సాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచిత శ్లోకభాషాకృత్యు
చతురునోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
నమితయమకాశుధీ ప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్త్రి ప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రి
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు.

గద్యము:- ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశప్రతిభాబంధుర ప్రబంధ పఠనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయ భూషణసుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రి సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తిప్రణీతం బైన కావ్యాలంకార సంగ్రహం బను మహాప్రబంధంబు.

నరసభూపాలీయము.

మ. నను శ్రీరామపదారవింద భజనానందుఁ జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశి సం
జనితైకైకదినప్రబంధఘుటికా సద్యశ్శతగ్రంథ క
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెం గృపన్.

శా. శ్రీరామక్షితిపు న్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణుల్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాది స
త్కారంబందితి. రామభూషణకవీ! ధన్యుండ వీ వన్నిటన్

గద్యము:- ఇది శ్రీరామచంద్రచరణారవింద వందన పవననందనప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతంబైన వసుచరిత్రంబు"

వసుచరిత్రము.

సీ. వారధిలంఘనకృపావర్ధితోభయకవి
తాకల్పాంత్య రత్నాకరుండ
సకలకర్ణాటకరాధురంధరరాను
విభుదత్త శుభచిహ్న విభవయుతుఁడ
వసుచరిత్రాది కావ్యప్రథిత బహునృప
ప్రాపితానేకరత్నప్లవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహ
నిరుపాధి నైశ్వర్యనిత్యయశుఁడ

గీ. శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ
తిమ్మరాజ ప్రియతనూజ ధీరసూర
పాత్రుఁడ రామనృపభూషణాఖ్యసుకవి
నంకితమొసర్తు నీకావ్యమనఘశక్తి.

గద్యము:- ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతంబైన హరిశ్చంద్ర నలోపాఖ్యానం బనుమహాప్రబంధంబు"

"హరిశ్చంద్రనలోపాఖ్యానము"

వసుచరిత్రమునఁ గవి తనతాతతండ్రుల నామములనుగాని గృహనామమునుగాని చెప్పియుండలేదు. అయినను, హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందలి గద్యయు, వసుచరిత్రములోని గద్యయు నొకేవిధముగా నుండుటచేతను, హరిశ్చంద్రనలోపాఖ్యానమందలి సీసపద్యములో వసుచరిత్రమును దానురచించినటు చెప్పియుండుటచేతను, నీ

రెండు గ్రంథములకుఁ గర్త యొక్కఁడేయనియు నాతనిపేరు రామ
రాజభూషణుఁ డనియు, నీరెండుగ్రంథములలో వసుచరిత్రము ముందును
హరిశ్చంద్రనలోపాఖ్యానము వెనుకను రచియింపఁ బడియెననియు
నిశ్చయమగుచున్నది. ఈవిషయముల నిదివఱకెవ్వరును గాదనియుండ
లేదు. ఇఁక వివాదవిషయము నరసభూపాలీయ కర్తృత్వమును
గూర్చియే- కవిపేరు నరసభూపాలీయమునుండి పైనను దాహరింపఁ
బడిన పద్యములో "శుభమూర్తి" యనియు, గద్యలో "మూర్తి"
యనియుఁ జెప్పఁబడినది. రచనాసౌలభ్యముకొఱకు వివాదాంశము
నిర్ధారణమగువఱకు నరసభూపాలీయ కర్తను మూర్తియనియుఁ
దక్కిన గ్రంథద్వయ కర్తను రామరాజభూషణుఁ డనియు వేఱు
వేఱు వ్యక్తులుగా నిట వ్యవహరించుచున్నాఁడను. ఈయిరు
వురి గృహనామములును ప్రబంధాంకమే. ఇరువురకును సింగరాజే
ప్రపితామహుఁడు. ఇరువురకును బితామహుఁడు తిమ్మరాజే- తండ్రులు
మాత్రము భిన్నులుగాఁ గన్పట్టుచున్నారు. మూర్తికవితండ్రి వెంకట
రాయభూషణుఁడు. రామరాజభూషణునితండ్రి సూరపరాజు. ఈ
వెంకటరాయభూషణుఁడును సూరపరాజునునిజముగాభిన్నులైనయెడల
వీరిరువురకును తిమ్మరాజేతండ్రి కావున వీరిరువురును సోదరులయి
యుండవలయును. వీరు సోదరులైనయెడల మూర్తి, రామరాజభూష
ణకవు లిరువురును అన్నదమ్ముల బిడ్డలగుదురు. మూర్తి, రామరాజ
భూషణులొకరే యని యొకవాదము. సూరపరాజు, వెంకటరాయ
భూషణులొక్కరె యని మఱియొకవాదము. ఒక్కవ్యక్తికి రెండు
పేరులుండుట, అసంగతమనిగాని, అసంభవమనిగాని యొక్కమాటలో
నీవాదములను ద్రోసిపుచ్చుటకు వీలులేదు. ఒకవ్యక్తి రెండుపేరులతో
వ్యవహరింపఁబడుచుండుట, లోకములోఁ బలుతావుల జూచుచు
న్నాము. అట్లే ఒక గ్రంథకర్త తనగ్రంథములలో నొకదానిలో నొక
పేరును వేఱొకగ్రంథములో వేఱొకపేరును వేసికొనియుండినటుకు
దృష్టాంతములున్నవి అందుచే నీవాదములను ద్రోసివేయక యందలి
సత్యాసత్యముల నారయఁ బ్రయత్నింతము.

ఈవాదములను విమర్శించినందువలన గలిగెడు ఫలితములివి:—

సూరపరాజును, వెంకటరాయభూషణుఁడును, వేఱునామము లతో నున్న ఒకవ్యక్తియేయని యేకారణముచేనైన సిద్ధాంతమగు నెడల మూర్తి, రామరాజభూషణకవులు, సోదరులగుదురు. ఒకవేళ మూర్తి రామరాజభూషణు లొక్కవ్యక్తియేయని ఋజువగు నేని సూరపరాజ వెంకటరాయభూషణులు నొక్కరేయగుదురని వేఱ చెప్పనక్కఱలేదు. రెండునామములొక్కవ్యక్తి కుండునప్పు డందొకటి నిజనామమైయుండి రెండవది తలిదండ్రులో, బంధువులో, యుంచిన ముద్దుపేరో; కాక సందర్భమననుసరించి ప్రజలు వాడుచువచ్చినపేరో; కాక పండితులు గాని ప్రభువులుగాని సంఘముగాని యిచ్చిన బిరుదునామమో కాక యావ్యక్తి యొక్క ప్రజ్ఞావిశేషమునుబట్టి వచ్చిననామమో; యయి యుండుననుట లోకానుభవ సిద్ధము. నిజనామమనగాఁ దలిదండ్రులుంచిన పేరు. తలిదండ్రులుతమకొమరునకు పసితనమున మొట్టమొదట వెంకట రాయభూషణుఁడని పేరుపెట్టిరని తలంచుట యంత సమంజసముగా నుండదు. సూరపరాజ, వెంకటరాయభూషణనామములొకవ్యక్తివేయని చెప్పవలసివచ్చునెడల సూరపరాజు నిజనామమనియు. వెంకటరాయ భూషణుఁడనునది బిరుదనామమనియు, నట్లే మూర్తి రామరాజభూష ణులలో "మూర్తి" నిజనామమనియు. రామరాజభూషణుఁడనునది బిరుదునామమనియు భావింపవలసియుండును. రామరాజభూషణశబ్దము బిరుదనామమనియు నాతని నిజనామము మూర్తియనియు, ధృవపడు నెడల నీవివాదమంతయు నంతరించి, పైని చెప్పిన గ్రంథత్రయమునకుఁ గర్త యొక్కఁడే యగును. రామరాజభూషణుఁడని తలిదండ్రులుంచిన నామమే యైనయెడల, శ్రీరామచంద్రుని నామముతో శివుని నామ మును జేర్చి రామరాజభూషణుఁడని వారుపేరుంచిరని చెప్పవచ్చును. కాని యట్టిపేరును తలిదండ్రులుంచిరనుట సామాన్య విషయము కాదు. ఆయర్థమును సూచించునట్లింతేకంబై సులభముగ నుండునట్టి పేరుంచి యుందురని తలంచుట భావ్యము. అది బిరుదనామమని భావించు నెడల

రామరాజసభ కలంకారప్రాయుఁడని యూహింపనగును. రామ రాజభూషణనామము బిరుదనామమని తలంచు నెడలఁ వసుచరిత్రను రచించినవాఁడు, నరసభూపాలీయకర్తయగు మూర్తియైనఁ గావచ్చును. లేదా పేరుతెలియని మరియొక కవియైన కావచ్చును. గవి కృష్ణదేవరాయల యల్లుఁడైన యళియరామరాజు సంస్థానములోనుండి యాతనిచేత సత్కారములనుబొందినట్లు పైపద్యములలోఁ జెప్పఁబడియున్నది. కావునను వసుచరిత్రమును అళియరామరాజు తమ్ముఁడైనతిరుమలరాయలకు గృతియిచ్చినను, ఈకవి యళియరామ రాజు నాస్థానమునందుండి యనేకకృతులను రచించినట్లు చెప్పఁబడి యుండుటచేతను, రామరాజు సభకు భూషణప్రాయుఁడుగా నున్నవాఁ డనియు నందుచే నీతనికి రామరాజభూషణుఁడను బిరుదు నామము గలిగెననియు, నది బిరుదునామమే గాని నిజనామము గాదనియు, దలంపనగును. ఇతని తండ్రికిఁగూడ వెంకటరాయభూషణుఁ డనునది బిరుదనామమే గాని నిజనామము కాదనియు, నాతని నిజనామము సూరపరాజనియు నొకపక్షమువారిచేఁ దలంపఁబడుచున్నది. ఈ వెంకట రాయ లెవ్వరని యడుగుదురేమో! వెంకటరాయనామధారు లగు ప్రభువులాకాలమున నలుగురైదుగురున్నారు. అం దెవ్వరైన నొకరు గావచ్చును. ఎవ్వరోయేల? నరసభూపాలీయ కృతికర్తలగు పోచిరాజు వారి వంశములోనే యొక వెంకటరాయలు కలఁడు ఆతనిని కవి యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

చ. అతనిసహోదరుండు చతురంబుధివేష్టిత భూధురంధరుం
డతులితశౌర్యభీకరభుజాగ్రుఁడు వేంకటరాజు వొల్చు నా
క్షితిపతి దానవాసనల ఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయదుర్యశము విస్ఫుటమౌ నలి మండలాకృతిన్.

సూరపరాజపోషకుఁ డీ వెంకటరాయలైనఁ గావచ్చును. మరి యొక వెంకటరాయలైనఁ గావచ్చును. ఆ కాలమున రాజులయాస్థానముల నుండుకవు లారాజునకు భూషణులని బిరుదునామములుగా వేసి

కొనుట యాచారము. చంద్రాంగద చరిత్రమును రచించిన పైడిమఱ్ఱి వెంకటపతి పూర్వులలో నొకనికి కృష్ణరాయభూషణుఁడను బిరుద మున్న ట్లీక్రిందిపద్యములో నున్నది.

సీ. సకలసత్కవిపూజ్యసుకవిత్వ సామ్రాజ్య
నిర్వాహకుఁడు పెద్దపర్వతన్న
వివిధభాషావార్యవిరచనాచాతుర్య
సర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యగద్యాకార వాచాచమత్కార
నిరుపమమతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్భకవితాచ్ఛసందర్భ
కీర్తితప్రజ్ఞుండు కేశవన్న
దనకు నన్నలుగాఁ దనరుకృష్ణ
రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజపర్వతాధీశు వేంక
టాద్రి నిదె కావ్యమేనిత్తు నంకితముగ.

ఈపద్యమందలి కృష్ణరాయభూషణశబ్దము బిరుదనామమైనట్లు కవిచరిత్రకారు లీక్రిందివాక్యములలో నుడివియున్నారు. "పయిపద్యములోనున్న కృష్ణరాయభూషణశబ్ద మాకవికి కృష్ణదేవరాయని యాస్థానమున కలంకారముగ నుండుటచేతనే వచ్చినను" దీనినిబట్టి "రాయభూషణ" శబ్దములు బిరుదనామములుగా నాకాలమునఁ బెట్టుకొనుచుండుట కలదనియు, రామరాజభూషణ" శబ్దమట్టి బిరుదనామమే యనియు నిశ్చయింపవచ్చును. ఆకాలమునాటికవులు తాము రచించినగ్రంథములలో తమవృత్తాంతమును దెలుపుపద్యములయందును గద్యములలోను తమనిజనామమును దెలుపకయే, బిరుదనామమునుమాత్రమే తెలుపు నాచారముకూడ కలదు. చింతలపూడి యెల్లయకవి రాధామాధవమును రచించినందులకై శ్రీకృష్ణదేవరాయలచే రాధామాధవనామ బిరుదమును బొందిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాతృప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవనామ మందినజగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్.

రాధామాధవమునకుఁ బిమ్మట రచించిన తారకబ్రహ్మరాజ మను గ్రంథములో నీయెల్లయకవి తననిజనామమును దెలుపుట మానివేసి, "రాధా మాధవుఁడు సుకవిరత్నము చెప్పెన్". "రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్". ఇది శ్రీమదనగోపాలచరణకమలసేవా ధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారకపౌత్త్రి చింతలపూడి కామయ ప్రభుసుపుత్త్రి శుద్ధసారస్వతవిభవ రాధామాధవప్రణీతం బైన" అని ప్రత్యేకముగ బిరుదనామమునే వేసికొనియున్నాఁడు. అట్లే .రామరాజ భూషణకవియు, తానాబిరుదమునందకపూర్వమునరసభూపాలీయమునఁ దననిజనామ మగు "మూర్తి" శబ్దమును గద్యలో వేసికొనియుండె ననియుఁ రామరాజశ్రీయము లభించినపిమ్మట రామరాజభూషణుఁడై ఆబిరుదనామమునుమాత్రమే వసుచరిత్రాదులయందు వేసికొని నిజ నామమును మానివేసెననియు దలంచుటలో విరుద్ధ మేమియును లేదు.

దీనినిబట్టి నరసభూపాలీయము ప్రథమముననను, తరువాత వసు చరిత్రమును బిమ్మట హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించియుండె ననిస్పష్ట మగుచున్నది. ఈవిషయము సత్యమయినప్పుడే, మొట్టమొదట "మూర్తి"నామధారియై పిమ్మట రామరాజభూషణబిరుదనామగృహీత యైనవాఁడొక్కవ్యక్తియేయని నిర్ధారణ మగును. అట్లుగాక నరసభూ పాలీయము వసుచరిత్రకంటెఁ బిమ్మట వ్రాసెనని ఋజువైనచో పై గ్రంథత్రయైకకర్తృత్వసిద్ధాంతము నిలువఁజాలదు. ఈమూఁడుగ్రంథము లకుఁ గర్త యొక్కఁడేయని వాదించువారుకూడ, తమవాదమునకు బల మైనకారణ మని చెప్పుచు, హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి 'వసు చరిత్రాదికావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నస్తవుండ' అనుసీసపద్య పాదము నుదాహరించి, యిందలి ఆదిశబ్దముచేత నరసభూపాలీ

యము బహుశబ్దముచేతఁ దత్కృతిపతియగు నరసరాజును సూచింపఁబడుచుండె ననియు, మొట్టమొదట వసుచరిత్రపేర్కొనఁబడుటచేఁ దానికిఁ దరువాత నరసభూపాలీయము రచింపఁబడెననియుఁ గావున నీగ్రంథత్రయమునకుఁ గర్త యొక్కఁడే యనియు నొకయుక్తి చెప్పఁ జున్నట్లు కవిచరిత్రమున నుదాహరింపబడియున్నది. ఫలితము సత్యమే యయినను, నిందులకుఁ జూపినహేతువునకు స్వవచన వ్యాఘాత దోషముపట్టుచున్నది. వసుచరిత్రములో "రామరాజభూషణుఁడ" నని బిరుదనామమును వేసికొని దానితరువాత రచించిన నరసభూపాలీయమున, నిజనామ మగు 'మూర్తి'యనివ్రాసి, పిదప మరల హరిశ్చంద్ర నలోపాఖ్యానములో 'రామరాజభూషణుఁడ'నని వేసికొనునా? అట్లెవ్వఁడును చేయఁడు. ఈయాక్షేపణముతో గ్రంథత్రయైకకర్తృత్వ సిద్ధాంతము మరల సంశయాస్పద మగును. కావున పైనిజెప్పినయుక్తి, దోషసంయుక్తమై సిద్ధాంతమునకు సహాయకారి కానేరదు. నరసభూపాలీయము వసుచరిత్రమునకుఁ బిదప రచింపఁబడినదను మాటయును సత్యము కాదు.

వసుచరిత్ర కృతిప్రదానమగునప్పటికి, కృతిపతియైన తిరుమల రాయఁడు కర్ణాటరాజ్యసింహాసనమునందు పట్టాభిషిక్తుఁడై, ఆతని యన్నయైన యళియరామరాజు చనిపోవుటచేఁ జీర్ణమైపోయిన కర్ణాట రాజ్యలక్ష్మిని పునరుద్ధరించినట్లు వసుచరిత్రమునందలి యీక్రిందిపద్యమువలనఁ గన్పట్టుచున్నది.

సీ. వసుమతీభారదుర్వహత నెవ్వనియుర్వ
రావరాహాంక మర్థము వహించు
గరగతచక్రవిక్రమశక్తి నెవ్వాని
రామానుజత్వంబు రమణ కెక్కె
జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
వ్వానిలోకేశ్వరత్వము పొసంగుఁ

జటులశౌర్యోరమగ్నసర్వవర్ణోద్ధార
పటిమ నెవ్వనిరాజభావ మెసఁగు

తే. నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ్వరాష్ట దిగ్గాజకులము
నోభయంకరబిరుదసన్నుత జయాభి
రామగుణహారి తిరుమలరాయశౌరి.

సీ. ఘనసింధురక్తలోచనయుక్తిఁ గడనఁడు
మాతంగతతి నంటు మలినమెల్ల
గరము ప్రైవెస నధోగతిఁ బడ్డయమ్మహా
హీనుని నెనసినయేవమెల్ల
నరకహేతుహిరణ్యహరణవృత్తిఁ జలించు
కొమ్మకాని భజించు కొదవలెల్ల
రౌరవాధార ఘోరప్రవాతకులైన
విషమగోత్రులనంటు వృజినమెల్లఁ

తే. గడిగికొనియె వసుంధరాకమలనయన
యారా! వీరప్రతాపరాజాధిరాజ
రాజదేవేంద్రతిరుమలరాయచంద్ర
సాంద్రపట్టాభిషేకాంబుసముదయమున.

చ. తిరుమలరాయశేఖరుని ధీరచమూభటరాజి యాజి భీ
కరయవనేశ్వరప్రహితఖానబలంబులఁ జక్కసేయ ని
ద్దరఁ బెనుగొండకొండలు మదద్విపచర్మకపాలమాలికా
పరికరభూషితంబు లయిబల్విడిఁ గాంచె గిరీశభావమున్.

ఈ పైపద్యములనుబట్టి తిరుమలరాయలు కర్ణాటరాజ్యమునకు పట్టాభిషిక్తుఁడైనవిషయమును, తిరుమలరాయలకు మహమ్మదీయులతోఁ బెనుగొండ యుద్ధము జరిగినవిషయము; వసుచరిత్రమును గవి తిరుమల రాయలకుఁ గృతియొసంగెననిస్పష్టమగుచున్నది. శాలివాహనశకము ౧౫౬౫ సంవత్సరములో జరిగిన తళ్లికోట యుద్ధములో అళియరామరాయలు

మృతి చెందినపిమ్మట కర్ణాటరాజ్యము జీర్ణమైపోవుటయు, అనంతరమునఁ దిరుమలరాయలు జీర్ణమయిపోయిన కర్ణాటరాజ్యలక్ష్మిని పునరుజ్జీవింపఁజేసి పట్టాభిషిక్తుఁడగుటయు జరిగినది. పెనుగొండవద్ద తురకలతో జరిగినయుద్ధములోఁ దిరుమలరాయలు జయించుటను గూడ కవివర్ణించియున్నాఁడు. ఈవిషయములనుబట్టి వసుచరిత్ర రచనాకాలమును నిర్ధారణము చేయవలసియున్నది.

వసుచరిత్ర యందలి కృత్యాది పద్యములనుబట్టి విమర్శింపఁగా వసుచరిత్రకృతిప్రదానకాలము క్రీ. శ. 1580 ప్రాంతమని తేలినది.

నరసభూపాలీయము అళియరామరాజునకును దిరుమలరాయలకును మేనల్లుఁడైన పోచరాజు నరసరాజునకంకిత మీయఁబడినది. ఆగ్రంథమున, కృతిపతి మేనమామలగు రామరాజును, ఈతిమ్మరాజును గూడ కవివర్ణించియున్నాఁడు. ఆపద్యముల నీక్రిందవ్రాయుచున్నాఁడను.

సీ. ఖలునతిద్రోహిసల్కాయతిమ్మనిహరించి
సకలకర్ణాటదేశంబునిలిపె
నతునివర్ధితునిఁదత్సుతునిఁబట్టముఁగట్టి
కుతుపనమల్కానక్షోణినిలిపెఁ
బదిలుఁడైరాచూరుముదిగల్లుగప్పంబు
సేయఁగాంచిసపాదుసీమనిలిపె
శరణన్నమల్కానిజామునకభయంబొ
సంగితదీయరాజ్యంబునిలిపె

తే. నవనియంతయు రామరాజ్యంబుసేసెఁ
దనగుణంబులు కవికల్పితములుగాఁగ
నలవియొరచింపసత్కావ్యములను వెలయ
భూమినొకరాజమాత్రుఁడే రామవిభుఁడు

సీ. తనభుజాదండకోదండమఖండమై
యనువేలశరవృష్టినాచరింప

దనహేతిశతకోటిఘనధాళధళ్యమై
ప్రతిపక్షబలభిదాపటిమ నెఱపఁ
దననిగ్రహంబుసజ్జనమనోహారియై
మంజుఘోషాశ్లేషమహిమఁజెలఁగ
దనవైభవంబుసంతానసమగ్రమై
సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద

తే. రాజదేవేంద్రుఁడితఁడనఁ దేజరిల్లు
ననఘచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నెవిభాళాది బిరుదశాలి
ప్రాభవోపేంద్రుఁ డెఱతిమ్మపార్థివుండు.

ఈయెఱతిమ్మపార్థివుఁడే వసుచరిత్ర కృతిపతియయిన తిరుమల రాయలు. కర్ణాటరాజ్య పట్టాభిషేకానంతరమున నీయెఱతిమ్మరాజు, వీరప్రతాపరాజాధిరాజ పరమేశ్వర తిరుమలరాయలయినాఁడు. నరస భూపాలీయ కృతి రచనమునాటికి తిరుమలరాయలు కర్ణాటరాజ్య లక్ష్మి నందలేదనియు, రామరాజును వర్ణించిన పద్యమునుబట్టి కర్ణాట రాజ్యము నశించిపోలేదనియు, రామరాజు పరిపాలనక్రిందనే యున్న దనియు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి నరసభూపాలీయము, వసుచరి త్రమునకంటె నించుమించుగా నిరువదియేండ్లు పెద్దదని నిస్సంశయ ముగాఁ జెప్పవచ్చును.

ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి వసుచరిత్రకర్త, రామరాజ భూషణబిరుదనామముగల యొకవ్యక్తియయి యుండవచ్చునని తేలి నది కాని యాతని నిజనామము మూర్తి యనితేలినగాని గ్రంథత్ర యైకకర్తృత్వము స్థిరపడదు. వసుచరిత్రమును రచించినకవి భట్టుమూర్తి యని లోకములో చిరకాలానుగతమైన ప్రతీతియున్నది. దానికితోడు వసుచరిత్రమునకు వ్యాఖ్యానమునువ్రాసిన బహుగ్రంథరచనాదక్షుండగు సోమనాథకవి యీక్రింది పద్యములలో వసుచరిత్ర "మూర్తి" కవివిర చితమని వ్రాసియున్నాఁడు.

శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశానవాక్శ్రీస్థలో
　　దారోద్దేశుఁడనైన నాకు వెసవిద్యావంతులెల్లన్ స్వనో
　　హారప్రక్రియ మూర్తిచేత రచితంబై విశ్రుతంబౌ వసు
　　ధారాట్చిత్రచరిత్ర టీకకయి యుత్సాహంబు పుట్టించినన్.

ఉ. కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
　　భూరికళాకలాపుఁడయి పొల్పువహించెడు భట్టుమూర్తి చే
　　నీరితమై సుఖార్థవదహీనపదాప్తమైన యా వసు
　　ధారమణప్రవృత్తము సుసాధ్యము కాదు తలంచి చూడఁగన్.

"ఇంచుమించుగా రామరాజభూషణుని కాలములోనే రచియింపఁబడిన లక్షణదీపికలో ౪౧౬ వ పద్యము తరువాత "మంజీరశబ్దమునకు భట్టుమూర్తి వసుచరిత్ర మొదటిపద్యము ప్రథమచరణమున హల్లునకుఁ బ్రయోగము" అని వ్రాయఁబడి

శా. "శ్రీభూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్థలీ"

ఇత్యాది వసుచరిత్రపద్య ముదాహరింపఁబడియున్నది. సరి కాలము వారుకూడ సుప్రసిద్ధుఁడైన రామరాజభూషణుని భ్రమించుట పొసఁగ నేరదు. గాన నిరువురు నొక్కరే యనుట యధిక విశ్వాసనీయము"

రామరాజభూషణుని కాలములోనే యుండి యాకాలములోనే మనుమలనెత్తిన వెంకటపతిరాయల విద్యాగురువగు మండ రామానుజాచార్యుని ముమ్మనుమని మనుమఁడగు లక్ష్మీనరసింహాచార్యులు తాను రచించిన యాంధ్రకౌముదియందు,

"మప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే-

మప్రత్యయాభావమున కల్లసాని పెద్దనార్యశిష్యుఁడైన భట్టుమూర్తి మహాకవిచేత రచితమైన వసుచరిత్రమునం దనివ్రాసి-

సీ. రాజహంసలుగాని రాజహంసలుగారు
　　　　సరసకళాసారసారరుచుల"

అను వసుచరిత్రములోని యీసీసపాదమును లక్ష్యముగాఁ జూపి యున్నాఁడు. బట్టుమూర్తికి నూఱుసంవత్సరములలోపలనే యిట్లు గ్రంథస్థముచేసిన వ్రాఁతను నిరాకరించుటకు ప్రబలప్రమాణము కావలసి యుండునుకదా!"

ఆంధ్రకవుల చరిత్రము.

ఈవ్రాఁతలనుబట్టి చూచినచో వసుచరిత్రకృతికర్త యొక్క నిజనామము 'మూర్తి' లేక 'బట్టుమూర్తి' అయియున్నట్లు తేలుచున్నది. ఇది యసత్యమనుట కాధారములు గన్పట్టుటలేదు. ఇది యసత్యమని చెప్పువారు, రామరాజభూషణశబ్దము బిరుదనామముకాక నిజనామమని యైన చెప్పవలయును. లేదా, రామరాజభూషణనామము బిరుదనామమని యెంచినను, వసుచరిత్రకర్త మూర్తి కాఁడనియు, నిజనామమును మఱుగుపరచిన మఱియొకవ్యక్తియై యున్నాఁడని యైన చెప్పవలయును. ఈకడపటివాద మిదివఱకు లేదు. వసుచరిత్రకర్తయు నరసభూపాలీయకర్తయు నొక్కఁడు కాఁడనియు, నరసభూపాలీయకర్త మూర్తియనియు, వసుచరిత్రకర్త రామరాజభూషణుఁడనియు 'మాత్ర'మే చెప్పుచున్నారు కాని, వసుచరిత్రకర్త రామరాజభూషణ బిరుదనామధారి యగు వేఱొకవ్యక్తి యని యెవరును వాదించుటలేదు. కావున రామరాజభూషణనామము బిరుదనామమని మనము నమ్మినచో నేని, వసుచరిత్రకర్తృత్వము ఎవరును చెప్పని యనామధేయవ్యక్తియం దుంచుటకంటె, చిరకాలానుగతముగా బుధులచేతను వ్యాఖ్యాన కర్తచేతను సమకాలికులచేతను, పేర్కొనఁబడుచున్న మూర్తియందే యుంచి యీగ్రంథములు మూఁడిటికిని గర్త యొక్కఁడే యనియు అతఁడు రామరాజభూషణ బిరుదనామమును వహించిన మూర్తి యనియు, అతఁడే శారదామూర్తి యనియు, అతఁడే శుభమూర్తి యనియు, అతఁడే భట్టుమూర్తి యనియు, నిర్ధారణమొనర్చుట న్యాయమును సత్యమునై యున్నది. ఆంధ్రకవి చరిత్రకారులును, వసుచరిత్రాది గ్రంథపీఠికాకారులు నట్లే భావించియున్నారు. నేనును వారిభావముతో భవించుచున్నాఁడను.

ఈకవికి తండ్రు లని చెప్పఁబడిన సూరపరాజు వెంకటరాయ భూషణులలో నొకఁడు జనకతండ్రి యనియు, నొకఁడు పాలకపిత యనియు నొకవాద మున్నది. ఈవాదమును కవిచరిత్రకారు లిట్లు వ్రాసియున్నారు.

"ఈకవి తన జనకపితను పాలకపితనుగూడ సంతోషపెట్టుట యయి యొకపుస్తకమునందు కన్నతండ్రిపేరు వేసెననియు ఒకపుస్తకమునందు పెంచుకొన్న తండ్రిపేరు వేసెననియు, ఒకపుస్తకమునఁ దెవ్వరి పేరును వేయక విడిచెననియుఁ జెప్పుచు ఆయాపుస్తకములయం దుపయోగింపఁబడిన పదములే యొకఁడు జనకపితయనియు, నొకఁడుపాలక పితయనియు సూచించుచున్నవని చెప్పుచున్నారు. హరిశ్చంద్ర నలోపాఖ్యానములోని "సూరపాత్మజుఁడ"నను వాక్యమువలన సూరపరాజున కౌరసుఁడని యాత్మజశబ్దము దృఢపరుచుచున్నదనియు, నరసభూపాలీయములోని "వేంకటరాయభూషణసుపుత్రు"నను వచనమువలన వెంకటరాయభూషణునకు దత్తుఁడని సుపుత్రశబ్దము దృఢపఱుచుచున్నదనియు వాదించుచున్నారు. ఈయర్థములయం దాత్మజశబ్దమునకుఁ దనవలనఁబుట్టినవాఁడు కాని దత్తుఁడు కాఁడనియు, సుపుత్రశబ్దమునకు పున్నామ నరకమునుండి రక్షించు దత్తుఁడు కాని కన్నవాఁడు కాఁడనియు గ్రహింపవలెను ఈయంశములకనుకూలముగానుండు కథలు కొన్నికలవుగాని గ్రంథవిస్తారభీతిచే వానిని విడచుచున్నాను.

నరసభూపాలీయకర్తయు, వసుచరిత్రకర్తయు నొక్కఁడేమో యనినాకు సందేహముకలిగించుటకుఁ గారణము లయినమఱికొన్నిటిఁ గూడ నిప్పుడిందుఁ జేర్చుచున్నాను. వీనిని పయిని చెప్పినవానితోఁ జేర్చిచదివి బుద్ధిమంతులుతమయిచ్చవచ్చినసిద్ధాంతము చేసికొనవచ్చును.

గీ. తారచించిన వసుచరిత్రమునఁ గన్న
తండ్రి సూరన వెలయించి తలపఁడయ్యె
నన్నుమనశారదామూర్తి నాఫలంబె
దత్తుఁడగువానిఁ జేపట్టఁ దరమె నాకు.

అను చాటుధారాపద్య మొకటి రామరాజభూషణుఁడు తన వసుచరిత్రములో జనకపితయైన సూరపరాజు పే రుదాహరించి తన్నుఁ బేర్కొనకపోవుటచేత పాలకపిత యైన వేంకటరాయభూషణునిచేఁ జెప్పఁబడినదని వాడుకలోనున్నది.

ఈదత్తపుత్త్రిగాథను జెప్పువారు గ్రంథత్రయికి కర్తృత్వము నంగీకరించుచున్నారు. మూర్తియును రామరాజభూషణుఁడు నొక్కరేయని వారియభిప్రాయము. ఇఁక తండ్రులవిషయములోమాత్రమే వారు భిన్నాభిప్రాయులుగా నున్నారు. వారిదత్తపుత్త్రివివాదమునకు "ఆత్మజ" "సుపుత్రి" శబ్దార్థములే యాధారములైనట్లు పైవ్రాఁతవలన స్పష్టమగుచున్నది. అంతకంటె వేఱుగ నెట్టియాధారమును జూపఁబడుటయును లేదు. ఇది కేవలము భ్రమ— పుత్త్రిశబ్దవాచ్యుఁడు దత్తుఁడే గాని యౌరసుఁడు కాఁడను నర్థము లేదు. దీనికై శాస్త్రములను బరికింపనక్కఱలేదు. వారాధారముగా గైకొనిన యాపద్యములయందే వారనుకొనిన యర్థమునకు భిన్నములయిన యర్థములయం దాకవియే యాశబ్దములను బ్రయోగించియున్నాఁడు. నరసభూపాలీయములోఁ గవితండ్రి యైన వెంకటరాయభూషణుని "తిమ్మరాజపుత్త్రి" అనియు హరిశ్చంద్రనలోపాఖ్యానములో సూరపరాజును "తిమ్మరాజప్రియతనూజ" అనియు వ్రాసియున్నాఁడు. పుత్త్రిశబ్దమును దత్తుఁడను ప్రత్యేకార్థముతోఁ గవియుపయోగించినాఁడని తలంచునెడల తిమ్మరాజునకు వెంకటరాయభూషణుఁడు దత్తుఁడనియు, సూరపరాజు ఔరసుఁడనియు, జెప్పవలసివచ్చును. ఇదియసంభవము. కావున నీశబ్దార్థములపై నాధారపడిన దత్తపుత్రిగాథ విశ్వాసార్హమైనది కాదు.

వసుచరిత్రమునఁ గవి తాతతండ్రుల నామములనుగాని గృహనామమునుగాని చెప్పియుండలేదు. అందుచే వసుచరిత్రమునఁ గన్నతండ్రియైన సూరనపేరుచెప్పి తనపేరు చెప్పలేదని వెంకటరాయభూషణుఁడు విచారించినట్లు చెప్పెడి పైచాటుధారయందలికథయు విశ్వాసార్హము కాదు.

వాస్తవముగా, మూర్తియు రామరాజభూషణుఁడను వేఱయి, యున్నచో, సోదరులో, సోదరపుత్త్రులో నైనవారిరువురును తమతమ గ్రంథములలో తిమ్మకవిజగ్గకవులవలెనొకరినొకరుస్మరించియుండకపోరు.

గ్రంథత్రయైక కర్తృత్వము నంగీకరించిన, వీరేశలింగము పంతులుగారును, ఈగ్రంథత్రయ పీఠికాకారులును, ఇతరులు పలువు కొండఱును తమసిద్ధాంతమునకు జూపిన హేతువులలోఁ గొన్నిఁటిని వారివి వీరును, వీరివివారును, ప్రబలప్రమాణములు కావనియో సయు క్తికములు కావనియో గ్రహింపక విడచిపైచుచు వచ్చిరి. అట్టివాని నిటచూపుట, అనవసరమనియు, గ్రంథవిస్తర మగుననియు, దలంచి వదలివేసి అవసరమని నాకుఁ దోచినంతవఱకుమాత్రమే వారియభిప్రా యములను గ్రహించితిని. ఇఁక నీవివాదవిషయమునువదలి యాతఁడు రచించిన గ్రంథత్రయమునుగూర్చి వ్రాయుచున్నాఁడను.

నరసభూపాలీయము అలంకారశాస్త్రము; సంస్కృతమునవిద్యా నాథకృతమగు ప్రతాపరుద్రీయమువలెనే, ఆంధ్రమున నీనరసభూపాలీ యమును-మూర్తికవి రచించియుండెను. ప్రతాపరుద్రీయమున లక్ష్య భాగమునందు ప్రతాపరుద్రునికీర్తి ప్రతాపాదులు వర్ణింపఁబడినట్లే, నరస భూపాలీయమున నరసింహరాజుయొక్కకీర్తి ప్రతాపాదులు లక్ష్య ముగా నీయఁబడినవి. ఈనరసరాజు సూర్యవంశపు క్షత్రియుఁడు; ఓబళ రాజునకును లక్కాంబికకును పుత్త్రుఁడు. కావేరినదికిఁ గట్టకట్టించి, నదికిరుపార్శ్వములను వృక్షములను నాటించిన కరికాలచోడుఁ డీతని వంశమునకు మూలపురుషుఁడైనట్లీగ్రంథమునఁ జెప్పఁబడినది ఆవంశ మున పోచిరాజనునతఁడు జన్మించి వంశకర్తయయ్యె నని యీక్రింది పద్యములలోఁ గవిచెప్పియున్నాఁడు.

తే. శ్రీలఁ జెలువొందు నాకరికాలచోళ
కుంభినీనాథుకులమున సంభవించె
ఘనఖనిక్షోణి రత్నంబు గలుగురీతి
భోగసౌభాగ్యసురరాజు పోచిరాజు.

క. ఆపోచిరాజవంశ సు
ధాపారావారమునకుఁ దారాపతియై
యేపారెడుఁ దిరుమలక్షో
ణీపాలుఁ డనంతకీర్తి నిత్యోజ్జ్వలుఁడై.

కృతిపతియైన నరసభూపాలుఁ డీపోచిరాజు వంశములోనివాఁడు. ఈవంశమందలి వెంకటపతియను నాతఁడు చంద్రగుత్తిదుర్గ పరిపాలకుఁ డయిన ట్లీక్రింది సీసగీతివలనఁ దెలియుచున్నది.

సీ. తే. జగతి నేరాజు కువలయోత్సవ మొనర్చు
రాజు గావున నటుప్రీయముఁ గోర్కి చేతఁ
గోరి యన్వర్థ మగుచంద్రగుత్తిదుర్గ
మతఁడు విలసిల్లు వేంకటక్షితివరుండు.

కృతిపతి యైన నరసభూపాలుఁడు, ఆరవీటి బుక్కభూపాలునకు మనుమని కుమార్తెయైన లక్కమాంబ కొడుకు. శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడైన అళియరామరాయలు, వసుచరిత్ర కృతిపతియైన తిరుమలరాయలు మొదలుగా నయిదుగురు సోదరులకును నరసభూపాలుఁడు మేనల్లుఁడు. ఈవిషయము లీక్రింది పద్యములలోఁ జెప్పబడినవి. కృతిపతితండ్రియైన యోబరాజు

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవదేవ
ధరణీశుఁ డేరాజుతాతతాత
నరనుతుఁ డైనపిన్నమరాజు సౌజన్య
ధన్యుఁ డేరాజున్యతాతతండ్రి
యమితవైభవుఁ డైనయార్వీటి బుక్కభూ
తలనాథుఁ డేరాజు తండ్రితండ్రి
యసమానవిద్యాధురంధరుఁ డగు
రామరాజేంద్రుఁ డేరాజుతండ్రి.

తే. యట్టిసోమాన్వయాబ్ధి శీతాంశుఁ డనఁగ
నమరు శ్రీరంగవిభుపుత్త్రియై చెలంగు

లక్కమాంబను వరియించె లలితశీల
నమ్మహాసాధ్వి సోదరులధికయశులు.

క. కోనక్షితిపతి, తిమ్మమ
హీనాథుఁడు, రామనృపతి యొఱతిమ్మధరా
జానియును వేంకటేంద్రుఁడు
భూనాయకతిలకు లగుచుఁ బొల్తురు ఘనులై

క. ఈరాజమణులసోదరి
యై రాజిలు లక్కమాంబ యమృతాశనధా
త్రీరుహములకై దింటికి
నారయఁ దోఁబుట్టు వగురమాంగన పగిదిన్.

క. పౌలోమికి నిందుసుమ
హాలలితాకృతి జయంతుఁ డాత్మజుఁడైన
ట్లాలక్కమాంబ కోబన్న
పాలునకు నృసింహధరణిపతి జనియించెన్.

ఈనృసింహధరణిపతియే నరసభూపాలీయ కృతిభర్త. ఇతఁడు ోరగంటి దుర్గరాజ్యపాలకుఁడైనట్లు షష్ఠ్యంతములలోని యీక్రింది ద్యములవలనఁ దెలియుచున్నది.

క. తోరగంటిదుర్గరాజ్య
స్థిరసింహాసననివాసదీక్షానిధికిన్
వరమంత్రమత్స్యభేదన
బిరుదోద్దండునకు గండభేరుండునకున్.

కృతిపతియైన నరసభూపాలుఁడు కవినిగూర్చిపలికినట్లు రచించిన యీక్రిందిపద్యములవలనఁ గవి సామర్థ్యము తెలియుచున్నది.

సీ. బాణవేగంబును భవభూతిసుకుమార
తయు మాఘుశైత్యంబు దండిసమత
యలమయూరు సువర్ణకలన చోరునియర్థ
సంగ్రహమ్ము మురారి శయ్యనేర్పు

సోమప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధధారాశుద్ధి యమరే
శ్వరుని సహస్రముఖదృష్టి

తే. నీక కల దటుగాన ననేకవదన
సదనసంచారఖేదంబు సడలుపఱిచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర! విఖ్యాతకీర్తిసాంద్ర!

ఈకవి తనగురు వెవ్వరో చెప్పియుండ లేదు. అల్లసాని పెద్దనామాత్యుఁ డీతనిగురువని ఆంధ్రకౌముదియందున్నట్లు పైని తెలుపఁబడినది. కాని యీకవి యేవిషయమును దనగ్రంథములయం దెచ్చటను జెప్పకపోవుటచే నందెంతవఱకు సత్యమున్నదియు నిశ్చయింపఁజాలకున్నాఁడను.

కావ్యముయొక్క ఘనతను, కావ్యప్రయోజనమును, గావ్యలక్షణమును గవి యీక్రింది పద్యములలో మనోహరముగా వర్ణించి యున్నాఁడు.

శా. వేదంబుల్ నృపశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబు ల్పురా
ణాది గ్రంథము లంగనాజనవిలాసాలాపలీలాసము
త్పాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియ లెన్నఁ గావ్యమహిమ ల్వర్ణింపఁగా శక్యమే.

మ. పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాత విఖ్యాత సా
గరచంద్రోదయ మిష్టసంఘటన రేఖాదివ్య ధేనూత్తమం
బురు కార్పణ్యదశానిశాదినముఖం బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం బలినఁ గావ్యంబెన్న సామాన్యమే.

కావ్యాలంకారసంగ్రహము.

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథ
ల్హావిరి పుట్టురత్నము లవారిత సత్కవికల్పనావిభూ

పావహ పూర్వవృత్తములు పొలుపొందిరిన జాతిరత్నముల్
గావున నట్టిమిశ్రకథగా నొనరింపుము నేస్తు వెంపురన్.

వసుచరిత్రము.

శైలి చూపుటకై నరసభూపాలీయమునుండి కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాడను.

దక్షిణనాయకుఁడు:—

ఉ. సాగరమేఖలాసతికిఁ జారుభుజాపరిరంభ మిచ్చి వా
ణీగగనావలగ్నకును నేర్పుమెయి న్మొగ మిచ్చి వీరల
క్ష్మీగజరాజగామిని కమేయభుజాంతర మిచ్చి సంతత
త్యాగి నృసింహభూవిభుఁ డెదక్షిణనాయకుఁ డెన్నిభంగులన్. ౨౨.

ముగ్ధ:—

శా. ఆలాపంబున కుత్తరం బొసఁగ దాయాసంబునంగాని తా
నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మర్దముం
దాళఁజాలదు కౌఁగి లియ్యదు తనూతాపంబు చల్లాఱఁగా
నేలజ్జావతి తద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే ౨౩.

కంపము:—

చ. చెన్నగు శ్రీనృసింహవిభుఁ జిత్రపటంబున వ్రాసి బింకపుం
జన్నులమీఁదఁ జేర్చుకొని చాల వడంకదొడంగె బాలదాఁ
గన్నులవింటివాఁడు త్రిజగంబు జయించెననంచుఁ గోరిచే
నున్న కృపాణవల్లిక మహోజ్జ్వలత న్జళిపించెనో యనన్. ౩౪.

మూర్ఛ:—

మ. బలితంబైన యనంగ వేదనలచేఁ బల్మారు నిట్టూర్పులే
కలిసీలాలక ప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయం బ్రాకుచు వచ్చి యన్నెలవునం గన్నీటియే అడ్డమై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ! మన్నింపంగఁ బొడింతటన్. ౩౫.

పరుషము:—

క. పరుషార్థంబులు గలయది
పరుషం బనుదోష మయ్యెఁ బరఁగెడు నీభూ

వరుసౌందర్యమునకు వే
మఱు సరియౌ మంటఁబడ్డమదనుఁ డనంగా. ౪౩.

పద్మబంధము:—

చ. కనుఁగొన కేసరెన్మిదియుఁ గర్ణిక చుట్టిడి స్రగ్ధరాంఘ్రుల
న్మనుపటియేడువర్ణములునుం గడయేడుఁ బ్రవేశనిర్గతు
ల్మనుపడ నాల్గు దిగ్దళములన్లిఖియించి విధిజ్ఞఖండబులం
దెనయఁగఁ బాదమధ్యగములేడును వ్రాయఁగఁబద్మబంధమా. ౪౪.

క్రియాహేతూత్ప్రేక్ష:—

చ. మొగము ముడించెఁ గచ్ఛపము మోమ మరవాంచెభుజంగపుంగవుం
డుగము చలింపఁగా వెఱచె నాదివరాహము మోరత్రోపునం
దెగువఁ బయోధిఁ జొచ్చె సుదతీమకరాంక! నృసింహభూప! నీ
జగదభివంద్యభూభరణశక్తి కృతాభిభవంబు చేఁ బలె. ౫౪

సమము:—

చ. అలరుచతి వ్రతీశు దమయంతి నలు న్నలువొంద ముందుగా
నలువసృజించి యందుకతనం దనచేయఖ్యు కెల్లఁదీటి నే
ర్పలవడ నోలతాంగి నరసాధిపు నిన్ననుగూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులఁగా నొనరింపఁగఁబోలు మెచ్చితిన్. ౫౪.

వసుచరిత్రము:—

ఇదియొక యుత్తమప్రబంధము. మార్కండేయ పురాణమం దలి స్వారోచిషమను వృత్తాంతమును గైకొని యల్లసాని పెద్దనా మాత్యుఁడు మనుచరిత్రమును రచించినట్లే, మహాభారతాది పర్వమున నున్న యీక్రిందిపంక్తులలోని కథను గైకొని మూర్తికవి యీమహా కావ్యమును నిర్మించినాఁడు.

"ఉపరిచరుండు లబ్ధసంతానుండయి రాజర్షియయి రాజ్యంబుసే యుచు నిజపురసమీపంబునం బాఱినశుక్తిమతి యనుమహా నదిం గోలాహలంబను పర్వతంబు గామించి యడ్డంబువడినదానిం దనపాదం బునం జేసి తలగం దోచిన నన్నదికిఁ బర్వతసమాగమంబున వసుపదుం

డను కొడుకును గిరిక యనుకూఁతురుం బుట్టినయివ్వరువురును శక్తి
మతి ద్వయము భక్తిమతియై గిరినిరోధంబువాయ నుపకారంబుచేసిన
యుపరిచరునకు మెచ్చి కానికయిచ్చిన నాతండు వసుపదుం దనకు
సేనాపతింజేసికొని గిరికం దనకు ధర్మపత్నింగా జేకొనియె."

ఈయుపరిచరుఁడే వసురాజు; గిరిక నాయిక; వీరిపరిణయమే
యిందలి ప్రధానవస్తువు. మహాకావ్యమునకు వలసిన యితివృత్త
మును గల్పించుకొని కడురమ్యముగా నీగ్రంథమును రచించిన రామ
రాజభూషణుఁడు నుతిపాత్రుఁడు. ఇది నారికేళపాకమున నున్నదను
మాట సత్యము. విమర్శించి యిందలి రసమును చవిగొనిన పాఠకు
లామాధుర్యము నెన్నఁడును మఱువక నానందాబ్ధిలో నోలలాడు
చుందురు.

ఈప్రబంధరాజమునకు సోమనాధకవియు, జగన్నాధరాజపండి
తుఁడును వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. బ్రౌను పండితుఁడు
జూలూరి అప్పయ్యపండితునిచే నొకవ్యాఖ్యానమును వ్రాయించెను.
ఆధునికపండితులు కొందఱు మనువసు చరిత్రలలో నేదియుత్తమమైన
దని ప్రశ్నించుకొని యందుభిన్నాభిప్రాయులై తమతమ వాదములను
బలపరచుకొనుటకై రెండుప్రబంధములయందలి గుణదోషములను వెల్ల
డించుచు గ్రంథములను బ్రకటించియున్నారు. వ్యక్తిగత దూషణము
లను పక్షపాత విమర్శనములను విడచివైచినచో నాగ్రంథములు పాఠ
కులకుఁ గొంతవఱ కుపయోగములని చెప్పవచ్చును.

వసుచరిత్ర కృతిపతి తిరుమలరాయలు- ఇతఁడార్వీటి బుక్క-
రాయలకు మనుమని కుమారుఁడు——కర్ణాటరాజ్యలక్ష్మి మొదట సంగమ
వంశములోను పిదప సాళువవంశమునందును తరువాత తుళువవంశము
లోను తుదను ఆర్వీటి వంశములోను జేరి యీవంశమువారితోనే యస్త
మించినది. ఈరాజ్యలక్ష్మి ననుభవించిన యార్వీటివంశజులలో నీతఁడే
మొదటివాఁడు. ఈతనియన్నయగు నళియరామరాయలు కర్ణాటదేశ

మును బరిపాలించినవాఁడే యైనను, నప్పుడు తుళువవంశములోని వాఁడగు సదాశివరాయలను రాజుగానుంచి యాతనిపేరుతోనే రాజ్యమును నడపినవాఁడు. తిరుమలరాయలు గొప్ప పరాక్రమవంతుఁడును విద్వత్ప్రభువునై యుండెను. ఈతఁడు పెనుగొండ రాజధానిగా కర్ణాటరాజ్యమును పాలించియుండెను. వసుచరిత్రము ౧౫౮౦ ప్రాంతమున తిరుమలరాయలకుఁ గృతియివ్వఁబడెననుట నిశ్చయము.

వసుచరిత్రమున ధ్వనిప్రధానముగాఁగల పద్యములును శ్లేషార్థము గల పద్యములను శబ్దవైచిత్ర్యముగల పద్యములును చాలగలవు. కవితాచమత్కారమిందు విశేషముగాఁ గన్పట్టుచుండును. మొత్తముమీఁద నీకావ్యకన్య సర్వాలంకారభూషితయై సరసజన హృదయాకర్షణీయయై యొప్పారుచున్నది.

వసుచరిత్రమునుండి కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

ఉ. చెన్నగు నన్నదీపులినసీమల దాఁగిలిమూఁత లాడుచుం
వెన్నెలరేలు కప్పురపువిప్పుటనంటులవీడ నీఁగురా
కన్నెఁ జిలోయునన్నులకుఁ గన్నులుమూయుఁ దదీయవాసనల్
మన్ననఁ గాంచి కప్రపుదుమారము రేఁచు సమీరడింభముల్. ౧ఆ.

చ. చలితలతాంతకాంతి యనుచందురుకావి చెరంగు జాఁటిస
మ్మిళితవయోవిలాసముల మీటినవిచ్చు ఫలస్తనాగ్రము
ల్వెలువడఁ గప్పెఁ దత్క్షణమ వెల్లితపోహద ధూపధూమకుం
తలములు విప్పి దాడిమలతాలలితాంగి నృపాలుచెంగటన్. ౧ఆ.

చ. ముని యటురాఁదటాలున సమున్నతపీఠము డిగ్గి నిల్చి నం
గన నిరుపేదకౌను కుచగౌరవ మోర్వక కంపమొందఁ గా
జనపతిచూడ్కితోడనె ససంభ్రమసంభరితానుకంపమై
యెనసివలగ్నముంబొదివె నీశులు దీనదయాళుదర్శనుల్. ౨ఆ.

ఉ. జీవనమెల్ల సత్కవినిషేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతలపట్టు ప్రచారములెల్ల విశ్వధా

తీర్థవలయత్రికాలఫలదేశికము ల్నవకంబులెల్లము
క్తావళివిభ్రమాస్పదము లానదిపెంపు నుతింప శక్యమే.　　౨౩.

చ. వనజదళాయతాక్షి నిడువాలికచూ పనిమేషవృత్తి నా
ఘనునవకంబుపైఁ బొలసి కొంతనదీక్షణజాలకంబు పై
కొనినఁ ద్రిపాద్ధిఁ గుర్వింకియును గోరికఁ గన్నులఁగూర్చఁబోను మో
హనగుణశక్తి నివ్వటిలు నవ్వలరాయుని నేర్పువెంపునన్.　　౩౭.

ఉ. కొంచక యంబుధింబడిన కొండలపక్షతిను లూడ్చునట్టి యా
అంచులకత్తి దానియును టంతయు నెంతని కంతుచేతినా
అంచులకత్తి హత్తి జవరాలికుచాద్రులముంచెఁ బత్రరే
ఖాంచితవై భవం బెడల నాతతబాష్పమహాపయోనిధిన్.　　౩౮.

శా. ఈవబ్జుండవు నీటఁబుట్టితిసుమీ యే నంచు మోమోటపుం
ద్రోవల్ సెప్పఁగ సిగ్గుగాదె మఱి నీతోఁబుట్టు శ్రీదేవి లీ
లావాసంబు సిరుల్లరింతు వనుచో నమ్మోహ కళాదుండ చే
తోవీధిన్ సహజాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే.　　౪౯.

శా. మాయాశీలుగు చంచలాత్ము లనుకంపాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తు ల్నమయానుకూల హృదయవ్యాపార గోపాయనో
పాయజ్ఞు ల్మగవార లాపయి మహీపాలు ర్మహావైభవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవారి న్నమ్మఁగా వచ్చునే　　౪౦.

మ. చరణాగ్రానమితాచలేంద్రుఁడు సదాసన్మార్గసంచారి సు
స్థిరకల్యాణ సమాఖ్యుఁ డావసుధరాధీశుండు వో గోత్రశే
ఖరగంగావచనం బహ్మముగునే కల్యాణి నీకన్నెన
న్నరనాథాగ్రణిరాణిఁ జేసి కనుమా నానావిధైశ్వర్యముల్.　　౪౧.

ఉ. నిండుమనంబునం దనమనీషిత మెల్ల ఘటింపవచ్చు నా
ఖండలుఁరాక చారణముఖంబున మున్న యెఱింగి చేదిభూ
మండలభర్త గాంచె నతిమాత్రముదం బది యొందుఁ జిత్రమే
కొండలు పిండిసేయుశతకోటియుతుండు హితుండు గల్గినన్.　　౪౨.

ఉ. తోయ్యలి ముద్దరాలు కుచదుర్గము లాశ్మశయైకవంచనన్
నెయ్యపు కేని పాల్పఱిచి నీవియుఁ గోల్పడఁగాఁ దలంచెఁ గా
కయ్యెడ నేఁకో యునిచె నాత్మశయద్వితయంబు మున్నె లో
నయ్యె సరాగమై నృపకరార్పణ కింకఁ బెనఁగ నేర్చునే. ౬౮.

ఈతఁడు రచించిన ముకుందవకావ్యము హరిశ్చంద్రనలోపాఖ్యాన మనునై దాశ్వాసములద్వ్యర్థి కావ్యము. పింగళి సూరనార్యుఁడు మొదట రాఘవపాండవీయ మనుద్వ్యర్థికావ్యమును రచియించియుండెను. అంతకంటె ప్రౌఢముగా నుండున ట్లీతఁడీ కావ్యమును రచించి శ్రీరామచంద్రున కంకితముచేసి కృతిపతి వర్ణనాసందర్భమున రామాయణగాథను ౨౭ పద్యములలో వర్ణించియున్నాఁడు.

పాండవు లరణ్యావాసము సేయుచున్నప్పుడు మార్కండేయమహర్షి యచ్చటకురాఁగా ధర్మరాజాయనను బూజించి మావలెఁగానల నిడుమలంబడి పిదప సౌఖ్యమును గాంచినరాజోత్తము లెవ్వరైనఁ గలరా? యనిప్రశ్నింప నాతఁడు

శా. కౌంతేయాగ్రజ! యింతచింత మదిలోఁ గావింపఁగా నేల! మీ
సంతాపంబు లడంచు నాహరి హరిశ్చంద్రుండు మున్నింతకున్
వంతన్గుందఁడె వైరిసేనియు విపద్వారాశిలోఁ గ్రుంకఁడే
సంతుష్టాత్ములు గారె వారు పిదప న్సంప్రాప్తసామ్రాజ్యులై

అని ప్రత్యుత్తరమిచ్చినట్లును నందుపై నాయిరువురి చారిత్రములను జెప్పుమని ధర్మరాజడుగ నిరువురికథలను వేర్వేరుగాఁ జెప్పినచో జపార్చనాదుల కాలస్యమగును కావున నొక్కసారియే వారిరువురికథలను జెప్పెదను గ్రహించుకొనుమని యీక్రింది పద్యములో మార్కండేయుఁడు ప్రత్యుత్తరమిచ్చినట్లును కవి కల్పించియున్నాఁడు.

ఉ. వారిచరిత్రము లుభవసవర్ణ్యము లైనవి వేఱె పేర్కొన
న్నారె జపార్చనాసమయసంగతి తప్పెడుఁ గాన నిప్పుడో
భూరివివేక! యానృపుల పుణ్యకథ ల్పదశక్తి నొందుగాఁ
గూరిచి తెల్పెద న్నెలిసికొమ్మని నేర్పు దలిర్ప నిట్లనున్.

ఈద్వ్యర్థికావ్యమునఁ గవి తనయసాధారణశక్తిఁ గనుపఱిచి తనప్రయత్నమున సఫలీకృతమనోరథుఁ డయ్యెను ద్వ్యర్థి కావ్యమందలి యీతనికవిత్వశైలిఁ జూపుటకై నాల్గుపద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

శా. భావంబేవగఁ దద్వశీకృతిదృఢోపాయంబుగా నాతతే
ర్ష్యావిద్యోతితసంగరాగ్రహత విశ్వామిత్రుఁ డత్యంతశూ
న్యావాసంబులుగా నొనర్చె మతిసృష్టానేక చిత్రక్రియా
ప్రావీణ్యోజ్జ్వల జంతుసంతతులఁ దత్ప్రాసాద దేశంబులన్. ౨ఆ.

చ. వెనుకొని వచ్చు బాల యతివిహ్వలతావివశీకృతాకృతిన్
గనుఁగొని రాజమౌళి నవగాఢవిషాదవిలోలదృష్టి ని
ల్లెను రమణీయధైర్యతృష నాకటఁ జిక్కితివే సహింప నీ
వనగతిఖేదముం జనుము వావిరి నీకడ వారినారయన్. ౩ఆ.

చ. వనచరభూతనిష్ఠురుణ వైరసముద్ధతి నేని యుత్ప్రకం
పనవిషభుక్ప్రకాండవిషపాళిక నేని జగజ్జనానుభం
జనదవమండలీభరదచండశిఖాహతి నేని ప్రాణముల్
సన మిగదాకతోరగతి సైచెద నీదృశఘోరదుర్దశల్. ౪ఆ.

ఉ. భూనుత పూర్వరూపధృతిఁ బొల్చి నితాంతదురంతమానస
జ్యానిదహించుమానిని నసంతతి సద్విధిఁ దేర్చి యయ్యయో
ధ్యానగరాధినేత వెసనంపె యథోచిత మైనవస్త్రనన్
దేనియనుంచి యబ్బురపుఁ దీయఁదనంబులుసిల్కఁబల్కులన్. ౫ఆ.

రామరాజభూషణుని కవిత్వము ప్రౌఢమైన దైనను, సామాన్యులకు సుబోధకము గాదని యొప్పుకొనకఁ దప్పదు. రాఘవపాండవీయము ద్వ్యర్థికావ్యమైనను నింతటి కాఠిన్యముతో నుండక నింతకంటెఁ జాల సులభముగా నున్నదని యంగీకరింపవలసియున్నది. వ్యాఖ్యానములున్నను నీతని గ్రంథములయందలి భావములను గ్రహించుటకు సామాన్యులకు సాధ్యము కాదు. ఈతనికవిత్వమందలి మాధుర్యము

పండితైకానుభవవేద్యము. ఈతని గ్రంథములయందలి గుణముల నెత్తి చూపుటకు వేఱుగ గ్రంథము వ్రాయవలసియుండును.

రామరాజభూషణుఁడు రాజాశ్రయమున విశేష ద్రవ్యార్జన మొనర్చి యావనమును సత్కార్యములకై వినియోగించినవాఁడు. ఈతఁడొక యగ్రహారము నొసంగినట్లును, ఒక సరసును త్రవ్వించినట్లును, ఆలయనిర్మాణమును గావించినట్లును హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. సుతులఁ బెక్కండ్ర శాశ్వతరామునామధ
న్యులఁజేసి పిలుచు భాగ్యోదయంబు
రచితాగ్రహారంబు రామచంద్రపురాంక
ఖ్యాతం బొనర్చిన పుణ్యరేఖ
నవదివ్యభవనంబు సవరించి శ్రీరామ
విభుఁబ్రతిష్ఠించిన విపులమహిమ
రామసరోనామ రమణీయముగఁ దటా
కము వినిర్మించినఘనయశంబు

గీ. సఫలతవహించు నీహరిచ్చంద్రనలక
థాయుగనిబంధచిత్రబంధప్రబంధ
మంకితమొనర్చు రఘుభక్త కఖిలకర్త
కురుతరాభీప్సితము లెల్ల నొదవు నీకు.

రామరాజభూషణుఁడు ఆంజనేయోపాసకుఁడు. క్రమక్రమముగా శ్రీరామభక్తుఁడై శ్రీరామచంద్రునిపేర నగ్రహారాదికముల నొనర్చి తన కుమారులకు శ్రీరామచంద్రుని నామములను బెట్టెను. కవిజీవితములను రచించిన గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, నరసభూపాలీయమునఁ గవి శ్రీరామభక్తుఁడని చెప్పుకొనలేదనియుఁ, దక్కిన రెండుగ్రంథములయందును గవి శ్రీరామభక్తుఁడ నని చెప్పుకొనియున్నాఁడనియు నందుచే, మూర్తి రామరాజభూషణులొక్కరు గారని నిర్ధారణమొనర్చి యున్నారు. మూఁడు గ్రంథములయం

దలి గద్యలను బరిశీలించినచోఁ గవి యాంజనేయ ప్రసాదముచేఁ దనకు గవిత్వ మలవడినదని యేఁ జెప్పుకొన్నాఁడు. ఆంజనేయోపాసకుఁడు కొంతకాలమైనపిదప శ్రీరామభక్తుఁడు కాఁగూడదా? తనకుపాస్యదేవత కుపాస్యుఁడైన శ్రీరామచంద్రుని రామరాజభూషణుఁడు సేవించెననుటలో నాశ్చర్యము లేదు. నరసభూపాలీయమునాఁటి కాతఁడు శ్రీరామభక్తుఁడు కానంతమాత్రమున నాతఁడు వేఱువ్యక్తియని భావింపఁజనదు. వసుచరిత్రమునాటికి లేని శ్రీవేంకటేశ్వరుని యనుగ్రహమును గూడ హరిశ్చంద్రనలోపాఖ్యానమునాటికిఁ గవిసంపాదించి యైశ్వర్యవంతుఁడై "శాశ్వత శ్రీవేంకటేశ్వరానుగ్రహ నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁడ" నని వ్రాసికొనియుండలేదా? నరసభూపాలీయమునఁ గవి తనను గూర్చి వ్రాసికొనిన "శతలేఖినీపద్యసంధానధౌరేయు" అనుసీస పద్యములో నున్నకవిసామర్థ్యమును సూచించు బిరుదములు వసుచరిత్రములోను హరిశ్చంద్రనలోపాఖ్యానములోను లేకపోవుటచే వారిరువురు నొకరుగారని నిశ్చయింపవలసియున్నదనికూడ శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు. కవులైనను బండితులైనను యావనమునఁ దమస్వోత్కర్షను బ్రకటించుకొనినట్లు కొంతకాలము జరిగిన పిమ్మట నంత వెట్టిగాఁ బ్రకటించుకొనుట కిచ్చగింపరు. తమయశస్సు జగద్వ్యాప్తమై యెచ్చటికేఁగినను నేమివ్రాసినను గౌరవింపఁబడుచున్న కాలములోఁ దనసామర్థ్యాదులనుగూర్చి గ్రంథములయందంతగా వ్రాసికొనుటకు రామరాజభూషణుఁ డిష్టపడకపోయియుండును. ఇది మానవప్రకృతి. వసుచరిత్రములో వ్రాసికొనిన ఏకైకదినప్రబంధఘటికాసద్యశ్శతగ్రంథకల్పన బిరుదమును హరిశ్చంద్రనలోపాఖ్యానమున వేసికొనలేదు. హరిశ్చంద్రనలోపాఖ్యానమునాటికి గొప్పపేరు ప్రతిష్ఠలను సంపాదించియున్న రామరాజభూషణుఁడు ఆగ్రంథమున "తత్సమభాషావితాన"జ్ఞేత్యాది బిరుదములు నిజముగా వేసికొనియుండినచో నది యౌచిత్యమును సూచింపదని నాయభిప్రాయము.

వసుచరిత్రకావ్యకర్తతాను సంగీతకళారహస్యనిధినని వ్రాసి కొనియుండెను. నరసభూపాలీయమునం దిది లేదు. అందుచే నీవీరువురు భిన్నులని కవిజీవితములలో సూచింపఁబడినది. నరసభూపాలీయరచ నమునాఁటికి మూర్తికవి యించుక సంగీతజ్ఞానము కలవాఁడైనను సంగీ తరహస్యముల నెఱుఁగకపోయి యుండవచ్చును. వసుచరిత్రమునాఁటి కాతఁడు సంగీతరహస్యకళానిధియై యుండవచ్చును. కావున మూర్తి రామరాజభూషణులిరువురని సిద్ధాంతీకరించుట కిది లోడుపడఁజాలదు.

రామరాజభూషణుఁడు సాహిత్యమునందే కాక సంగీతమునం దును గొప్పవిద్వాంసుఁ డనియు, వీణెకు గొన్ని మెట్లను గల్పించిన మేధానిధియనియుఁ జెప్పెదరు. సంగీతశాస్త్రవిషయములను దెలుపు పద్యములు గొన్ని యీతని గ్రంథములయందుఁ గన్పట్టుచున్నవి గాని గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరింపలేదు.

ఈకవి కృష్ణదేవరాయలయాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొకఁడై యుండెనని కొంద ఱనుచున్నారు. కాని యామాట సత్య మయినట్లు కన్పింపదు. వసుచరిత్రకృతిప్రదానము క్రీ. శ. ౧౫౭౭ సం వత్సరమునకుఁ బిమ్మట జరిగినట్లు పైని వ్రాసియుంటిని. వసుచరిత్ర రచనానంతరము హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచియించియుండెను. అనఁగా క్రీ.శ. ౧౫౮౦ వ సంవత్సరప్రాంతమున దీనిని కవిరచియించి నట్లూహింపఁదగియున్నది. అప్పటి కీతని కరువదియేండ్లుండిన ననుకొందము. హరిశ్చంద్రనలోపాఖ్యానమువంటిద్వ్యర్థికావ్యమును రచించుటకు అరువ దియేండ్లుదాటినవారికి సాధ్యము కాదని నాయభిప్రాయము. ఎంతటి మేధావంతున కైనను నట్టిగ్రంథమును రచించుటకుఁ దగినవయసు నఱు వదియేండ్లు దాటియుండవనుట నిజమైనచో రామరాజభూషణుని జన్మము క్రీస్తుశకము ౧౫౨౦ ప్రాంతమై యుండును. కృష్ణదేవ రాయల యవసానము ౧౫౩౦ వ సంవత్సరమునందగుటచే నప్పటి కీతఁడు పదిసంవత్సరములవాఁడై యుండునని తేలుచున్నది. ఒకవేళ హరిశ్చంద్రనలోపాఖ్యాన రచనాకాలమునాఁటి కీతనివయసు డెబ్బది

యేండ్లనిభావించినను కృష్ణరాయలు భూలోకమును వీడునాటి కీతఁడిరువదియేండ్లవాఁడై యుండునని భావింపవలసియున్నది. అప్పటి కీతనికి విద్యార్థిదశ గడచియుండదు. కావున నీతఁడు కృష్ణదేవరాయలయాస్థానమునందుండెనని కాని, కవి దిగ్గజములలో నొకఁడని కాని భావింప వలనుపడదు.

శ్రీకృష్ణదేవరాయల ప్రధానమంత్రియైనతిమ్మరసు, తనయందనాదరముచూపుటచేఁ గోపించి, యీమూర్తికవియాతనిపై:—

శా. గుత్తిం బుల్లెలుపుట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలో
హత్తి న్సత్రమునందు వేఁడి, బలుదుర్గాధీశుతాంబూలపుం
దిత్తుల్మోసి పదస్థులైనఘనులన్ దీవించ...

అని తిట్టుచు పద్యము చెప్పునప్పటికి భయపడి తిమ్మరసు తనకుఁ గృష్ణదేవరాయలు పట్టాభిషేకసమయమునం దిచ్చిన పచ్చల హారమును బట్టుమూర్తి మెడను వేసెననియు నది యందుకొని యాబట్టు తక్కినపద్యభాగమును,

... ... ... దీవించెదన్.
మత్తారాళియయాతినాగమసుతు న్మంత్రీశ్వరుం దిమ్మనన్
అనిపూరించి, పిమ్మట

క. అయ్యా వనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయనృపపుంగవుచే
నయ్యా నీసరి యేరీ
తియ్యానివిలుకాఁడవయ్య తిమ్మరుసయ్యా

అనుపద్యమును గూడఁ జెప్పెననియు నందుచేతనే యామంత్రి శేఖరుఁడు "బట్టుమూర్తికిఁ గిన్కరెట్టింపఁ బచ్చలహార మర్పించెదిమ్మరుసుమాళి" (ముప్పదియిద్దరుమంత్రులనువర్ణించుపద్యములోనిది) యని ప్రసిద్ధిఁ గాంచెననియు నొకకథ చెప్పెదరు. కాని పైనివ్రాసినమూర్తి కవి వయోనిర్ణయము ననుసరించి యీకథయందుసత్యము లేదని దలంప

వలసియున్నది. తిమ్మరసును దిట్టనారంభించిన యాతఁడు మఱియొక కవియై యుండవచ్చును.

పంచపాషాణములలో నొకటియని ప్రఖ్యాతిగాంచిన యీక్రిందిపద్యము యొక్క కర్తృత్వమును రామరాజభూషణుని యందుంచుచున్నారు కాని పైనివ్రాసినదానివిజట్టి యిదియు విశ్వాసార్హమైనది కాదు.

ఉ. అబ్జముఖీమనోజ! నరసాధిపనందన! కృష్ణ! నీయశం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీవితీర్ణనం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము చిత్రమిద్ధరన్.

వసుచరిత్ర కృతిప్రదాన సమయమున కృత్యాదిపద్యమందని "శ్రీభూపుత్రివివాహవేళ" అనువాక్యమును గవిచదువఁగానె సభయందున్న తెనాలిరామకృష్ణుఁడు లేచియీకావ్యమును గృతినందినచోఁ గృతిపతియైశ్వర్యము నశించిపోవునని తెలిపి యందులకుఁ దార్కాణముగాఁ దనయరచేతియందు విభూతి నూచుకొని యందు 'శ్రీ'ని వ్రాసి బిగ్గరగా 'భూ' యనునక్షరమును జదువఁగా నావిభూతియెగిరిపోవుటను జూపెనని యొకకథను చెప్పెదరు. కాని కవిచరిత్రకారులనిన ట్లిది యొకపనికిమాలినకథ. దీనివలన కృతికర్తయుఁ గృతిభర్తయు రామకృష్ణుఁడును పరమమూఢు లనితేలుచున్నది.

ఇట్టికథలు కవులంగూర్చి చెప్పుకొనుచుండుటయాచార మైనది. రామరాజభూషణునిగూర్చియు ననేకకథలు ప్రచారములో నున్నవి. వానియం దౌచిత్య ముండదు. ప్రయోజనము నాస్తి. అట్టివానిని గ్రంథస్థముచేయు టనవసరమనియెంచి విడచితిని.

అలసానిపెద్దనామాత్యుఁడు కవిత్వఫక్కిని తెలుపుచు నాశుకవిత్వముగా రచించినయుత్పలమాలికవంటియుత్పలమాలిక నొకదానిని భట్టుమూర్తియుఁ దననిగ్రహానుగ్రహసామర్థ్యమును దెలుపుచు రచించెనఁట! దీనినీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఉ. లొట్టి యిదేటిమాట పెనులోభులతో మొగమాటమేల తాఁ
గుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపుర్వని యందురే కదా!
పట్టపురాజు వట్టి సరిపల్లె సరాసరి యియ్యకున్న నేఁ
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్రభయంకరంబు గాఁ
దిట్టితినా మహోగ్రహమతిన్ మకరగ్రహజ్ఝరీభటా
పట్టపుసర్పఫాలఫణిభర్తృజహూకృతపర్జటస్ఫుటా
ఘట్టన ధట్టణాలక విఘట్టక దిగ్గజరాజభృత్యకీ
చట్టచటార్భటీ నయనజ్ఝరకీలలు రాలఁగా వలెన్

జుట్టలికంబునన్ బొగడఁ జూచితినా రజతాద్రిధిత్యకా
పట్టణమధ్యరంగగతభవ్యవధూవదనానుషంగసం
ఘట్టశిరస్థగాంగఝురహల్లకజాలసుధాతరంగముల్
చుట్టుకొన న్వలెన్ భువనచోద్యముగా భయదంబుగా మఱిం
దిట్టితినా సభాభవనధింకృత భీమనృసింహరాడ్ధ్వజా
ఠాట్టమహాట్టహాస చతురాస్య సముద్భ్రుకుటీతటీనటీ
కోట్టణరోషజాలహృతకుంఠితకంఠగభీరనాదసం
ఘట్ట విజృంభమాణగతిఁ గావలె దీవనపద్య మిచ్చి చే
పట్టితినా మణీకనకభాజనభూషణభాసురాంబరా
రట్టతురంగగంధగజరాజ దమూల్యఘనాతపత్ర భూ
పట్టణ భర్మహర్మ్యభటపంక్తి చిరాయు వనామయంబునై
గట్టిగ తోడుతో వెలయఁ గావలె నెక్కువ రీవిఁ జూడుఁడీ
యట్టిటు మందెమేలముల నండలినింబలెఁ జుల్కఁజూచి యే
పట్టిన నైన కేరడముపల్కకుఁడీ పయివచ్చు నందులన్
గొట్టుదు దుష్కవిద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిం
బెట్టుదు దండముల్ సుకవిబృందము కేనతిభక్తి సారెకున్

గట్టితి ముల్లె లేఁబదియుఁ గాఁగలనూటపదాఱు లెవ్వరున్
రట్టడి భట్టుమూర్తి కవిరాయని మార్గమెఱుంగఁ జెప్పితిన్

ఈమహాకవి రేఫశకటరేఫలకు మైత్రి నంగీకరించియున్నవాఁడు. ఇతఁడా రెండు రేఫలకుఁ గలభేదమును దెలియక ప్రయోగించెననుట కంటెఁ దెలిసియే చేసెననుట సమంజసముగ నుండును.

ఈకవి రామరాజభూషణుఁడైనను, నీతని కావ్య మొకటియు నళియరామరాజున కంకితముగా లేదు. ఇందులకుఁ గారణము దురూహ్యము. అళియరామరాయల కొకప్పుడు వాతరోగము సంభవింపఁగా నీవిషపునోటివానిఁ జేరదీయుటచే నీరోగము వచ్చెనని తెనాలి రామకృష్ణుఁడు రామరాయలభార్యలకుఁ జెప్పిపంపెననియు నదికారణముగా నాయబలలు రామరాజభూషణునిచే రామరాయలు కృతులనందకుండ నెప్పటికప్పుడు నిరుత్సాహపరచి యాటంకములు కల్పించుచు వచ్చిరనియు నొకకథ చెప్పెదరు. ఇందెంతవఱకు సత్య మున్నదియుఁ జెప్పఁజాలము.

“చీఁపరపాపరతీగెల” యనుపద్యములోనిభావమును సరకుగొనక పాఠకమహాశయులీకవికృతగ్రంథములను జక్కఁగాఁ బఠించి యానందింతురుగాత!

# 215 కందుకూరు రుద్రయ్య



ఇతఁడు స్వర్ణకారకులజుఁడు. ఈకులమువారిని పూర్వము కమసాలులనియనెడివారు. అందుచే నీతనికిఁ గంసాలిరుద్రయ్యయని పేరుకూడఁ గలదు. ఇప్పు డీకులమువారిని విశ్వబ్రాహ్మణు లనియనుచున్నారు వీరు సామాన్యముగా శైవాచారసంపన్నులు. కాని యీకవి శివకేశవభేదము లేనివాఁడనియు వైష్ణవద్వేషి కాఁడనియు నీతఁడు రచించినగ్రంథములు చెప్పుచున్నవి.

ఇతఁడు నిరంకుశోపాఖ్యాన మనునాల్గాశ్వాసములప్రబంధమును కందుకూరునందలిసోమేశ్వరస్వామివారికిని, సుగ్రీవవిజయ మనుయక్షగానమును కందుకూరునందలి జనార్దనస్వామికిని గృతియిచ్చెను. ఆజనార్దనస్వామిపేర నొకయష్టకమునుగూడ రచియించెను. "బలవదరీ దరీకుహరభాస్వదరీ యదరీ దరీ హరీ" యనుమకుటముతో నొకశతకము నీకవిరచియించె నని శతకకవులచరిత్రకారులు వ్రాసియున్నారు కాని యాశతక మిప్పుడెచ్చటను లభించుటలేదు.

తాను రచించినగ్రంథములయం దెచ్చటను నీతఁడు తనవృత్తాంతమును జెప్పుకొనియుండలేదు. నిరంకుశోపాఖ్యానగ్రంథాంతగద్యయిది:

"ఇది శ్రీమత్కాళీ వరప్రసాదలబ్ధవర్ణ్ణవర్ణనీయకవిత్వ తత్త్వధౌరేయ పెదలింగనార్యగర్భార్ణ్ణవ పౌర్ణమాతేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానస..."

ఈగద్యవలన నీతఁడు కాళికాభక్తుఁడనియుఁ బెదలింగనార్యుని కుమారుఁడనియు, గురువరాచార్యుని శిష్యుఁడనియుమాత్రము తెలియుచున్నది. ఈతని గురువుకూడ విశ్వబ్రాహ్మణుఁడేయని యూహింపఁదగియున్నది. ఈకవి తనతల్లిపేరెచ్చటను జెప్పలేదు. కాని గ్రంథాంతమునందలి (4 ఆ. 137)

"క. అతులతర సోమవార

వ్రతనియమధురీణహృదయవారిజసాధ్వీ

శతవినుత చెన్నమాంబా
ప్రతిదినసంసేవ్యమానపదపంకేజా"

అనుపద్యములో నుదాహృతమైన 'చెన్నమాంబ' యీకవితల్లి యని యూహింపనగును.

మాతృగర్భమును సముద్రముతోఁ బోల్చి తాము చంద్రుల మని చెప్పుకొనుట కవి సాంప్రదాయము. ఇతఁడు తండ్రిగర్భము నర్ణవముతోఁబోల్చి తనను చంద్రునితోఁ బోల్చుకొనినాఁడు. కారణము దురూహ్యము కవి పసితనముననే మాతృవిహీనుఁడై తండ్రిచేఁ బెంపఁబడియెనేమో!

ఈకవికి వాసము నెల్లూరు మండలమందలి కందుకూరు. ఆయూరనుండు సోమేశ్వరస్వామికిని జనార్దనస్వామికి నీతఁడు తనగ్రంథములను కృతినిచ్చెను. సోమేశ్వరస్వామి కలలోఁ గన్పడి తన కావ్య కన్యక నిమ్మని యడిగె ననియు, నందులకుఁ బరమానందభరితుఁడై తనకన్యక గుణసంపత్తిని అల్లుని ఘనశక్తిని నీదిగువపద్యములలో మనోహరముగా వర్ణించియున్నాఁడు.

గీ. వచ్చి కృతికన్యకాసముద్వాహమునకు
శుల్కముగ నాయురారోగ్య సుప్రసిద్ధు
లిత్తునని యల్లుఁ డగుటకు నిచ్చగించె
నింతకంటెను సౌభాగ్య మెందుఁ గలదె. 18

ఉ. కోమలవర్ణధామయును గోవిదసంస్తవనీయలక్షణ
స్తోమఫలాభిరామయును శుంభదలంకరణ ప్రసాధన
స్థేమయు నప్రతర్క్యగుణసీమయు నైనమదీయకావ్యక
న్యామణి నిచ్చి మంచుమలయల్లుని నల్లుఁగాఁ నొనర్చెదన్. 19

సీ. తలపై వియద్గంగ గలుగునిత్యస్నాత
కైలాసగిరిదుర్గమేలునేత
త్రిపురంబు లొకకోలఁ ద్రెళ్లఁ జేసినవాఁడు
కందర్పుఁ గెల్చిన యందకాఁడు

పాపరాఁ దాల్చినపరుఁడు విక్రమరంహుఁ
　　గరిదైత్యుఁ బొరిగొన్న పురుషసింహుఁ
డంబుజాక్షికి దేహ మర్ధ మిచ్చినదాత
　　కలితసారుఁ గుమారుఁ గన్నతాత

గీ. మదవదరిదరిద్రాణదోర్మండలాగ్ర
జాగ్రదసురాగ్రిచరనిహింసనవిశాలు
శూలి రాజపరిష్కార్యశూలినామ
ధన్యుఁ డర్హుండు కాఁడె మత్కావ్యమునకు.　　20

కృత్యాది.

ఈకవి కాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నవి. ఇతఁడు కృష్ణదేవరాయలవారి యాస్థానములో అష్టదిగ్గజము లనిప్రఖ్యాతిఁగాంచినవారిలోఁ నొకఁడనియు ఆకవులకొఱకేర్పడిన సింహాసనములలో నీశాన్యదిక్కున నుండెడి సింహాసన మీతఁడధిష్టించెడివాఁ డనియు, జనశ్రుతి కలదు. ఇది సత్యమైనచో నీతనికాలము క్రీ శ. ౧౫౦౦–౧౫౩౦ అగును.

కాకునూరి యప్పకవి తనయప్పకవీయమునందు రచియించిన యీక్రింది గద్యపద్యములవలన నీకవి గుంటుపల్లి భాస్కరునికాలమునందుండెనని తెలియుచున్నది.

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలికొండ నృసింహుఁడు వెల్గయంచు నీ
వల నగసాఁపనివాఁడును మొల్కలటంచుఁ గూరిచెం
దెలియక కొండఱిట్లు పదమధ్యమునన్ లకారరే
ఫలఁదలపైయకారమును బాపుదురార్యులు నవ్వునట్లుగన్.

వ. ఇందులకు వినుకొండలో గుంటుపల్లి భాస్కరయ్యగారిసముఖమందుఁ గందుకూరి రుద్రయ్యగారు చెప్పినపద్యము (ప్రక్షిప్తము)

చ. వెలగకు వెల్గయంచు సరవింజలికొండ నృసింహుఁ డాడఁగా
మొలకకు మొల్కయంచుఁ గవిముఖ్యుఁడు రుద్రయపల్కె దోసమా

భళిభళి మంచిమాటయె ప్రబంధము నా జలరాశియందులో
పల నెరసు ల్గ్రహింతు రె యపారములౌ వనములెల్ల నుండగాన్.

గుంటుపల్లి భాస్కరమంత్రికాలము క్రీ. శ. ౧౬౨౦ ప్రాంతము. ఈకవి గుంటుపల్లి భాస్కరుని కాలమునం దుండుట సత్యమయ్యెనేని, కృష్ణదేవరాయల యాస్థానమునందుండుట అసంభవము.

ఈకవిరచించిన సుగ్రీవవిజయయక్షగానముద్రితప్రతికిఁ బీఠిక వ్రాసిన శ్రీ ప్రభాకరశాస్త్రిలుగా రొకశాసనశ్లోకమును బ్రకటించిరి. ఆశ్లోకమిది.

"అద్యాసీతి చతుశ్శతాధికసహస్రంవై శకాబ్దాగతాః
అస్మిన్ శ్రీజయవత్సరే జయతిథౌమాసేచ మాఘే తథా
పంచమ్యాం ద్వయతింత్రిణీ జనపదం రుద్రస్య విద్వత్కవేః
ప్రీత్యా శ్రీయిభరామభూపతి రదాత్ క్షోణీధరాఖండలః

మల్కిభరామ్షాదుషా రుద్రకవికి చింతగుంటపాలెమను గ్రామమును శాలివాహన శకము ౧౪౮౦ జయసంవత్సర మాఘమాసమునఁ బంచమినాఁడు దానమిచ్చిన ట్లిందువలనఁ దెలియుచున్నది. ఈకవి వంశమున రుద్రకవులు పెక్కురు బయలువెడలిరఁట! వారివంశీయు లీయగ్రహారమును నిన్నమొన్నటిదాఁక ననుభవించిరని శ్రీశాస్త్రిలుగారు వ్రాసియున్నారు. ఈశాసనమందలి కాలము క్రీ. శ. ౧౫౫౮ శా. శకము ౧౪౮౦ జయసంవత్సరము కాలేదు

ఈకవికాలము విషయమున నిట్లు భిన్నాభిప్రాయములున్నను మొత్తముమీఁదఁ నీతఁడు బదునాఱవశతాబ్దియం దున్నవాఁడని స్పష్టమగుచున్నది.

ఈకవి కృష్ణరాయల సభయందున్నాఁడని నిశ్చయించుటకు ప్రబలాధారము నేమియు లభింపలేదు. రాయలగురువైన తాతాచార్యునితో నీతఁడు వాదించుచుండెడివాఁడని చెప్పుచుఁ గొంద ఱీక్రింది చాటువు నాధారముగాఁ జూపుచున్నారు.

సీ. వరనిజకర్మధూర్వహాత బ్రాహ్మణులుమీర
పరికింప నిజపరబ్రహ్మ నేను
ఇనుముచేతను నొనర్చిన శంఖచక్రాంక
గురువులు మీర్జగద్గురుఁడ నేను
దానప్రతిగ్రహాధీరబిరుదుమీది
వేషణీహనుమంత బిరుదునాది
ఋషివంశభూషణ శ్రేష్ఠులుమీరలు
కనకకుంతలపరిష్కారి నేను

గీ. అనుచుఁ జెప్పితి మామకఘనకులంబు
రాయలు వినంగ నందఱౌ రాయనంగ
సత్కవులలోనఁ దాతయాచార్యయేన
రూఢి కెక్కిన కందుకూర్ రుద్రకవిని.

ఇతరాధారములు లేకుండఁ గేవల మీచాటుపద్యము నాధారము గాఁగొని యీతఁ డష్టదిగ్గజములలో నొకఁడని నిర్ణయించుట ప్రమాద భరితమగును. ఈతని గ్రంథములలో రాయలప్రశంసగాని, తత్కాలపుకవుల ప్రశంసగానిలేదు. ఇబ్రహీమ్ పాదుషావలనఁ జింతగుంట నగ్రహారముగాఁ బడసిన దీరుద్రకవియేయని తలంపవచ్చును. ఇతనివంశమున రుద్రకవులుండిన నుండవచ్చును. కాని వారెవ్వరును గ్రంథరచనము గావించినట్లగపడదు. క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున నీవంశములో మరియొకరుద్రకవి బయలువెడలెననుటకూడ సమంజసముకాదు. శాసనకాలమునాఁటికీతనికి నలువదియేండ్లుండెనని తలంచితిమేని కృష్ణరాయల కాలములో బాల్యవయసునందుండును కాని యష్టదిగ్గజములలో నుండఁజాలఁడు. శ్రీశాస్త్రిలువారుకూడ "ఇబ్రహీంకాలమునఁ గల రుద్రకవియే కృష్ణరాయల కాలమున బాలుఁడుగా నుండఁబోలును." అని వ్రాసియున్నారు. మరియు శ్రీశాస్త్రిలువారు:— "నిరంకుశోపాఖ్యానమున-

"చేరికన్నడభూమి చెఱవట్టు పాశ్చాత్త్య
నృపతి కైనను కొంతకృపదలిర్చు

అని సీసచరణమున్నది. అది విద్యానగరమును దురుష్కులు కొల్లఁగొట్టిన దుస్సందర్భమును దెలుపుచున్నది. విద్యానగరవినాశనము క్రీ. శ. ౧౫౬౫ ల నాఁడు జరిగినది. కావున నిరంకుశోపాఖ్యానరచన మటుతరువాత జరిగినదగును. నిరంకుశోపాఖ్యాన, సుగ్రీవవిజయకర్త క్రీ శ. ౧౫౬౫ ల ప్రాంతములవాఁడేని కొంతతర్వాతివాఁడేని కాఁగలఁడు" అనివ్రాసియున్నారు. శ్రీశాస్త్రిలువారి యభిప్రాయముతో నేనేకీభవించుచున్నాఁడను.

"గుంటూరి భాస్కరయ్య గారి సమక్షమున కందుకూరి రుద్రయ్యగారు చెప్పిన పద్యము" అని యప్పకవీయమునందున్న వాక్యములను సరణీయములు కావు. అవి ప్రక్షిప్తములని యప్పకవీయమునందే కలదు. ధర్మశీలుఁ డనురాజు పులహుఁ డను మౌనీంద్రుని,

"వ్యసనములలోనఁ బ్రథమ
వ్యసనము సంభోగకాంక్ష యది దోషమలీ
మస మనఁగ విందు నందుం
బ్రసరించినవాఁడు పాపబాహ్యుఁడు గలఁడే.

అని ప్రశ్నింపఁగా నాఋషిసత్తముఁడు-

చ. ఆడిగిన నేమిదోషమె సమస్త ధరాతలనాథ కోరికల్
నుడువుల నున్నవే మనసులోపలఁ గాక రతిప్రసంగముల్
దడవనియంతమాత్రనె విదారితమోహుఁడె యావిచారమున్
విడువుము వాగ్విశేషమును విశ్రుతవేషము మోక్షహేతువే?

చ. కలరుసుమీ మనోజశరకంపితధైర్యశరవ్యులై తలం
పుల వచనంబులం గ్రియల భోగవతీజనమంద యిచ్ఛ ని
చ్ఛలముగఁ బూని తక్కినవిచారము దూరముజేసినట్టి మొ
క్కలపుమనుష్యులుం బుధులుగాననిసద్గతిఁ గన్నవారలుౘ.

అని ప్రత్యుత్తరమిచ్చి యందుల కుదాహరణముగా నిరంకుశుఁడను బ్రాహ్మణునికథ నారాజునకుం దెలిపెనఁట.

శుద్ధశ్రోత్రియకుటుంబమున నిజధర్మానువర్తు లగు బ్రాహ్మణదంపతులకు జనించిన నిరంకుశుఁడు బాల్యమున గురుశుశ్రూషంజేసి సకలవిద్యలనార్జించి కర్మిష్ఠియై ప్రవర్తింపుచు యౌవనమంకురించిన పిదప నగ్నిహోత్రసాక్షిగఁ బరిణయమైన భార్యను త్యజించి వేశ్యాలంపటుఁడై రాత్రిందివములు వేశ్యలవాడలయందే దిరుగుచు:—

సీ. కొదమచందురువంటినుదుటఁ గస్తురినామ
మొఱపు మించఁగ దిద్దు నొక్కరితకు
చిమ్మచీకటి గ్రమ్మ కొమ్ముడి గొజ్జంగ
లొనరగాఁ దుఱుము వేఱొక్కరితకు
జక్కవకవవంటి చన్నులహారంబు
లొయ్యఁగాఁదీర్చు నొండొక్కరితకు
మించుఁ దీఁగెకు మించుమేనఁ గప్పురగంధ
మొప్పుగా నలఁదు మఱొక్కరితకు

గీ. నొకతె చెక్కులపై మకరికలు వ్రాయు
నొక్కతెకు నెల్లజడతీరు చిక్కుఁ దీయు
నొక్కపని యెప్పుడును గల్గియుండుఁ గార్య
భరము లేదనఁగూడ దాబ్రాహ్మణునకు.

ఇట్లుండ నాతని దుశ్చర్యలను గనిపెట్టి యాతనిభార్య తన యత్తతో

"ఉ. అత్తవు సర్వలక్షణసమగ్రగుణాఢ్యవు నన్నుఁ దిట్టనున్
మొత్తనె కాని నీకొడుకు మూఢత మానుపవేల! వాఁడు రో
త్తొత్తుల మారియై గృహముఁద్రొక్కక యొక్కొకదానిఁబూనికన్
గుత్తకు నంచు నుంచుకొని కోకలు రూకలు జోకనీయగన్.

అని చెప్పెను. తల్లి కుమారునితో

"శా. తేరాభోగపరాయణుల్ జగతిలో లీలావినోదంబుగాఁ
బోరా వేశ్యలయిండ్లకుఁ బోవిధసంభోగార్థులై గుట్టులో
రారా వైదికధర్మమార్గపథిక ప్రావీణ్యముం జూపరా
యేరా తండ్రి పరిత్యజింతురఁటరా యారీతి సత్కర్మముల్.

అని యనేకవిధముల బోధించినను బ్రయోజనము లేకపోయెను. ఆ స్త్రియంతయు వ్యయమైపోయినది. వేశ్యమాత యతనిని దనయింటికి రాకుండఁ జేసినది. ఈసందర్భమునఁ గవి వేశ్యమాత స్వభావమును ౪—౫ పద్యములలో వర్ణించినాఁడు. ఒక్కపద్యము నిట నుదాహరించెదను.

సీ. కాలకూటమునందుఁ గలమేలువిష మెల్ల
 జాలలోఁ గలుగుకార్కశ్య మెల్లఁ
పైశాచసమితిలోపలి వికారం బెల్లఁ
 గపికోటిలో నుండు కాంతులెల్ల
సెలయేళ్ళలోన వర్తిలెడువక్రత లెల్ల
 మయశంబరులలోని మాయ లెల్ల
ధార్తరాష్ట్రులలోనఁ దనరుమచ్చర మెల్లఁ
 బంచపాతకులలోఁ బాపమెల్లఁ

గీ. దీసి విటదోషరాసిచే ద్విగుణిఁ జేసి
యనృతపంకంబులోఁ గల్పి యశుచిభావ
రసముఁ జిల్కించి నిర్మించె బ్రహ్మ కృపణ
తరుణహృద్భల్లి యగులంజతల్లిగాఁగ.

తుదకా వేశ్యమాత నిరంకుశునితో—

గీ. చిన్నపనిగాదు లంజర్కమన్న వినుము
ప్రజలు మీరొక్కలైన మాపయికివచ్చుఁ
బడుచుఁడవు నీవు మాబిడ్డ పసరు మొగ
మొక్కెదము రాకు నీవిది మొదలుచేసి.

అని నిర్మొగమోటముగఁ జెప్పివైచెను.

బ్రాహ్మణుఁడు చేయునది లేక యింటికిఁ బోవొల్లక అరణ్యమార్గమునం బట్టిపోయి యచ్చోట నొకపాడు దేవాలయమునుం గని లోపలకుఁబోయి యందున్న శివలింగమును దనతో నెత్తమాడరమ్మని పిలిచి ప్రత్యుత్తరమును గానక శివలింగముతో—

గీ. ఎన్ని విధముల మాటాడకున్నయట్టి
గట్టిపూనిక నీయందుఁ గలిగెనేని
దానికొకయుక్తి మునుమున్న దలఁచినాఁడ
మినుగవచ్చునె విటశిఖామణుసుమ మెదుట?

క. నీయెత్తు నేనె యాడెద
నీయొడలం బొంతులేక నీవిద్యకుఁ బ్రా
లేయాద్రిసుతాజీవిత
నాయక నెత్తంబు కారణం బెఱుఁగుదువా?

అనిపలికి రెండుపక్షములయాటలును దానేయాడెను. ఓడిపోయినవాఁడొకలంజను దెచ్చి గెలిచినవానికిచ్చుట యాజూదమునకు పందెమని యాబ్రాహ్మణుఁడేయేర్పరచెను. నిరంకుశుఁడు న్యాయము దప్పకుండ రెండుపక్షములయాటలను దానే యాడెను. దైవవశమున నీశ్వరుఁడోడిపోయెను. అప్పుడు నిరంకుశుఁడు—

క. మును లంజలంజపన్నిద
మనియాడితిఁ గాని యిట్టిదట్టిది యనియా
డినవాఁడగాను గన నా
మనసుసుమీ వారయువతి మన్మథమధనా!

సీ. అలకాధిపతిసూనుఁ డమరవేశ్యలలోన
మేలెంచిపొందు నేలోలనయనఁ
బ్రథనరంగములోనఁ బ్రాణంబు లుండువ
గా నిచ్చిపోదు రేకలికితోడఁ
గ్రతుతంత్రములఁ దేవగణముల సంతోష
పఱచి కాంక్షింతు రేపద్మనయన

గతిసంపు తపములు గట్టిపెట్టి మునీంద్ర
కోటియాశింతు రెకువలయాక్షి

గీ. త్రిభువనాశ్చర్యసౌందర్య రేఖ చంచ
లాలతాంగుల కేయింతి మేలుబంతి
యాదురాలాపపరీరంభ యంకయుగ్మ
రామణీయకజితరంభ రంభ దెమ్ము

యని తనయుత్తరీయము నాశివలింగమునకుఁ జుట్టి రంభను దెమ్మని నిర్బంధింపఁజొచ్చెను. ఈశ్వరుఁ డాబ్రాహ్మణుని యెడఁ గరుణించి సురగణ పరివృతుఁడై ప్రత్యక్షమయ్యెను. నిరంకుశుఁడు భయమునొంది గడగడ వణఁకుచు

మ. అపరాధంబులు పెక్కు చేసితి మహాహంకార కామక్రియా
విపులాంభోనిధిఁ గ్రుంకు వెట్టి జడతావేశంబున న్నిమ్ము ది
వ్యపథోద్వృత్తినిఁ గొల్వనైతిని మనోవాక్కాయ కర్మంబులం
జపలాత్మున్ననుం బ్రోవ మీదయయ కా సాధ్వాత్కటాక్షేక్షణా.

అనిప్రార్థింప నీశ్వరుఁడు "నీకేమియు భయము లేదు. వాస్తవముగా ద్యూతమున నేనోడిపోయితిని. నీకురంభనిచ్చి నేనుపన్నిదముఁ దీర్పవలసియున్నది." అని చెప్పుచు దేవేంద్రునితో "నీబ్రాహ్మణునకు రంభనిమ్ము" అనియాజ్ఞనీయ నాతఁడు రంభతో

క. ఓనాతి యీవ హీనసుర
సూనునకు నభీష్టకామసురతక్రీడా
నూనసుఖ మొసఁగి రమ్మన
నానలినాక్షియును మంచిదని మొక్కితగన్.

క. ఆసుదతి ముదమెలర్ప మ
హీసురసుతుఁ గౌఁగిలించి హితమతిఁ బలికెన్
ఏసతిపుణ్యవతి యెవనీ
తో సురతము నిరత మెనయుఁ దొంటిఫలమునన్.

క. మనసిజకేళికి భూసుర
తనయా నీసాటిరారు దలంపంగ నేలా
యనరాదుగాని దాసులు
వినుమా నలకూబరాది విజయవిశాలుర్.

అని రంభ యాతని రతిచాతుర్యమునకు మెచ్చి యాతనితోం గొంతకాలము క్రీడావినోదంబులనుండ నొకనాండు నారదమహర్షి యామార్గమున జనుచుండ నిరంకుశుండీతండెవ్వండని రంభనడిగెను. ఆమె కనుగీటి నారదునకుం గనుమొఱంగెను. నారదుండామెనుగనిపెట్టి తనకుదండమైనంబెట్టలేదని యీర్ష్యంగొని యామెవృత్తాంతమును దేవేంద్రునకు విన్నవించెను. ఇంద్రుండామెను బిలిపించి, మరల నింద్రలోకమునకురాక యాబ్రాహ్మణునితో నింతకాల మున్నందులకుం గినిసి పాషాణముగమ్మనిశపించి యామెదీనతతోం బ్రార్థింపనాపాషాణము చూర్ణమైనప్పుడు పూర్వరూపము వచ్చుననిశాపాంతము ననుగ్రహించెను. రంభ తనశాపవృత్తాంతమును నిరంకుశునకుం జెప్పి యచ్చోటనే మహాపాషాణమైపోయెను. ఆయూరిరాజాపాషాణమును జూడవచ్చి యారూపమునకు జంకి మతిభ్రష్టుండయ్యెను. ఆతని మతిభ్రమణమును గుదుర్పనేరికిని శక్యముకాదయ్యెను. నిరంకుశుండటకేంగి పాషాణదర్శనమున రాజును బిశాచమావహించెననియుం దన మంత్రప్రభావముచే రాజునకుపట్టిన పిశాచమును వదల్చెదనని ప్రతిజ్ఞయొనర్చి ముందుగ నాపాషాణమును జూర్ణముచేయుండని రాజసేవకులను బ్రోత్సహించెను. వారట్లే యొనర్చిరి. ఆధూళిలోనుండి—

సీ. జిలుంగుం బయ్యెద జాఱంజికిలిగుబ్బలకాంతి
దిగపార దిశలెల్లం దెలివిపఱుప
దలవోకగాం జూడ నసమాస్త్రనిశితమా
ర్గణపరంపర లోకరాశిం బడగం

కరపంకజములూఁపఁ గనకకంకణ
ఝణనాదసంపదగుమానముగఁ జెలఁగఁ
బ్రతిపదంబున నూపురఝళంఝళవి
రావమున మూఁగఁబడి హంసములు దూలఁగ

గీ. దనరుచాతుర్యధుర్యసౌందర్యరేఖఁ
దగిలిపీడనిచూపుల మగిడి డిగియ
రాక మర్త్యులవెంటాడ దా నమర్త్య
నీరజాక్షి నిరంకుశుఁ జేరవచ్చె.

తనకు శాపాంతము ననుగ్రహించిన నిరంకుశుని వేనోళ్లఁ గొనియాడి రంభ యాతనితోఁ గొన్నిదినములు కామోపక్రీడల ననుభవించి మరలవత్తునని యాతనికి నచ్చఁజెప్పి దేవేంద్రలోకమునకుఁ బోవ నింద్రుఁడామెనుజూచి తనశాపము ననుభవింపలేదని యాగ్రహము నొంద రంభ జరిగినవృత్తాంతము నింద్రునకు విన్నవించెను. నిరంకుశుని బుద్ధివైశద్యమున కచ్చెరువొంది యాతనిఁజూడఁగోరి యింద్రుఁడవనీతలంబునకు విచ్చేసి నిరంకుశునింజూచి యాతనిపొగడ్తలకు మిగుల సంతసించి యారాజునకు భూతావేశము పోవునట్లును రంభ దివిజలోకమునుండి నిరంకుశునికడకు వచ్చుచుఁ బోవుచుండునట్లును వరమొసంగెను.

సీ. ఒకనికి శక్యమే యురగభూషణుతోడ
నలఘుచాతురి జూదమాడి గెలువ
గెలిచెఁ బో యొకనికిఁ దెలియునే సామాన్య
రమణుల నడుగక రంభనడుగ
నడిగెఁ బో యొకనికి నలవియే సురకాంత
రావించి భూమి నిల్లాలిఁ జేయఁ
జేసెఁ బో యొకనికిఁ జెల్లునే చిరభోగ్య
మగునింద్రశాపంబు నపుడెమాన్ప

గీ. నీకుఁదక్కఁగ వికచనాళీకలోచ
నామనోహర దేహసౌందర్యధుర్య
తాసవారితశీతలధామసోమ
ధరకృపాపాత్రపుత్రకందర్పదర్ప.

అని జనులచేఁ గొనియాడఁబడుచుఁ దలిదండ్రుల నానందమునఁ దేల్చి నిజభార్యంగూడి, పుత్రపౌత్రాదులం బడసిన నిరంకుశుని చారిత్రమును పులహముని ధర్మశీలునకుం జెప్పి—

క. ఎటువంటిదురాచారున
కెటువంటి జగత్ప్రసిద్ధి యొదవఁగితె రాజా
యటుగానఁ బూర్వపుణ్యో
త్కటభావం బల్పునైన ఘనుఁ గావించుఙా.

అని బోధించెను. ఇది నిరంకుశోపాఖ్యానము నందలికథ. కవిత్వము మృదుమధురపదసంయుతమై యమృతము గురియుచుండును. శైలికిదివఱకుదాహృతము లైన పద్యములే చాలియున్నవి.

ఈతఁడు రచించిన సుగ్రీవవిజయమును సుగ్రీవునకు శ్రీరామచంద్రునితో ఋశ్యమూకమున మైత్రియొనఁగూడుట మొదలు వాలి వధానంతరమున సుగ్రీవునకు కపిరాజ్యపట్టాభిషేకమును అంగదునకు యువరాజ్యపట్టాభిషేకమునుజగిగి వర్షకాలానంతరమున మరలవచ్చి సీతాన్వేషణమునకై బ్రయత్నింతునని శ్రీరామచంద్రునితో విన్నవించుటతో సమాప్తము నొందించినాఁడు.

శతకకవుల చారిత్రమునుండి గైకొని బలవదరీ శతకములోని యొకపద్యము నుదాహరించి యీతని చారిత్రమును ముగించెదను.

చ. కలశపయోధిమీఁదఁ దరఁగల్ మరిహోయనిమ్రోయవేయుభం
గుల తలపాన్పుపాము బుసకొట్టఁగ నేగతి నిద్రఁ జెందెవో
యలసతఁ దండ్రి చీమ చిటుకన్నను నిద్దుర రాదు మాకు నో
బలవదరీ దరీ కుహరభాస్వదరీ యదరీ దరీ హరీ.

---

# 216 చిత్రకవి అనంతకవి



ఇతఁడు "ఇందుమతీపరిణయ"మను ప్రబంధమును రామరాజభూషణకవి విరచితమగు హరిశ్చంద్రనలోపాఖ్యాన మనుద్వ్యర్థిప్రబంధమునకు వ్యాఖ్యానమును రచించెను. ఈతఁడు లక్షణసారసంగ్రహ కృతికర్తయగు చిత్రకవి పెద్దనార్యునకుఁ గుమారుఁడు. సాంబవిలాసాది గ్రంథములనురచించిన చిత్రకవి వెంకటరమణకవికిఁ దండ్రి. తండ్రి తాతలకువలెనే యితనికిని హనుమంతుఁ డిష్టదైవము-

హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యానమునం దీతఁడు రచించిన క్రిందిపద్యములలోఁ దన వృత్తాంతమును జెప్పుకొని యున్నాఁడు"

శా. శ్రీమద్రామపదారవిందయుగళీ భృంగాయితస్వాంతు భ
క్తామేయాభిమతార్థదాయక దయైకాయత్తనేత్రాంతు సు
త్రామాదిత్రిదశప్రియంకర భుజాధామాతికాంతుఁ బుధ
స్తోమస్తుత్యయశోనితాంతు హనుమంతుఁ భక్తిఁ గీర్తింతెదన్.

సీ. శ్రీహనూమద్వర శ్రీలబ్ధసుకవిత్వ
చతురుండ లక్షణసారసంగ్ర
హం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁ
డగుచిత్రకవి పెద్దనార్యసుతుఁడ
విష్ణుచిత్తీయాది వివిధకావ్యార్థముల్
దెలిసి వక్కాణించు ధీరనుతుఁడ
గండికోటాఖ్యదుర్గస్థలాధ్యక్షుఁడై
పృథివిమంతున కెక్కు పెమ్మసాని

గీ. చిన్నతిమ్మక్షమాపాలశేఖరుండు
గారవింపంగ బహుమానగౌరవముగ
మనినధన్యుఁడ సభ్యసన్నుతగుణైక
గరిమ వెలయు ననంతాఖ్యకవివరుండ.

క. ముఖ్యంబై భూస్థలి భూ
రిఖ్యాతిం గాంచి తగుహరిశ్చంద్రనలో
పాఖ్యాన కావ్యమునకుఁ
వ్యాఖ్యాన మొనర్తు విబుధవర్యులు పొగడన్.

ఈకవి రచించిన యిందుమతీపరిణయ మిప్పు డెచ్చటను గన్పట్టుట లేదు. రఘువంశమునందలి యజమహారాజునకును నిందుమతికిని జరిగిన పరిణయకథ యిందు వర్ణితమైయుండును. ఈకథను పెక్కురు ప్రబంధములుగా రచియించియున్నారు. ఈకవి యిందుమతీ పరిణయమును హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యయునేగాక హరిహరశ్లేషోదాహరణము, సకలజీవనసంజీవనము, వంశావళి అనుగ్రంథములనుగూడ రచియించిన ట్లీతనికుమారుఁడు సాంబవిలాసగ్రంథాంత గద్యలో నుడివియున్నాఁడు. ఆగ్రంథములును నామమాత్రావశేషములైనవి. వంశావళి వంశచరితమే యయినచో నం దెవరివంశము వర్ణితమైనదో తెలియదు. హరిహరుల కిరువురకు వర్తించున ట్లుదాహరణము రచియించియుండును. సంజీవన మనఁగా సకలజీవులకు సంజీవనివంటిదని యర్థమైయుండును. ఇదికూడఁ బ్రబంధముగానోపు. హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యతప్ప తక్కిన గ్రంథములీతనివన్ని యుఁగాలగర్భమునఁబడిపోవుట విచారకరమైన విషయము. ఇతఁడు వ్రాసికొనిన యీక్రింది గద్యవలన నీతఁ డెట్టికఠిన ప్రబంధమునకైన నర్థమును బోధింపగలసమర్థుఁడని తెలియుచున్నది.

"గద్యము. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతీపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవిపెద్దిరాజతనూజ పురాతనాధునాతనకఠినప్రబంధార్థబోధనసమర్థమాన సాంభోజ సుధీజనవిధేయానంతయనామధేయ విరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక" యనువ్యాఖ్యానంబు"

ఈగ్రంథమూలకర్త యగు భట్టుమూర్తియు వ్యాఖ్యానకర్త యగు ననంతుఁడుగూడ హనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతులగుట విచిత్రసంఘటనము.

ఇతనినివాసము తండ్రినివాసమైన వెల్లలూరే యనియు నందున్న హనుమంతుఁడే యీతని యిష్టదైవమనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈతనికాలమును నిర్ణయించుటకుఁ గొన్నిగుఱుతు లున్నవి. ఇతనితండ్రియైన పెద్దనార్యుఁడు ౧౫౫౦ ప్రాంతమున లక్షణసారసంగ్రహమును రచియించెనని యాతని చారిత్రమునఁ జెప్పియుంటిమి. రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును క్రీ.శ. ౧౫౮౦ ప్రాంతమున రచించెను. కావున నాగ్రంథమునకు వ్యాఖ్యవ్రాసిన యనంతయకవి ౧౫౮౦ వ సంవత్సరమునకుఁ దరువాత దానిని రచియించెననుట నిశ్చయముకదా! దీనినిబట్టి కవికాలము క్రీ. శ. ౧౫౫౦—౧౬౧౦ అని నిర్ణయింపవచ్చును.

గండికోట దుర్గాధిపతియైనచినతిమ్మానాయఁడు తనను గౌరవించెనని కవి పైసీసపద్యములోఁ దెలిపియున్నాఁడు. ఈచినతిమ్మానాయని కాలమునుగూడఁ దెలిసికొంటిమేని యీకావ్యరచనా కాలము సునిశ్చితమగును. గండికోటదుర్గపాలకు లగుపెమ్మసానివారు కమ్మవారు. శూరులు-పరాక్రమవంతులు-కవిపండితపోషకులు. వీరి కాలములను నిర్ణయించితిమేని అనంతకవి కాలమే కాకుండ నింక మఱికొందఱి కాలముగూడ నిర్ణయమగును. కానిఁ వీరిలో నేకనామము గలవారిరువురు మువ్వురుండుటచే వీరికాలనిర్ణయము దుర్ఘటముగా నున్నది. వీరికాలవిషయమున భిన్నాభిప్రాయము లున్నవి. వీనినన్నిటిని సమన్వయము చేయుటకు నిర్దిష్టము లైనయాధారములు లేవు. అయినను, సాధ్యమైనంతవరకు సమన్వయముచేసి, తెలిసికొనవలసియున్నది.

తిరుపతి దేవస్థానమువారు వీరివంశవృక్షమును వారిసంపుటములలోఁ బ్రకటించియున్నారు. దాని నీక్రిందనిచ్చుచున్నాఁడను.

పెమ్మసానిరామలింగానాయఁడు

|

పెదతిమ్మానాయఁడు | చినతిమ్మారాజయ్య *

ఈవంశవృక్ష మిట్లువ్రాయుటకు దేవస్థానశాసనప్రచురణకర్తల కాధారము లేవియో తెలుపలేదు. ౬వ సంపుటమున ౧౮వ సంఖ్యగాఁ బ్రచురించిన శాసనమునాధారముగాఁగొని యీవంశవృక్షమును వ్రాసినట్లు కన్పట్టుచున్నది. దానిని జదివిచూచితిని. అది పెమ్మసానివారికి సంబంధించినది కాదు. పెమ్మసానివారిలో రామలింగానాయఁడు పెదతిమ్మానాయఁడు, చినతిమ్మానాయఁడు అనుపేరుగలవా రున్నమాటనిశ్చయమే. కాని వంశవృక్షములోఁ జూపినసంబంధ మాధారరహితమైనది. కావున నీసందర్భమున నిది యనుపయోగమైనదిగా భావించి వదలివేయుదము.

ఈపెమ్మసానివారినిగూర్చి కూలంకషముగా విమర్శించి, కాలనిర్ణయము చేయుట విశేషశ్రమతోఁ గూడినపని. ఈకవికాలము వేఱువిధమునసిర్ణయమైనది కావున నావిమర్శన మిట ననావశ్యకము. మఱియొకప్పు డీపెమ్మసానివారినిగూర్చి వ్రాయఁదలఁచి యిటవిడచితిని.

కడపమండలములో, జమ్మలమడకతాలూకాయందలి యెనుములచింత యనుగ్రామమును పెమ్మసానినాయఁడుకుమారుఁడైనచిన తిమ్మానాయఁడు తాడిపత్రియందలి వెంగళనాథఆలయమునకు దానమిచ్చినట్లు యెనుమలచింతగ్రామములోని ఆంజనేయస్వామియాలయములో నొకశిలాశాసన మున్నది. ♦ ఆశాసనకాలము శా.శ. 1474 సౌమ్య

* ఇతని శాసనము సం. ౬ సంఖ్య ౧౮ గానున్నది.

♦ మదరాసురాష్ట్రశాసనములు—కడప—సంఖ్య 397.

సంవత్సరము. (క్రీ.శ. ౧౫౫౦). ఆచినతిమ్మనాయఁడు కవినాదరించిన యాతఁడే యనితలచినచో నించుమించుగా పైనిర్ణయించినకాల మునకు సరిపోవుచున్నది. ఇందుమతీపరిణయము లభింపకపోవుటచే కవిత్వశైలిని జూపలేకపోయితిని.

---

# 217 తామరపల్లి తిమ్మయ్య



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భార్గవ గోత్రుఁడు; నాగమాంబాశరణమంత్రుల తనయుఁడు; చంద్రమంత్రి పౌత్త్రుఁడు; వల్లూరుజగ్గయామాత్యునకును గొండమకును దౌహి త్రుఁడు.

ఈకవి శేషధర్మము లనునైదాశ్వాసములపద్యకావ్యమును రచి యించి, ధర్మయామాత్యునిప్రేరణముచే శ్రీరామునకంకిత మొనర్చెను. ఈతఁడు తనవంశమును దనమాతామహవంశము నీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీరామపాదరాజీవసేవాలోలు
　　　　వశగతమధురిమావాగ్విశాలు
మహీతలప్రస్తూయమానభార్గవగోత్రు
　　　　సురుచిరాపస్తంబసూత్రుఁ బాత్రుఁ
జంద్రప్రధానేంద్రు శరణమంత్రికుమారు
　　　　ధారుణీమతకవితావిహారు
నాగమాంబాగర్భసాగరాత్రితనూజు
　　　　దీనార్తరక్షణదివ్యతేజు

గీ. సూరధీనిధి యనుజాతు శుభసమేతుఁ
జంద్రినార్యాగ్రిజనుగురుచరణభజను
బంధుఫలవల్లి తామరపల్లితిమ్మ
కవిశిఖామణి నన్నెంచి గారవించి.

సీ. బహుపురాణగ్రంథపఠనార్థకరణాతి
శూరుండు మాయన్న సూరమంత్రి
మహితసభాభిరామాముఖకావ్యంబు
ధరనిల్పె మాతండ్రి శరణమంత్రి
తగవరియై యన్నదానంబు చేయుచు
వెలసె మా పెదతండ్రి విస్సమంత్రి
వేదపర్వమ్మన వినుతులు గాంచెను
సరసుండు మాతాత చంద్రమంత్రి

గీ. ప్రౌఢరాయల మెప్పించి రాయసములు
పైఁడిగంటంబు గొనివ్రాసి భద్రలీలఁ
బైఁడిగంటమువా రనుపద్దుఁ దెచ్చి
యల రె మాతాతముత్తాత యబ్బమంత్రి.

సీ. పుష్పలింగేశ్వరపూజానిరంతర
సంగతైశ్వర్యుండు లింగఘనుఁడు
గోపాలవరదయాకలితాన్నదానాది
గుణపట్టభద్రుండు గోపశౌరి
యనఘుండు పెదజగ్గనాయనతమ్ముండు
సత్యసంధుఁడు పినజగ్గవిభుఁడు
శ్రీరామపదపద్మసేవాధురంధర
హృదయాంబుజసంభవుఁ డెల్లమంత్రి

గీ. కాస్యపసగోత్రసురరాజు కామరాజు
వీరువారనకుండ వల్లూరునీడు

తల్లిపుట్టింటివారెల్ల ధన్యులెన్నఁ
దరమె వారలఁ దిమ్మనప్రధానవర్య!

క. మిత్రజనవనజమిత్రుఁ బ
వితుని వల్లూరిజగ్గవిభు కొండవదా
హితుని శరణామాత్యుని
పుత్రుని నినుఁ దిమ్మనార్య! పొగడం దరమే!

గీ. పైఁడిగంటమువారు నాఁ బ్రబలె వెన్నె
నంతఁ దామరపల్లెవారనఁగ నలరి
కుందనముమీఁదఁ బరిమళ మొందినట్లు
తిమ్మయామాత్య నీకుల మెమ్మెఁ గాంచె.

పై పద్యములనుబట్టి కవిముత్తాతకుఁ దాతయైన అబ్బయమంత్రి, ప్రౌఢ రాయలయొద్ద వ్రాయసకాఁడుగా నుండి బంగారపుగంటమును బహుమతినందెననియు నప్పటినుండియు వీరు 'పైడిగంటము' అను గృహనామమును గలిగియుండి, తరువాత తామరపల్లివారైరనియుఁ దెలియుచున్నది. తామరపల్లియను గ్రామమును నివాసముగాఁ గలిగియుండుటచే, తామరపల్లి యను గృహనామము కలిగియుండవచ్చును. తూర్పుగోదావరి మండలమునందలి రామచంద్రపురంముతాలూకాలో తామరపల్లియనుగ్రామమును, వల్లూరనుగ్రామమునుగూడ నున్నవి. కాని తామరపల్లిలో తామరపల్లివారును లేరు వల్లూరునందు వల్లూరువారును లేరు. ప్రౌఢరాయలనఁగా, కర్ణాటరాజ్యమును బరిపాలించిన ప్రౌఢ దేవరాయలనియే యూహింపఁదగియున్నది. ఈతఁడు క్రీ. శ. ౧౪౨౩ మొదలు ౧౪౪౦ సం॥ వఱకును కర్ణాటరాజ్యమునుబరిపాలించినవాఁడు. కావునఅబ్బయమంత్రియాకాలమువాఁడనుటనిశ్చయము.తిమ్మయకవి,అబ్బయమంత్రి కాఱవతరమువాఁడు కావున నాతఁడు క్రీ.శ. ౧౬౦౦ సంవత్సరప్రాంతమున నుండియుండునని యూహింపవచ్చును. బ్ర.శ్రీ. వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రములో "ఇతఁడుండిన కాలమేదియో తెలియదు. నూఱుసంవత్సరములక్రిందట నుండియుండును.

ఇతని కావ్యము నంకపప్రయోగములు కొన్ని గలవు కాని కవిత్వము మొత్తముమీఁద చక్కనిధారకలదయి శ్రావ్యముగానుండును అని వ్రాసియున్నారు." ఈకవి నూఱుసంవత్సరములక్రిందటివాఁ డని చెప్పుట కాధారములు లేవు. కృతిపతినిబట్టిచూచినను, ఈతఁడు మూఁడువందల సంవత్సరములక్రిందటివాఁడనియే తోఁచుచున్నది.

ఈ కావ్యము పెదధర్మయామాత్యుని ప్రేరణముచే రచియింపఁబడినదని పైనివ్రాసియున్నాఁడను. ఈధర్మయామాత్యుని వంశమును గవి యించుమించుగ నెనుబది పద్యములలో వర్ణించియున్నాఁడు. కాని, యందుఁ చరిత్రకుపయోగించునట్టి వొకటిరెండింటికంటె నెక్కువగా లేవు. కృతిపతిని నీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీరామభద్రదాక్షిణ్యగణ్యకటాక్ష
వీక్షణార్జితపుణ్యలక్షణుండు
కానీనభేనసంతానచింతామణీ
దానావధానవిద్యాధనుండు
భూభువనావనప్రాభవ భవకళా
శోభమానానేకవైభవుండు
సురసింధుసైంధవతరుగంధసింధుర
బంధురకీర్తిధురంధరుండు
గీ. చోళనేపాళ కేరళ గౌళమాళ
వాంగ కళింగ కుళింగ సింధు
చోట కర్ణాట లాట మరాట మగధ
మంత్రికులహేళి ధర్మయామాత్యమౌళి.

శబ్దాలంకారముకొరకిన్ని దేశములను బేర్కొన్నను, కృతిపతి ఇందుపురేల' యనుగ్రామమునకుఁ గరణమైన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. ధీమణి యిందుపురేల
గ్రామణి బుధబాంధవాప్తగాయకకవిచిం

తామణి యాశ్రితజనర
క్షామణి పెదధర్మబుధశిఖామణి వెలయున్.

ఈగ్రామము నిజాము రాష్ట్రములోనిదిగాఁ దోచుచున్నది. కృతిపతి మహారాష్ట్రదేశమునుండి యాంధ్రదేశమునకువచ్చి యచ్చట నివాసమేర్పరచుకొనిన మధ్వబ్రాహ్మణుఁడుగాఁ దోఁచుచున్నాఁడు. ఈకుటుంబము వారారువేలనియోగులతో సంబంధ బాంధవ్యములను నెరపియుండిరి. కృతిపతికి పెదతండ్రి మనుమఁడైన నారాయణరావు మహమ్మదు పాదుషాయొద్ద 'మజుమ్‌దారు'గానున్న ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. ఏమంత్రిసౌందర్యమింద్రనందన
నందనాత్మజులసైఁ బొందఁ బంచు
నేమంత్రిసత్కీర్తి యిభరాజమృగరాజ
శరరాజకాంతుల సవరణించు
నేమంత్రియైశ్వర్య మీశాలకాధీశ
కౌరవేశస్ఫూర్తి గౌరవించు
నేమంత్రవితరణం బింద్రమణీనభో
మణిభవభవశిరోమణులమించు

గీ. నతఁడు లక్ష్మీశచరణసేవాధికుండు
ప్రబలసుల్తాన్మహమ్మదుపాదుషాయి
మహితసామ్రాజ్యవైభవమజుముదారు
రాయవేళి నారాయణరాయమౌళి.

ఈనారాయణరావును గ్రంథకర్త వర్ణించియుండుటచే, నీతఁడును గృతిపతియు సమకాలికులనియు, కృతిరచనము నారాయణరావు కాలములో జరిగినదనియు స్పష్టమగుచున్నది. ఇబ్రహీం మూఁడవ కుమారుఁడైన మహమ్మదు కుతుబ్‌షా గోలకొండ రాజ్యమును క్రీ. శ. ౧౫౮౦ మొదలు ౧౬౧౧ వఱకుఁ బరిపాలించినట్లు చరిత్రకారులు

చెప్పుచున్నారు కావున నీకవి ౧౬౦౦ సంవత్సర ప్రాంతమున నీ కావ్యమును రచించెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

సంస్కృతమునందున్న హరివంశమునందలి యాశ్వమేధికపర్వమునందుఁగల శేషధర్మముల నీతఁడు తెలిగించెను. శేషధర్మములను, ఈతఁడే కాకుండ, వెణుతురుబల్లి విశ్వనాథకవి మొదలుగా మఱికొందఱు గాంధ్రీకరించియున్నారు. భారతయుద్ధమునకుఁ బూర్వము శ్రీకృష్ణుఁడు ధర్మరాజును భీష్మునొద్దకుఁ దీసికొనివచ్చి ధర్మములను బోధించుమని చెప్పెను. గోదాన భూదాన అన్నదాన కన్యాదానాదులవలనఁ గలుగు ఫలితములు, కావేరి, కాంచి, మొదలుగా పుణ్యనదీస్థలమాహాత్మ్యములు, ఇంకననేకధర్మములు, ఉపాఖ్యానములతోఁగూడ భీష్ముఁడు ధర్మజునకు బోధించినట్లిందుఁ జెప్పఁబడినది.

ఈకవి కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. వృత్తులు హెచ్చు లేవు పృథివీపతు లీయరు మూలవిత్తము
ల్వ్రత్తుగ వెచ్చపెట్టిటిలిని నెక్కడఁ జూచినఁ గాసుగానరా
దిత్తడిరాగి బంగరువు నిప్పటియప్పులకైనఁ జాల దీ
నెత్తురుగందు లేమిగొని నిల్చెదురో తమప్రాణవాయువుల్. ౩ ఆ.

ఉ. సేమమె కృష్ణ! మీకుయదుసింహను రాముఁడు లెస్సయున్నవాఁ
డేమటి వృష్ణిభోజులకు తేవిరొ రుక్మిణి సత్యభామయుం
బ్రేమభజింతురే సుతులు పెంపువహింతురె వైరిభూపతుల్
నేమముతోడ నెల్లపుడు నీపదపద్మము లాశ్రయింతురే ౧ ఆ.

చ. పులిగిలిపందిగిందిమనుబోతులు గీతులు లేవు కానలో
వలసినయట్లుతిరిగవచ్చును గట్టెలుఁ గందమూలముల్
ఫలములుగొంచు నొండొరులఁ బాయకవేచను దెండు మీరుద
ర్భలును విరుల్సమిత్తులునపారము దెచ్చెద నంతలోపలన్. ౨ ఆ.

ఉ. ఆపురి చెంత దివ్యమణిహాటకకుంభశతాకులంబు ము
క్తాపరిణద్ధతోరణవితానము దివ్యనదీయుతాంబ రో

ద్దీపక పార్శ్వప్రహారవ ణిదీధితిమఞ్జరి నీలవిస్ఫుర
ద్గోపురమై చెలంగు నొకకోవెలఁ గాంచిప్రమోదమొందు చుఁ గా. ౧౪

సీ. హరినామసంకీర్తనార్చన వందన
 పఠనసేవారతుల్భాగవతులు
వేదశాస్త్రపురాణ వివిధేతిహాసాది
 బహుళకథాభిజ్ఞులు భాగవతులు
దేవగురుద్విజదీనమాతాపితృ
 బంధుతోషణరతుల్భాగవతులు
పరమపదధ్యానపారీణతాస్వాంత
 పరమపుణ్యోదయుల్భాగవతులు

గీ. భానుసూక్తపరాయణుల్భాగవతులు
పావకార్చననియతులు భాగవతులు
పరహితాచారకర్తలు భాగవతులు
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులుభాగవతులు.

## 218 పరమానందయతి.



ఇతఁడు శివజ్ఞానమంజరి యనుద్విపదకావ్యమును ఉపదేశక్రియ మనువచనకావ్యమును ఉత్తరాగీతకు వ్యాఖ్యయు, దత్తాత్రేయ, సంపగి మన్న, పరమానంద, గోపాలశతకములను అనుభవదర్పణము, ముక్తి కాంతాపరిణయము, బ్రహ్మవిద్యాసుధార్ణవము, వివేకచింతామణి యను గ్రంథములను రచియించినట్లు తెలియుచున్నది. ఇతనినివాసము గాని, కాలము గాని, పూర్వాశ్రమమందలినామము గాని తెలియరాలేదు. వేదాంతశాస్త్రమునం దనుభవము గడించినయోగి యగునీతఁడు తన

యనుభవజ్ఞానమును బోధసేయునుద్దేశముతో గ్రంథరచనము చేసెను. వ్యాకరణదోషము లచ్చటచ్చటఁ గన్పట్టుచున్నను నీతనికవిత్వము మృదువై సుబోధకమై యలరారుచున్నది.

ఈతఁడు దత్తాత్రేయమంత్రోపాసకుఁడును, దత్తాత్రేయయోగి శిష్యుఁడు నైన ట్లీక్రిందిగద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

క. పరమానందయతీంద్రుఁడ
స్థిరదత్తాత్రేయగురునిశిష్యుఁడ యోగ
స్ఫురణానుభవుఁడ నీకృతి
సరసన్ రచియించినాఁడ సర్వజ్ఞుఁడనై.

ఉపదేశక్రమము

ద్విపద. నాపాలిదేవుని నాగురునాథు
నాపాలిపెన్నిధి నన్నేలువేల్పు
నొానర దత్తాత్రేయయోగిపుంగవుని
మనసున వాక్కున మఱికాయమునను
భావించి నుతియించి భక్తిని మించి
సేవించి పూజించి చెన్నువహించి
అతిముదంబునను పరమానందతీర్థ
యతినామధేయుఁడ నింపు దలిర్ప
మహితశివజ్ఞానమంజరి యనఁగ
మహిలోన ప్రాజ్ఞసమ్మతిగాఁగఁ బూని
రచియించెదను లోకరక్షణార్థముగ
పరిచురంబుగా నాంధ్రభాషను బూని
సిద్ధానుభూతి సంసిద్ధివహించు
సిద్ధులు లోకప్రసిద్ధుల నెమ్మి
మున్ను జేసినయట్టి ముఖ్యశాస్త్రంబు

లన్నియుఁ జూచి నేనంజలియిడ్డ
భావమెల్లను దేటపఱచెదఁ బ్రోద్ధి.

* * *

అనువు మీఱఁగ దత్తాత్రేయగురుని
యనుఁగుశిష్యుఁడు పరమానందదీర్థు
లొనరించె నీకృతి నుత్సాహలీల
వినినంతన పరోక్షవిజ్ఞాన మొదవు
వఱియు శివజ్ఞానమంజరి యనఁగఁ
గర మొప్పు జగతి విఖ్యాతి గాఁగఁ
పరమయోగీంద్రులు భళియంచుం బొగడ
ధరలోన నాచంద్రతారార్కముగను ... ...

శివజ్ఞానమంజరి.

ఈతనికి పరమానందతీర్థులనియు, పరమానందతీర్థమతియనియు నామాంతరము లున్నట్లు పై గద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

సంపఁగిమన్నశతకము:— "సంపగిమన్నా" యనుమకుటముతో 122 కందపద్యములుగల యీశతకము వేదాంతవిషయమును బోధించు నట్టిదిగా నున్నది. హఠయోగమువలనఁ బ్రయోజనము లే దనియు, నాత్మసంయోగాభ్యాసము శ్రేయోదాయక మనియు, కపటగురువుల నాశ్రయింపఁ జనదనియు నిందుబోధించినాఁడు. సంపఁడిమన్నఁ డొక దేవుఁడు. ఆదేవుని సంబోధించుచు నీయతి యీశతకమును వ్రాసెను. ఈదేవుఁ డెచ్చట నుండెనో తెలియరాలేదు.

మచ్చుపద్యములు:—

క. చలపట్టియు హఠయోగముఁ
దలపెట్టిక వట్టిగొడ్డుతాఁకట్టింతే
యలసిద్ధి దొరక దడియా
సలుగా కిందేమియున్నె సంపఁగిమన్నా ౨౮

క. సంతత యోగానంద సదా
సంతసుఖాంబోధి నలరు నాతనిభాగ్యం
బింతంతనఁ దరమా ఘన
సంతోషము జగతి నెన్న సంపఁగిమన్నా ౭౫

క. నేరనిగురుబోధలు సం
సారములై కూనలమ్మ సంకీర్తనలై
దూరములై ముక్తికి
నిస్సారములై పోవు నన్న సంపఁగిమన్నా ౩౮

క. సంకల్ప మడిఁగి తాని
స్సంకల్పుం డైనఁజాలు సద్గతి తడవా
సంకల్పమె బంధము ని
స్సంకల్పమె మోక్ష మెన్న సంపఁగిమన్నా ౧౦౮

క. నిత్యానిత్యవివేకము
నత్యనుపమశీలుఁ డెఱుఁగు నాతఁడు సుజన
స్తుత్యుఁడు జీవన్ముక్తుఁడు
సత్యం బిది వినఁగదన్న సంపగిమన్నా ౧౧౩

శివముకుందశతకము:- దీనికి పరమానందశతకమనినామాంతరము. "శివముకుంద పరమానందా" యనుమకుటముతో 111 కందపద్యములు గలయీశతకమున "బ్రహ్మజ్ఞాన ముపదేసింపఁబడినది. శివకేశవులకు భేదము లేదని తెల్పుటకై "శివముకుంద పరమానందా" యనుమకుట ముతో నీశతకమును రచియించినాఁడు.

శైలిఁజూపుటకుఁ గొన్నిపద్యముల నిచ్చుచుంటిని.

క. దైవము లిద్దఱు నేకో
దేవాదిశ్రుతులవలనఁ దెలియఁగ నొకటే
భావించెద మిము నేకీ
భావంబుగ శివ ౨

క. పరమానందయతీంద్రుఁడ
సురుచిరముగ నిచ్చు వాక్ప్రసూనంబులచేఁ
గరమర్థిఁ బూజచేసెద
పరమాత్మా! ౪

క. ఎఱిఁగిన యది జడిమం బగు
నెఱుకవిడఁ శూన్యమగును నెఱుకే యెఱుకై
నిరతిశయానందం బగు
పరమాత్మా! ౧౫

క. తలఁపునఁ గలిగినబంధము
తలఁపున నూడంగఁ గొట్టి తా నించవలెఁ
మెలు ముంటఁ బుచ్చువిధమున
బలిబంధన ౨౪

క. జ్ఞానం బన యోగం బనఁ
గానఁగవలె నొకటి కొకటి కావడికుండల్
పూనిక నొక్కట నిలువదు
భానుమతా! ౧౧

శ్రీమహావిష్ణువుయొక్క యిరువదియొక అవతారములలో దత్తాత్రేయ యవతారమొకటి ఈపరమానందయతిగురు వాయవతారము కాదు. దత్తాత్రేయయోగి యను నొకమానవుఁ డీతనిగురువు. ఆయవతారమునుబట్టి యాయోగి కీపేరువచ్చియుండును.

నెల్లూరునుండి చెన్నపట్టణమునకుఁ బోవురోడ్డుప్రక్కను నెల్లూరుసమీపమున నొకశిలాశాసనముకలదు. దానిపై నీక్రింది మాటలున్నవి. "శ్రీమద్విశ్వాధిష్ఠాపన పరమహంస సద్గురు దత్తాత్రేయ స్వాములవారి ధర్మమఠం"

నెల్లూరుమండలశాసనములను బరిశోధించిన బట్టరువర్తుపండితులును, వేణుగోపాలసెట్టిగారును ఈశాసనమునకు నీక్రిందిరీతిగ నింగ్లీషు భాషాంతరీకరణము నిచ్చియున్నారు.

"The charitable matham of the illustrious Dattatreyaswami, who presides over the whole universe, who is a Paramahamsa, the excellant guru.

Note.— There was doubtless a matham of a guru near this stone.

Paramahamsa is the title by a Hindu Sanyasi after a certain stage in his spiritual progress."

(నె. శా. సం. పుటలు 821–822)

దీనినిబట్టి దత్తాత్రేయుఁ డనుయోగిపుంగవుఁడొకఁడు నెల్లూరు ప్రాంతమున నొకమఠమును స్థాపించి, భక్తిజ్ఞానముల నుపదేశించుచుఁ గొందఱుశిష్యులను సంపాదించి వారికిఁ గవిత్వవిద్యను నేర్పి లోకోపకారమునకై ప్రయత్నించినట్లు కన్పట్టుచున్నది. ఈయోగిపుంగవుని కాలమేదియో తెలియరాలేదు. తరిగొప్పుల మల్లనకవి, యీపరమానందయతి, మొదలగువారు కొందఱు తాము దత్తాత్రేయ యోగిపుంగవుల శిష్యులమని వ్రాసికొనియున్నారు. ఇందు తరిగొప్పుల మల్లన కవి క్రీ. శ. ౧౫౮౬—౧౬౧౩ వఱకుఁ గర్ణాటరాజ్యమును బరిపాలించిన వెంకటపతిరాయలయాస్థానకవి యగుటచే దత్తాత్రేయ యోగపుంగవుఁడును నాతనిశిష్యప్రశిష్యులును పదునాఱవ శతాబ్దియం దుత్తరార్ధమున నున్నవారని నిశ్చయించుటకు సంశయింప నవసరముండదు. దత్తాత్రేయయోగికి ధేనువుకొండ తిమ్మయార్యుఁ డొకశిష్యుఁడు. ఆతిమ్మయార్యునకుఁ జింతలలింగావధానులు, ముమ్మడి మల్లన, కంభంపాటి నారపామాత్యుఁడు అనునారు శిష్యులు. ఇందుఁ గడపటియిరువురును నాంధ్రగ్రంథకర్తలు. వీరిచారిత్రముల నిందు వేఱుగ వ్రాయుచున్నాఁడను ఈచింతల లింగావధానులకు సదానందుడను నొకయవధూత శిష్యుఁడుగానుండి యొకగ్రంథమును రచియించెను.

ఈదత్తాత్రేయ యోగిపుంగవుని శిష్యపరంపరను కంభంపాటి నారయామాత్యుని చారిత్రమున నుదాహరణ పూర్వకముగఁ దెలిపియున్నాఁడను. పితృపితామహాది వంశపరంపరవలె శిష్యపరంపరకు

కాలవ్యవధి యుండనక్కఱలేదు. శిష్యప్రశిష్యు లేక కాలమున నేనుండుట కవకాశమున్నది.

ఈపరమానందయతీంద్రుఁడు రచించిన బ్రహ్మవిద్యాసుధార్ణవము పదుమూఁడు ప్రకరణములు. ఆంధ్రవచనమున వ్యావహారిక భాషలో నున్నది. ఈక్రిందివచనమువలన శైలియును గ్రంథరచనోద్దేశమును దెలియుచున్నవి. ఇది ముద్రితము కాలేదు. తాళపత్రప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ గలదు.

శ్రీమద్దత్తాత్రేయగురుచరణసరోజ మత్తమధుకరాయమానులై విమలతత్త్వార్థరహస్యవేత్తలైన పరమానందతీర్థులు సమస్తలోకోపకారార్థంగానున్ను వేదాంతరహస్యగ్రంథము రచియింప నిశ్చయించి యావదాయుస్త్రయోవర్ణావసరం కించిత్కార్యమాది నామనాగపి" అనేడి శాస్త్రాలు కలుగబట్టిన్ని ప్రాకృతముముక్షువులయొక్క సంశయనివృత్తి కోఱకున్ను సకలవేదాంతసిద్ధాంత స్మృతీతిహాస పురాణాగమాది తత్త్వశాస్త్రాల చేతనున్ను లౌకికోక్తులచేతనున్ను శ్రీమద్దత్తాత్రేయగురుకృపాలబ్ధ స్వానుభవంవల్లనున్ను పరమానందమగ్నచిత్తుండనై ఒక అనుభవ గ్రంథం రచియింప నిశ్చయింస్తిని. అయితే అనుభవం వాక్కునను చర్చింప శక్యమూనా అంటేశక్యమే కాదు సత్యంఅయినాగాని చెఱువునిండి పూర్ణమైతే అలుగు పాఱినట్లునాయందు నిండిన సచ్చిదానందమే బహిః ప్రసారియై లోకులకుఉపకరిస్తున్నది. అలుగులకున్ను మడుగులకున్ను పారిన ఉదకాలుసమస్తమైన సస్యాదులకున్ను ఉపకరించినట్లే ఉపకరింస్తున్నది.

ఈగ్రంథాంతశ్లోకములవలన నీగ్రంథము పదుమూఁడు ప్రకరణము లయినట్లు తెలియుచున్నది.

శ్లో. పరమానందయతీంద్రో
స్స్వాన్తైర్వ్యప్తాత్రయోదశ ప్రకరణకా
ఆరవితారకమేషా
టీకా భువి చిత్ప్రకాశికా జయతు.

గద్య:- ఇది శ్రీమత్పరమపరివ్రాజకాచార్యవర్య పరమానంద తీర్థయతి కృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే జీవన్ముక్తౌ పంచప్రయోజననిరూపణం నామ త్రయోదశ ప్రకరణం సమాప్తమ్.

దత్తాత్రేయ యోగిశిష్యులును ప్రశిష్యులును మతప్రబోధకములగు గ్రంథములను పెక్కింటిని రచియించియున్నవారు. అందీపరమానందయతిమిగుల గొప్పవాఁడు.

---

# 219 తరిగొప్పుల మల్లన్న



ఈతఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడు; మధ్వమతాభిమాని. నరసనామాత్య తిప్పమాంబలకుఁ బుత్త్రుఁడు; మల్లనామాత్య నాగమాంబలకుఁ బౌత్త్రుఁడు; దత్తాత్రేయయోగీంద్రశిష్యుఁడు.

ఈకవి చంద్రభానుచరిత్ర మను నైదాశ్వాసముల యుత్తమ ప్రబంధమును రచియించి తనయిష్టదేవతయగు దత్తాత్రేయమూర్తి కంకితము చేసెను. ఈతఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడైన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

శా. శ్రీవిద్యావిభవాస్పదం బయిన యార్వేలాన్వవాయంబునన్
బావిత్ర్యాభినుతస్వతంత్రకపిసన్మౌనీంద్రగోత్రుల్ ధరా
దేవోత్తంసులు మించి రందు బెడఁగొందెన్ భూజనశ్రేణి సం
భావింపం దరిగొప్పులాంకుఁడగు శ్రీమల్లప్రధానుండిలన్.

ఈకవి యేగోత్రమువాఁ డనువిషయమున సంశయము గలుగుచున్నది. ముద్రితప్రతిలో "స్వతంత్రకపిసన్మౌనీంద్రగోత్రుఁ" డైనట్లున్నది. ముద్రితప్రతికి పీఠికవ్రాసిన విద్వాన్ కట్టిసాంబమూర్తి శాస్త్రిగారు పీఠికలో "స్వతంత్రకపిస" గోత్రుఁడని వ్రాసియున్నారు. ఈ రెండు నొకటియే. బ్రాహ్మణులలో నిట్టిగోత్రముగలవారున్నారా? యని

సంశయము. చంద్రభాను చరిత్రయముద్రితప్రతిలో "స్వతంత్రకవిసన్మా సీందరిగోత్రుల్" అనియున్నది. "స్వతంత్రకపిస" గోత్రులుండినమండ వచ్చును.

కృష్ణామండలములో బెజవాడనుండి బందరునకు బోవు రైలుమార్గమున "తరిగొప్పుల"యను గ్రామమున్నది. దానినిబట్టి వీరికిగృహనామము వచ్చియుండుననియూహకలుగును. కానిరాయలసీమలోనేయొక తరిగొప్పులయున్నదని వినుచున్నాఁడను. కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకాలో నొకతరిగొప్పులయున్నది. ఇదియే కవినివాసమని తలంపవలయును. ఈకవికి, అప్పమంత్రి దత్తాత్రేయమంత్రి యను నిరువురగ్రజులున్న ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. అత్రిప్రాభవుఁ డాన్నృసింహుఁ డనసూయాత్యంతసంస్తుత్యచా
రిత్రశ్రీనిధి తిప్పమాంబవలనం బ్రీతిన్ బుధానీకని
త్యత్రాణైకధురీణు నప్పవిభు నేత్రానంద పూర్ణేందు ద
త్తాత్రేయాహ్వయు మల్లికార్జునుని నార్యాసక్తుఁ గాంచె న్మహిన్

ఇందులో దత్తాత్రేయమంత్రి వెంకటపతి రాయలయొద్ద వ్రాయసకాఁడుగా నుండి యాతనిచేత మన్నన లందుచున్న ట్లీక్రిందిపద్యముల వలనఁ దెలియుచున్నది.

సీ. వర్ణంబులనెకాదు వరవృత్తతాస్ఫూర్తి
సన్నుతోభయవంశజులయందుఁ
బత్రంబులనెకాదు పంక్తిశోభసమాప్ర
దీయమానాన్నభుగ్ద్విజులయందు
వాచికోక్తినెకాదు సూచితార్థబహుత్వ
మతులసత్కవిబుధాశ్రితులయందు
విఖనక్రియనెకాదు లీలాసుభానసం
బానతారాతిప్రధానులందు
బొరయఁ దిర్మలరాయేంద్రభూరిపుణ్య
రాశి యగు వేంకటోర్వీశు వ్రాయసములు

వ్రాయుచాతుర్యమున నిజస్వామిహితవి
ధానసుకరమంత్రి నరసయదత్తమంత్రి.

మ. అరుదార న్వరపత్రవృత్తయయి దత్తాత్రేయసంస్పర్శనా
దరయోగోన్నతిఁ గన్నలేఖిని మహాగర్వాంధసామ్రాజ్యసం
హరణం బున్నతరాజ్యసంభృతియు ద్వీపాంతరస్వప్రాకర్షణ
స్ఫురణంబుల్ బహుదేశవస్తుభరణంబుం గాంచు నంచద్గతిన్.

సీ. యాదవాగ్రజుని పటాటోపమెల్ల
గౌరీవరు సుగ్రీవభావమెల్లఁ
గుముదాప్తమండలక్రమణచిహ్నం బెల్ల
నుడుపరంపరనుండు నునికి యెల్ల
సిరిఁగన్నతండ్రి యాంతరమెల్లఁ బలుకుల
కొమ్మయుఁ దలయెత్తికొనుట యెల్ల
శేషపన్నగము నుశ్లేషవైఖరియెల్లఁ
జదలుమ్రాని కడింది చాయయెల్ల

నగి తెగడి మీఱి కేరి తృణం బొనర్చి
యడఁబి కారించి వారించి యడరు నేవి
వేకనిధికీర్తి యతఁడొప్పు వేంకటేంద్ర
దత్తసామ్రాజ్యవిభవుండు దత్తమంత్రి.

మ. ఘనగోత్రోద్ధరణం బసంఖ్యసుకవిగ్రామప్రదానైక సా
ధనసద్భావధురంధరత్వము మహోదర్పోద్ధతారిప్రధా
ననిరాసోద్భటపాటవంబు నిరవాందన్ దత్తనార్యుండు శ్రీఁ
దనరు న్వేంకటరాయదక్షిణభుజాదండా విశేషస్థితిన్.

ఈదత్తమంత్రికి సోదరుఁ డైనమల్లనకవి, వెంకటపతిరాయల యాస్థానముననే రాయసములువ్రాయు లేఖరిగను కవిగనుగూడ నుండి తదాస్థాన ప్రజలచే మెప్పువడసిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

క. ఆదత్తమంత్రియనుజుఁడ
శ్రీదత్తాత్రేయ యోగిశేఖరసేవా
మోదితుఁడ సుధారసధా
మోదితుఁడ న్మధ్వమునిమతోద్ధారకుఁడౌ.

సీ. వరగంధచర్చికల్ వ్యాగ్విస్తరమచర్చి
కలు సూరిహృదయభాగములఁగూర్చుఁ
గర్పూరమయవీటికవనాశుపదధాటి
కలురసజ్ఞసుహృన్ముఖములఁ జేర్చు
నతిచిత్రనేత్రముల్ యమకాదిచిత్రము
ల్మాశ్రిస్యసత్కవిజనాత్మల ఘటించు
మహితసువర్ణము ల్మధురసందర్భవ
ర్ణములు ప్రాజ్ఞమహాశయములనిచ్చు
గండభేరుండబిరుదవిఖ్యాతమతికి
రాయసముమల్లనికిఁ గవిరాయనికిని
మహిని గవిమానులును మంత్రిమాత్రులును స
మానమే యన వెలసిన మానఘనుఁడ

ఉ. నాకుపకర్త నాకుఁ జెవి నాకు సహాయుఁడు నాకుఁ బ్రాపిల
న్నాకు బహుప్రదుం డనిమనంబున వేంకటరాట్సభాజనా
నీకము సంస్మరింప మహనీయగుణోన్నతిఁ గన్నయుత్తమ
శ్లోకుఁడ మల్లనాహ్వయుఁడ సువ్రతు మత్కృతినాథు నెన్నెదౌ.

ఈకవి కాశ్రయదాత యగు వెంకటపతిరాయలను నాలుగైదు పద్యములలోఁ గవి యిందు వర్ణించియున్నాఁడు. అందొక్కపద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

గీ. కోరి కన్నుల నొత్తికొనుఁ బలితాభోగి
యెదనుంచు సకలకళేశ్వరుండు
శిరమునఁ దాల్చుభాషితదేవి యడుగెడఁ
బాయంగనీఁడు కల్కకగురుండు

పూనునుత్కటమైత్రి బుధకుంజరముముఖం
బున నుండఁజూపు సత్ప్రసంగవుండు
కంఠభూషణముగాఁ గావించు సర్వజ్ఞుఁ
డంక మొందించు శేషాంశజాతుఁ
డెట్టియుత్కరవిఖ్యాతి నెనసెనో యు
ఖండజయ మూరురాయరగండబిరుద
వీరతిరుమలరాయ పృథ్వీతలేంద్ర
తనయుఁ డగు వేంకటక్ష్మాధవునికీర్తి.

వసుచరిత్ర కృతిపతియగు తిరుమలరాయని కుమారుఁడే యీ వెంకటపతిరాయలు. ఇతఁడు శాలివాహనశకము ౧౫౮౬ మొదలు ౧౬౧౩ వఱకును కర్ణాటరాజ్యమును బరిపాలించినవాఁడు కావున మల్లనకవియు నాకాలమున నుండినవాఁ డనుటకు సందియము లేదు.

శ్రీకృష్ణునకు సత్యభామయందు కలిగినచంద్రభానునకును, రుక్మిణి సోదరుఁడైన రుక్మబాహుని తనయ కుముదినికిని జరిగిన పరిణయకథ యిందు వర్ణింపఁబడినది. రుక్మిణీ సత్యభామా కుమారులకుఁ గయ్యము గల్పింపవలయునను నుద్దేశముతో నారదుఁడు చేసిన ప్రయత్నమును కథాబీజముగాఁబెట్టి విచిత్రమైన యితివృత్తముతో మనోహరముగాఁ బ్రౌఢశైలిని రసవంతమైన ప్రబంధమును కవి రచించి కృతకృత్యుఁ డయ్యెను. అప్పకవి, యీగ్రంథములోని

"ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహారరతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వఁ జంచదళిశింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్"

అనుపద్యమును చంద్రికాపరిణయములోనిదని యుదాహరించినాఁడు. దానినిబట్టియే కాఁబోలు శ్రీవీరేశలింగముపంతులుగారు కవుల చరిత్రములో నీపద్యమును ఎలకూచి బాలసరస్వతిచంద్రికాపరిణయము లోనిదని యుదాహరించియున్నారు. చంద్రికాపరిణయములో భీముడు

కాశిరాజు తనయను బరిణయమైన కథ వర్ణింపఁబడినది. అందు రస్నె బాహువసుధాధిపనందనయొక్క ప్రసక్తి రాఁబని లేదు. ఈపద్యము చంద్రభానుని చరిత్రములోనిదే అప్పకవి గ్రంథనామమును వ్రాయుట పొరపాటు దానినిబట్టి పంతులుగారును పొరపడియుందురు.

ఈతనికవితాశైలి తెలియుటకై యైదాశ్వాసముల నుండియు నైదుపద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

ఉ. చక్కెర చింతపండొడిని సందిట నేలకి చద్ది మాళికైఁ
జెక్కినకానుగాకువలచే జలకుండిక వీజనంబువే
లొక్కకరంబునందుఁ బదయుగ్మమునఁ బిగివాళ్లుగల్గిన
ల్దిక్కులనద్దగు ల్బడలి త్రిప్పరి రట్టికడింది యొంకలన్ ౧ఆ.

శా. ఆవృత్తాంత మశేషము న్విబుధలోకాధీశుఁ డేతద్వయ
స్యావాక్యంబుల నాలకించి సురకార్యాపన్న కావేలుపుం
బూవుంబోణికి ధాత్రనామపురీభోగోన్నతు ల్లెంజే
లోవీధిం గరుణించి పంచె శుభగీతు ల్నేర్పఁగాఁ దుంబురుల్. ౨ఆ.

చ. జగములు గెల్వఁగోరి సుమసాయకుఁ డెత్తుపసిండిటెక్కెముల్
మగువకపోలయుగ్మ మనుమానము లేదటు గాకయున్నచో
నగణితకర్ణకుండల సమగ్రమణి ప్రతిబింబదర్పణం
బగుచుఁ జెలంగునే మకరికాంకితమై చెలువంబు సూపునే. ౩ఆ.

మ. కమలాప్తుం డిట బ్రహ్మయై యఖిలముం గల్పింపఁగా నిమ్మహా
ర్థము బ్రహ్మంబనఁ బొల్చునే తదనుసంధానంబు నించు న్విహా
ర్థములంచున్ జనకోటికిం దెలుపుచందం బొప్ప ఘోషించె ద
త్సమయారాధనజాతవాఙ్మహిమ మించం దామ్రచూడౌఘముల్

శా. నారీరత్నము చారుహస్తకమలాంతః కర్ణికాకేసరా
కారంబు ల్గుడజీరకంబు లిడియంగాఁ బట్టి మంజీరముల్
గేరన్ గ్రక్కున నిక్కి భర్తతలపైఁ గేల్సాఁచి నిల్పెన్ "ధ్రువం
తేరాజావరుణోధ్రువ" మ్మనుచు ధాత్రీనిర్జరు ల్పల్కఁగన్. ౫ఆ.

ఈకవి పూర్వులనివాసము తరిగొప్పుల యైయుండునని పైని వ్రాసియున్నాఁడను. ఈకవి వెంకటపతిరాయల యాస్థానమునం దున్న

వాఁడగుటచే నారాయలకు నివాసమైన పట్టణమే యీతనినివాస మని చెప్పనొప్పును. కర్ణాటరాజులకు మొదట విజయనగరము రాజధానిగా నున్నను, అళియరామరాయల యనంతరము విజయనగరము తురుష్కులచే ధ్వంసముచేయబడఁగా తిరుమలరాయలు పెనుగొండను రాజధానిగాఁ జేసికొనియెను. ఆతనియనంతర మాతనితనయుఁడైన శ్రీరంగరాయలు రాజధానిని చిత్తూరుమండలములోనికి మార్చుకొనియెను. ఆతనితరువాత కర్ణాటరాజ్యభారమును వహించిన యీవీర వెంకటపతిరాయలు, ఉత్తరార్కాడుమండలములోని రాయవెల్లూరు అనియిప్పుడు పిలువఁబడుచున్న వేలూరును రాజధానిగాఁ జేసికొనెనని, అందుగుల వెంకయ్య రామరాజీయములో-

"తనకు వేలూరువరరాజధానిగాఁగ, వీరవెంకటపతిరాయ
విభుఁడు మిగుల ధరణిఁ బాలించె ధర్మతత్పరతఁ జెలఁగి"

అని వ్రాసిన పద్యభాగమువలనఁ దెలియుచున్నది. కావున నీకవినివాసము కొంతకాలమైనను రాయవెల్లూరని తలంపవచ్చును.

పైనుదాహరించిన కందపద్యములోఁ గవి "దత్తాత్రేయయోగిశేఖరసేవామోదితుఁడ"నని చెప్పుకొనియున్నాఁడు. దత్తాత్రేయయోగి నిగూర్చి పరమానందయతి కవిచారిత్రమున వ్రాసియున్నాఁడను. ఈ యోగిపుంగవుఁడా కాలమున విశేషప్రఖ్యాతినొందిశిష్యులనేకులనుజేర్చి యద్వైతమతవ్యాప్తిని గావించినట్లు గన్పట్టుచున్నది. దత్తాత్రేయ యోగికాలమేదియో తెలియలేదు. ఈకవికాలము కృతిపతినిబట్టిసునిశ్చయమైనది. కావున నాకాలమందే దత్తాత్రేయయోగి యుండెనని నిశ్చయింపఁదగియున్నది. దత్తాత్రేయయోగి యనునామముతో మఱియొకరాకాలమునఁ గన్పట్టలేదు.

---

# 220 ముమ్మడి మల్లనకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; యజుర్వేది. శాండిల్యగోత్రుఁడు; కృష్ణయ మంత్రికిని రఘుపతమ్మకును బుత్రుఁడు. గంగన్న సర్వాంబలకుఁ బౌత్రుఁడు; కృష్ణామండలములోని కొప్పురావూరు నివాసము.

ఈకవి శ్రీరామస్తవరాజ మను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచియించి శ్రీకృష్ణున కంకితము చేసెను. కవి తనవృత్తాంతము నీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీకరం బైనట్టి కృష్ణానదీ దక్షిణాది
యా నాంధ్రరాజ్యంబునందు
నొప్పైన కొప్పురావూరు రాజధానికి
భోజుఁడౌ ముమ్మడి రాజమంత్రి
సుభగుఁ డాపస్తంబసూత్రి యజుర్వేది
శాండిల్యగోత్రుఁ డాచతురునకును
దనయుండు పెద్దనాతనిసతి జువ్వాంబ
వారికి గంగన్న వరసుతుండు

వానికిల్లాలు సర్వాంబ వారలకును
ఘనుఁడు కృష్ణయప్రభుఁ డనఁగ గలిగి యతఁడు
పేర్మిఁ దుల్లూరి వారాడుబిడ్డ యైన
రఘుపతమ్మను బెండ్లియై రమణ మించె

క. ఆమిథునమునకు ముప్వర
మే ముదయించితిమి యందు మేటగువాఁడన్
రామునిభక్తుఁడ మల్లన
నామాఖ్యాకుండ సజ్జనప్రియరతుఁడన్.

ఈకవి తత్త్వచంద్రోదయ మను వేదాంతగ్రంథమును ద్విపదగా రచియించి శ్రీరామచంద్రున కంకిత మొనర్చినట్లును ధేనువుకొండ తిమ్మయాచార్యు డీకవికి గురువైనట్లును ఈక్రిందివచనములోఁ జెప్పియున్నాఁడు.

“అని యిష్టదేవతాప్రార్థనంబును బరమభాగవత కీర్తనంబును వాల్మీకాది సత్కవి స్తోత్రంబునుం జేసి సర్వజనంబులకుం బ్రియంబు పల్కి మద్గురుం డైన ధేనువుకొండ తిమ్మయాచార్యుం బూజించి శ్రీరామస్తవరాజం బను మంత్రరాజంబుఁ దెనుఁగు సేయఁబూని యేను బాల్యంబున సకలవేదాంతసిద్ధాంతసారసంగ్రహం బైన తత్త్వార్థాంబుల తత్త్వచంద్రోదయం బను ద్విపదకావ్యంబు రచియించి యాతత్త్వచంద్రోదయంబునకు జానకీనాథునాథుంగా నియోగించి సంతసిల్లితి. నిప్పుడీమంత్రరాజం బైన శ్రీరామస్తవరాజం బను నీప్రబంధనాయకరత్నంబునకు సర్వలోకనాథుం డైన శ్రీరుక్మిణీనాథు నాథుంగానియోగించితి.” తత్త్వచంద్రోదయ మిప్పుడెచ్చటను గానవచ్చుట లేదు. శ్రీరామస్తవరాజంబున వ్యాసుఁడు ధర్మరాజునకు శ్రీరామమంత్ర ప్రభావంబును వేదాంతవిషయములును జెప్పినట్లిందుఁ దెలుపఁబడినది. ఇతనికవిత్వము అంతమంచిది కాదు. ఇకారసంధులు మొదలుగా నపప్రయోగములు చాలఁగలవు. అయినను వేదాంతవిషయమును సులభములైన పదములలోఁ జెప్పియుండుటచేఁ బ్రజలలో నీతనిశ్రీరామస్తవరాజమున కెక్కుడాదరము కలదు.

శైలిచూపుటకై మూఁడు పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

శా. సత్సంగంబును నాత్మచింత గురువిశ్వాసంబు వైరాగ్యముల్ గఆ.
వాత్సల్యంబును జిత్తశాంతియును సర్వభ్రాంతిశూన్యత్వముల్
మాత్సర్యంబులు లేకయుండు టివి సన్మార్గంబులో యోగిక
త్యుత్సాహంబునఁ దన్నుఁజెందిహృదయంబుప్పొంగఁ గాబొండవా?

ఉ. ఈవరగర్వము న్విడిచి యీశ్వరునందుఁ బ్రీతిగట్టిగా
భావన నిల్పి యాడుచును బాడుచు శ్రీహరినామకీర్తన

ల్లావుగజేయుచు న్నుజనులం గన నెవ్వఁడు చేరు వానిదే
జీవనము న్వివేకమును సిద్ధము పాండవవంశపావనా... ౨౮.

ఉ. కాయ మనిత్య మఱ్ఱెదెలివి గానక మంత్రలయాదియోగసో
పాయములైన సిద్ధులను బ్రజ్ఞులుగాఁ దలపోసి మూఢులై
మాయల నందువారు నడుమంత్రపుయోగులు గాని ముక్తికిన్
దాయఁగలేరు వీరలకు దంభమె మోక్షము లెంచిచూడఁగన్. ౩౯.

మ. శరణం బెంతపరాకొ! దేవ! యిదిగో సంసారతాపత్రయం
బురుమై వచ్చెను నింక మా కెవరు దిక్కున్నారు? నీవిప్పుడే
మరిన న్నోములు నూఱు నోంట నగుసామ్యంబొ నదెట్లన్న నెం
దరి మఱ్ఱ బ్రోచితో నేడు దబ్బరవి కృష్ణా ఆపదుద్ధారకా!

ఈకవి ఏకాలమువాఁడో తెలిసికొనుటకు గ్రంథమున నాధారములు గన్పింపలేదు. పూర్వకవిస్తుతిలేదు కృతిపతి శ్రీకృష్ణుఁడు కావున గాలనిర్ణయ మసాధ్యమైనది. ఇతఁడు ధేనువుకొండ తిమ్మయాచార్యుని శిష్యుఁడనని చెప్పుకొనియున్నాఁడు.

ఈకవి గృహనామ మేదియో తెలియలేదు. కవి చెప్పలేదు. ఇతని తాతకుఁ దాతయైన రాజమంత్రిని ముమ్మడి రాజమంత్రియని పై సీసపద్యములోఁ జెప్పుటచే నది యింటిపేరుగా భావించి యితనిని ముమ్మడి మల్లనయని పిలుచుచున్నారు. ముమ్మడి యనఁగా మూఁడవ రాజమంత్రియని యర్థమొప్పును. గద్యలోఁగూడ నింటిపేరు చెప్పుకొనలేదు. "ఇది శ్రీరామచంద్ర వరప్రసాదలబ్ధకవితావిలాస శాండిల్య గోత్రపవిత్ర కృష్ణయామాత్యపుత్రవినుతగుణధుర్య మల్లయామాత్య" అని మాత్రమే చెప్పుకొనియున్నాఁడు.

ఇతనిగురు వైనధేనువుకొండ తిమ్మయార్యుఁడు ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఈ తిమ్మయార్యుని గురువు దత్తాత్రేయ యోగి. ఆయోగివర్యునకు పరమానందయతి, తరిగొప్పుల మల్లన మంత్రి మొదలగు మఱికొందఱు కవులు శిష్యులున్నారు. ఈతిమ్మయార్యునకు చింతల లింగావధానులు, ముమ్మడి మల్లనకవి మొదలగు

వారు శిష్యులు. చింతల లింగావధానులకు సదానందావధూత యనుకవి పర్యాయ శిష్యుఁడు.

దత్తాత్రేయయోగివిగూర్చి పరమానందయతి చరిత్రమున వ్రాసి యున్నాఁడను. దానినిబట్టి యీమల్లనకవి క్రీస్తుశకము పదునాఱవ శతాబ్ది నుత్తరార్ధమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును.

మదరాసుప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నీ శ్రీరామ స్తవరాజమున కముద్రితప్రతియొకటి (R. No. 226) కలదు. దాని యందు లేఖరికాలము స్వభాను సంవత్సర కార్తిక శు ౧౩ ఆదివార మనియున్నది. క్రీ. శ. 1823_1643 సంవత్సరములలో వచ్చిన కార్తిక శు ౧౩ లు ఆదివారమేమైనది. లేఖరికాలమిందేదియో నిర్ణయింపఁ జాలము.

ఆభాండాగారముననే వేఱొకప్రతి [R 60 (a)] కలదు. దాని లేఖరి తనకాలమును సాధారణనామ సం॥ ఫాల్గుణ బ ౩౦ జయవార మని వ్రాసికొనినాఁడు. క్రీ. శ. 1911 లో వచ్చిన ఫాల్గుణ బ 30 గురువారమును; 1851 లో వచ్చిన యాతిథి మందవారమును 1791లో వచ్చినది ఆదివారమును; 1731 లో వచ్చిన యాదినము శుక్రవార మును; 1671 (28_2_1671) లో వచ్చిన ఫాల్గుణ బ 30 జయవారము నైనది కావున నావిలేఖరి కాలము 1671 అని నిర్ణయింపవచ్చును. దానిననుసరించి శ్రీరామ స్తవరాజ గ్రంథకర్త యంతకుఁ బూర్వుఁడనుట స్పష్టముకదా!

ఈశ్రీరామస్తవరాజముననకే తంజావూరు పుస్తక భాండాగార మున మూఁడముద్రితప్రతులు కలవు. అందొకదానితుదను (నెం 230) విలేఖరికాల మీరీతిగా నీయబడినది. "ఈప్రతి, లేఖరి కుప్పయ్యమంత్రి చేత శాహాజీ మహారాజుకొఱకు నింబాజీ వ్రాయించెను." శాహాజీ మహారాజు తంజావూరు రాజ్యమును క్రీ. శ. 1684_1710 నడుమ పరి పాలించెను. కావున నీప్రతి యాకాలమున వ్రాయఁబడినది. దీనిని బట్టికూడ నీగ్రంథమంతకుఁ బూర్వము రచియింపఁబడియె ననుట స్పష్టము.

ఈవృత్తాంతములనుబట్టి శ్రీరామ స్తవరాజము క్రీ. శ పదునాఱవ శతాబ్ది నుత్తరార్థమున రచితమయ్యెనని యూహించుటలో విరుద్ధ ముండదు. మదరాసు భాండాగారమున నింకొక తాళపత్రప్రతికలదు. అందీక్రింది రెండుపద్యములు కలవు.

ఉ. శ్రీగిరినాథుసద్వరముచే జనియించితి రాముఁగొల్చితిఁగా
శ్రీగురుతిమ్మనారదుల శిష్యుఁడనై పరమాత్మ తత్త్వ వి
ద్యాగురుమూర్తినై యభయదానము లందితినప్రభవారిచే
యోగరహస్య శాస్త్రములు యుక్తిగఁ జేసితి కృష్ణమీాదయఁగా.

మ. ధరలో సద్గురుసాంప్రదాయుఁ డగు దత్తాత్రేయయోగీంద్రుచే
పరమానందమునీంద్రుఁ డాత్మగురుఁడై బ్రహ్మస్వరూపోపదే
శరమఁగా ధేనువుకొండ తిమ్మనికి నిచ్చున్ మెచ్చుగా నిచ్చె యా
పురుషశ్రేష్ఠుని పూర్ణబోధను జగత్పూజ్యుండనై యుందు ని
ట్లురయన్ ముమ్మడిరాజకృష్ణఘనమల్లా! ముక్తి కాంతాప్రియా?

ఈపద్యములనుబట్టి దత్తాత్రేయయోగికిఁ బరమానందయతి శిష్యు డనియు, నాతనికి ధేనువుకొండ తిమ్మయ శిష్యుఁడనియు, నాతఁడీక వికి గురువనియు స్పష్టమగుటచే నీతనికాలము పదునాఱవశతాబ్దియం దుత్తరార్థమని నిర్ణయింపవచ్చును.

# 221 కంభంపాటి నారపామాత్యుఁడు



ఈకవి భారతభీష్మపర్వమందలి భగవద్గీతలను బద్యకావ్యముగా రచియించి హరిహరనాథునకుఁ గృతి యొసంగెను. ఈగ్రంథము ముద్రింపఁబడలేదు. మ. ప్రా. లి. పు. భాండాగారమునం దొకతాళపత్రప్రతి శిథిలావస్థలో నున్నది. దీనికాంధ్రభగవద్గీతలని పేరు. అమాత్యశబ్దమునుబట్టి యీతఁడు నియోగిబ్రాహ్మణుఁడని యూహింపఁదగియున్నది. కంభంపాటివారు వైదికబ్రాహ్మణులలోను గలరు. వారు శాండిల్యగోత్రులు ఈతఁడు తనవంశావళినంతగా వర్ణించినట్లు గన్పట్టదు గ్రంథాంతగద్యలో గోత్రమునుగాని శాఖనుగాని తండ్రినామమును గాని చెప్పక "ఇది శ్రీమత్సచ్చితానందస్వరూప పరబ్రహ్మవరప్రసాదలబ్ధ కవితావిలాస నారపామాత్యప్రణీతం బైనశ్రీమన్మహాభారతంబున భీష్మపర్వంబున భగవద్గీతలయందుఁ బంచమాశ్వాసము అనియున్నది ఇతనిగురువు రామబ్రహ్మేంద్రుఁడు. అతనిగురువు తిమ్మయ. ఆతిమ్మయ్యకుగురువు యోగానందుఁడు. అతనిగురువు చింతలలింగావధానులు ఆయనగురువు ధేనువుకొండతిమ్మనార్యుఁడు. ఆతిమ్మనార్యునిగురువు దత్తాత్రేయయోగీశ్వరుఁడు. ఈగురుపరంపరను దెలుపుపద్యములను పద్యభాగములను ఆంధ్రభగవద్గీతకృత్యాదినుండి యీక్రిందనుదాహరించుచున్నాఁడను.

సీ. గీ. అట్టిపరమమునీంద్రు పాదములను
గురుతరంబుగ ధేనువుకొండ తిమ్మ
నార్యుఁ డరలేక సేవించి యన్యమైన
తలఁపులను బాసి చిన్మూర్తి నెళవుఁ గనియె.

గీ. మఱియు ధేనువుకొండ తిమ్మన్నపదము
లవుర చింతల లింగావధాను లెపుడు

నిరతమును గొల్చి పరమాత్ము నెల్లవుఁ గాంచి
యవ్యయంబైనచిత్సౌఖ్య మంది పొందె.

సీ. అవుర చింతలలింగనార్యు పాదాబ్జముల్
గగన యోగానంద గురువరుండు
స్థిరచిత్తుఁడై కొల్చి......

క. ఆయోగానందుని పద
మే యెప్పుడుఁ దివ్యగురుఁడు మిక్కిలి గొల్చెన్.

ఉ. అట్టిమహానుభావుని పదాబ్జము లెప్పుడు నాత్మలోపలన్
పట్టుగ నిల్పి... ... ... ...
... ... ... ... ... ... వా
గ్దిట్టయు నైన రామగురుదివ్యమహత్త్వము నెన్న శక్యమే.

సీ. .........
రామబ్రహ్మేంద్రగురునందు నేమికొదువ

క. భ్రమవిరహితమతి గలిగియు
అమలినవేదాంతసార మరయుటచేఁ గం
భముపాటి నారపని ధర
సుమతులచేఁ బిలువఁబడితి శుభకరలీలన్.

తిక్కనసోమయాజి తనభారతమును హరిహరనాథునకుఁ గృతి యొసంగుట కారణముగా భారతభాగమైన భగవద్గీతల నీతఁడును హరిహరనాథున కొసంగియుండెను. దత్తాత్రేయయోగిమతము నెల్లూరు ప్రాంతమందుండుటను బట్టియు హరిహరనాథకృతిపతిత్వమును బట్టియు నీకవి నెల్లూరు మండలము వాఁడనియు, క్రీ. శ. పదునాఱవశతాబ్ది నుత్తరార్ధమున నున్నవాఁడనియు నిర్ణయింపవచ్చును. ఇతఁడు గ్రంథాదియం దీక్రింది శ్లోకమును రచియించియున్నాఁడు.

శ్లో. నమో వేదాంతవేద్యాయ నిత్యసత్యానుసారిణే
శ్రీమోక్షలక్ష్మీనాథాయ శ్రీరామబ్రహ్మణేనమః

శ్రీరామబ్రహ్మేంద్రుఁడే యీతనిగురువు.

కులమెల్ల నశియింప నెలమిఁ బురాతన
కులధర్మములు నన్ని కూలిపోవు
వంశానుచారముల్ వదలినపిమ్మట
బలమైన పాపంబు ప్రాప్తమౌను
ననిపల్కు శ్రుతిమూల మంచాత్మలోఁ గని
యిట్టి ద్రోహము చేసి యెలమినీఁన
పోఁగొట్టుకొనుమార్గ మే గాన కిప్పుడు
కుమిత్రులౌవారిఁ గూలలేను
అదియుఁ గాక సధర్మ మగ్గలంబైన కు
లంబు స్త్రీచే దూషణంబు గనుట
వర్ణసంకరములు పుట్టవలయునట్టి
హేతువులు వచ్చుటయుఁ గాంచి వెఱచువాఁడ.

కం. ఊరకయుండుట కుశలం
బౌరయ నా కనుచు హృదయమందున దోఁచెన్
ధీరులు సంతోషింతురు
గౌరవమును మోక్షసుఖముగల్గును కృష్ణా!

చం. అనుచును బల్కి కార్ముకము వస్త్రములన్ దిగనాడి దుఃఖమున్
బెనగొని చిత్తవిభ్రమము పెల్లుగఁ బైకొనిరాఁగ నాహవం
బున బహుదినవృత్తి నరదంబుపయిం దనుదానె వెన్కకున్
బనుపడి గూరుచుండె ననిపల్కెను సంజయుఁడంత రాజుతోన్.

కం. చినిఁగిన చేలము లెటువలె
మనుజుఁడు విడనాడి నూత్న మగువస్త్రువు లే

యనువున ధరించు నటు మది
తనువు విడిచి దేహి క్రొత్తతనువులుపొందున్.

తే. గీ ప్రకృతియొక్కగుణంబుల భ్రాంతిఁబొంది
మూఢుఁడగు వాఁడు త్రైగుణ్యమూలమైన
కర్మములయందు లెస్సగాఁగట్టువడుచు
బద్ధుఁ డయ్యును బరమార్థసిద్ధిఁ గనఁడు

చం. అదియునుగాక భూతముల యన్నిఁటియందు సమత్వబుద్ధియిం
పొదవఁగఁ గల్గి సంశయముపొందక మోహవివర్జితుండునై
మదినిఁ బ్రియాప్రియంబు లనివక్కవసేయని జ్ఞాని యేమియా
పదలును లేక బ్రహ్మమును బట్టుగఁ బొందఁగఁ గల్గుఫల్గునా!

తే. గీ. సర్వసంకల్పజాలముల్ సమయఁజేయు
వాని సన్న్యాసిగాఁ గనవలయునట్లు
సేయకున్నట్టివాఁ డాత్మసారపదవి
గన్నయోగియటంచ నియెన్నరాదు.

కం. కానున్న కారణం బది
తానూనిన నూనకున్నఁ దప్పు దటంచుఁగ్
లోనిశ్చయించు పురుషుని
జ్ఞాని యనుచు విబుధులండ్రు గజరిపువర్యా!

# 222 యోగానందావధూత



ఈయవధూత ఆత్మైక్యబోధము, గురుశిష్యసంవాదము, అను వేదాంతవిషయ ప్రబోధకము లగు రెండు ద్విపదకావ్యములను రచియించెను. ఈ రెండుగ్రంథములును ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందముద్రితప్రతు లున్నవి. ఈయవధూత తాను లింగగురుని శిష్యుఁడనని యీక్రింది ద్విపదలలో వ్రాసుకొనియున్నాఁడు.

చెలువైన గురులింగ శిష్యుండ నగుచు,
అలరు యోగానంద అవధూతస్వామి
నైనట్టి నేనును నాగురుం దలఁచి
పూనికతోడుత బుద్ధను చెలికి
సకలవేదాంతార్థసారమై యున్న
యకలంక మాత్మైక్యమదివిస్తరించి
ఒప్పైన ద్విపదగా నున్న దున్నట్లు
చెప్పితి ద్విపదను చిత్తగించుండు

ఈతనిరచనములలో వ్యాకరణదోషములు విపులముగానున్నవి. ఆవిషయమును గవియే యిట్లు చెప్పియున్నాఁడు

అనుభవార్థంబంత యది లెస్సతెలిసి
అనుదినమీబోధ నరయుఁడు మీరు
యతిప్రాసములగోడవ యేలను మాకు
గతి గురుఁడనితలఁచు గతియది మాకు.

ఈతనిగురుఁడైనలింగగురుని సంపూర్ణనామము చింతల లింగావధానులు. ఈలింగావధానులును, శ్రీరామస్తవరాజమును రచించిన ముమ్మడి మల్లనకవియు, ఆంధ్రభగవద్గీతలను రచించిన కంభంపాటి నారపామాత్యుఁడును, పేనుగొండ తిమ్మయామాత్యుని శిష్యులు. కావున

వీరందఱును సమకాలికులు- వీరు నెల్లూరుమండలవాసులు. ఈతిమ్మయ యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. దత్తాత్రేయయోగి శిష్యుఁడు.

యోగానందావధూత. సన్యాసి ఈతని పూర్వాశ్రమ విశేషములు తెలియలేదు. ఈకవినిగూర్చి యింక నేమియుఁ దెలిసినది కాదు

దత్తాత్రేయయోగినిగూర్చియు, నాతని శిష్యపరంపరను గుఱించియు పరమానందయతి చారిత్రమున వ్రాసియున్నాఁడను. దానిని బట్టి యీయవధూత పదునాఱవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈతని కాలముననే పరమానంద యతియను నింకనొక యతీంద్రుఁ డున్నాఁడు. ఆతఁడును వేదాంత గ్రంథములను గొన్నిటిని రచియించియుండెను. ఆతఁడు నీతఁడును భిన్నులు. ఆతఁడు దత్తాత్రేయ యోగిపుంగవుని ప్రత్యక్షశిష్యుఁడు. యోగులలో సదానందవరదరాజయోగి, శాంతానందయోగి అనువారు శతకకవు లున్నారు. వారీయవధూతకంటె భిన్నులు.

---

## 223 అఖండసచ్చిదానందావధూత



ఈయవధూత పురూరవశ్చరిత్ర యనువేదాంతగ్రంథమును రచియించెను. ఎన్నియాశ్వాసములో తెలియరాదు. పురూరవచక్రవర్తికి నారదుఁడు తత్త్వోపదేశము చేసినకథ యిందు వర్ణిత మైనట్లీక్రింది గద్య పద్యములవలనఁ దెలియుచున్నది.

క. శ్రీమద్వేదాంతార్థ
స్తోమోల్లసదమలచిత్త! లోయజభవపు
త్రా! వహితతత్త్వవిధము వ
యామతితోఁ జెప్పుమని ధరాధిపుఁ డడిగెన్.

కవి యవధూత యగుటచే నీతనిపూర్వాశ్రమ వృత్తాంతములేవియుఁ దెలుపలేదు. ఈగ్రంథమెన్నియాశ్వాసములో తెలియదు. ఒక్క-

యాశ్వాసచతుమాత్రము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార మున నున్నది.

మచ్చునకొకపద్యము:-

చ. వనమునమన్న నేమి! గృహవాసముఁ జేసిన నేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును గల్గియుండినన్
వనమునమన్న నేమి గృహవాసముఁ జేసిన నేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును లేకయుండినన్

ఆత్మైక్యబోధాది వేదాంత గ్రంథములను రచించిన యోగానం దావధూత యొకఁడు కలఁడు. వీరిరువురును భిన్నులని తోచుచున్నది. ఆతఁడు లింగగురుని శిష్యుఁడ నని చెప్పుకొనినాఁడు. ఈతనిగురు వెవ్వరో తెలియదు. ఈయవధూత కాలమును దెలియదు భావిపరి శోధనా సౌకర్యమునకై యీయిరువు రవధూతల నొక్కచోఁ జేర్చితిని.

## 224 శాంతానందయోగి



ఇతఁడు శ్రీ గురుదత్తాత్రేయపీఠపరంపరలలోని శ్రీ బ్రహ్మానంద స్వామి శిష్యుఁడఁట. ఇతనిఁగూర్చి యింకేమియుఁ దెలియదు. పందొ మ్మిదవ శతాబ్దియందలివాఁడని శతకకవులచరిత్ర వ్రాసినది. ౧౦౮ కంద పద్యములుగల నీతిబోధకమగు రామశతకమును రచియించెను. వ్యాక రణదుష్టములైనప్రయోగములు తఱచుగాఁ గలవు. శైలిచూపుట కొఱకు మూఁడు పద్యములను వ్రాయుచున్నాఁడను.

క. కలిమియు లేమియు రెండును
గలకాలము నిలువఁబోవు కల్లలు జనులీ
యిలఁ గలరాజుల కథలను
నిలుకడగను సంతతమ్ము నెఱుఁగరె రామా... ౨౧

క. తనకన్న తెలివిపరుఁ డిలఁ
గనఁబడఁ డెచ్చట నటంచు గర్వంబునఁ దాఁ
దనలోన మురియు మూర్ఖుని
కెన దున్నను జెప్పవచ్చు నింపుగ రామా ౭౩

క. బొక్కలను నక్క వెదకును
అక్కరతోఁ గిటి యమేధ్య మంతట వెదకున్
కుక్కముక కోరి వెదకును
తక్కరిగాఁ డెపుడు వెదకుఁ దప్పులు రామా! ౭౦

ఈతఁడు దత్తాత్రేయ శిష్యపరంపరలోనివాఁడైనచో క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమువాఁ డని చెప్పవలయును. పందొమ్మిదవ శతాబ్దియందీ మతము లేదు. ఉత్పన్నమైపోయినది.



## 225 వెణుతుర్ల ఒడ్డెయ్యకవి

ఇతఁడు శుక్లయజుశ్శాఖుఁడు జెందిన బ్రాహ్మణుఁడు; కౌండిన్యసగోత్రుఁడు; మంగళగిరిపుత్త్రుఁడు; వెంగనామాత్యపౌత్త్రుఁడు

ఈకవి శృంగారరసాలవాలము, బాలగోపాలవిలాసము అను రెండు పుస్తకములను రచియించెను. ఆగ్రంథములలోఁ గవి తనను గూర్చి వ్రాసికొనిన పద్యముల నీక్రిందనిచ్చుచున్నాఁడను.

సీ. ప్రథమశాఖాన్వయపాదోధిసన్మిత్రు
మహనీయకౌండిన్య మౌనిగోత్రు
వసుధ శ్రీవెణుతుర్లవంశప్రవిస్తారు
ననుపమబ్రహ్మవిద్యావిహారు
నాంధ్రగీర్వాణ భాషాదక్షకోవిదు
నాటకాలంకారనయనినాదు

నేము శృంగారమృదుకవిత్వధురీణు
వరబుధనిచయాసేవాప్రవీణు

గీ. సుగుణసముదాయు వరవచశ్శుభనికాయు
నరనుతవిధేయు నొడ్డెయ్య నామధేయు
నన్ను మన్నించి యతఁడు ప్రసన్నకరుణఁ
గాంచి యిట్లనిపలికె సగౌరవముగ

బాలగోపాలవిలాసము.

ఉ. శ్రీరఘువీరభక్తిరససింధువిహారుఁడ శుక్లయాజుషా
చారుఁడ దేశికాంఘ్రిపరిచారుఁడ నే వెణుతుర్లవంశవి
స్తారుఁడ వడ్డినామకవిసత్తముఁడన్ రఘువర్యు పేర శృం
గారరసాలవాల మను కావ్యము సేతు జగద్ధితంబుగన్.

శృంగారరసాలవాలము.

గద్య: ఇది శ్రీమద్రామభద్రకరుణాకటాక్షలబ్ధ కవితాచమత్కార వెణు
తుర్లకులాలంకార కౌండిన్యసగోత్రపవిత్ర వేంగనార్యపౌత్ర సాధు
చారిత్ర మంగళగిరిపుత్ర వినయగుణాధుర్య వడ్డికవివర్యప్రణీతంబైన.

శృంగారరసాలవాలము.

ఈగద్యయందు "వెంగనార్య" పౌత్ర అనియుండఁగా బాల
గోపాలలవిలాసగద్యయందు "వేంగనామాత్య" పౌత్ర అనియున్నది.
వేంగనామాత్యుఁడనుట నిజమయినచో నీతఁడు ప్రథమశాఖానియోగి
బ్రాహ్మణుఁడని నిశ్చయింపవచ్చును. ఈకవి నివాస మేదియో,
ఈతఁ డెప్పటివాఁడో తెలియఁదగిన యాధారములేమియు నీరెండు
గ్రంథములయందును లభింపలేదు. బాలగోపాలవిలాసముయొక్కయము
ద్రితప్రతి, అనంతపురముజిల్లా ధర్మవరము తాలూకాలోని ముక్తాపు
రము రైలుస్టేషనునకు నేడెనిమిదిమైళ్ల దూరమునందున్న పెద్దచిగుళ్ల
రేవు అనుగ్రామమునందు లభించినదని ముద్రితప్రతికి పీఠికవ్రాసిన
శ్రీ పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు వ్రాసియున్నందునను
కవి "శ్రీరఘువీరభక్తిరససింధువిహారుఁడ" నని వ్రాసిన పద్యములోని

రఘువీరశబ్దము కడపమండలములోని ఒంటిమిట్ట రఘువీరుని స్ఫురింపఁ జేయుచున్నందునను బాలగోపాలవిలాసరచనమునకై కవిని ప్రోత్సహించిన, ఎగ్గోనుశేషనమంత్రి నందవరీకనియోగిబ్రాహ్మణుఁడగుట వలనను వెణుతుర్లయనుగ్రామము కర్నూలు మండలమునందుండుటచే తను, ఈకవి దత్తమండలములలోనివాఁడని యూహ వొడముచున్నది. విశ్వామిత్రగోత్రజుఁడగు నీశేషన్నమంత్రి నీకవి యీక్రిందిపద్యము లలో నుతించియున్నాఁడు. ఈపద్యమునందును రఘువీరశబ్ద ముదాహరింపఁబడినది.

సీ. శ్రీరామపదపద్మసేవాభిరాముండు
వరనందవరవంశవనధిసోముఁ
డగణితాయతధర్మసుగుణసంపన్నుండు
గాంభీర్యనీతివాక్య ప్రసన్నుఁ
డతిదీనజనపాలనాభ్యాసనిరతుండు
బుధకవిస్తుతమహాపుణ్యచరిత్రుఁ
డనఘక్షమాశాంతవినయవిధేయుండు
సతతాన్నముఖదానసముదయుండు

గీ. సకలహరిదంతవిశ్రుతస్ఫారకీర్తి
భూరికరుణారసస్ఫూర్తి చారుమూర్తి
సత్యసంధానుఁ డెగ్గోను సుతుక్లలీనుఁ
డుచితశుభపాళి శేషన్నసచివమౌళి.

చ. కవిబుధపండితోత్తములు గాయకసత్తము లాత్మతుల్య బం
ధువులు తనూజభృత్యవితతుల్ పరివేష్టనసేయ దివ్యమై
భవమున కొల్వుగైకొని సభాస్థలిలోనఁ బురాణకావ్యముల్
వివరణ సేయువేళ రఘువీరపదాబ్జనిబద్ధబుద్ధియై.

ఈశేషన్నమంత్రి యన్నయగు రామయమంత్రి శ్రీకృష్ణభూపాలుని యొద్ద మంత్రియైయున్నట్లీక్రిందిపద్యములోఁ దెలుపఁబడినది.

శా. శ్రీరామప్రతిమున్ దదగ్రిజు యశశ్శ్రీకృష్ణభూపాల భూ
భారాశేషవిశేషపాలన కళాపారీణు సత్యవ్రతో
దారారంభవిచారునిన్ హరిపదధ్యానైకనిష్ఠాగరి
ష్ఠారూఢాత్ముని రామమంత్రివరు నెంచన్ శక్యమే యిద్ధరన్.

బాలగోపాలవిలాసమునకుఁ బీఠికవ్రాసిన పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారీపద్యములోని శ్రీకృష్ణభూపాలకుని మొదట శ్రీకృష్ణదేవరాయలుగాఁ దలంచియుఁ బిమ్మట బాలగోపాల విలాసము నందలి వర్ణనములలో అలసాని పెద్దన్న, నంది తిమ్మన్న పోకడలే కాక పైకవులకుఁ బిమ్మటనుండిన రామరాజభూషణుని వసుచరిత్రలోని సమాసగమనాదులును వర్ణనావిశేషములుగూడ నిందుఁ జూపట్టుటచేఁ బదునాఱవ క్రైస్తవశకముయొక్క కడపటనున్న నంద్యాలరాజగు శ్రీకృష్ణరాజుకడఁ గృతిపతియన్నయగు రామయమంత్రియు మంత్రిగా నుండుననియుఁ గృతిభర్త యగు శేషనమంత్రియు కృతికర్త ఒడ్డెయ్యకవియు నాకాలముననే యచటనే యుండియుందురనియు దృఢముగ దలంప నగుచున్నది. మఱియుఁ బ్రసిద్ధికెక్కిన విజయవిలాసములందలి 'కంగుల్దీరిన పైఠిణీరవిక' అనువాక్యము దీనియందును "పైఠిణీరవిక కంగుల్దీరిపొంగారగా ననుమార్పుతోఁ బ్రయోగింపఁబడుటచే పదునేఁడవక్రైస్తవశకారంభమున నుండిన చేమకూర వెంకటకవికిఁగూడ నీతఁడు పిమ్మటనుండెనా యనియనుమానించితిని గాని, యాకాలమున నెచటను 'కృష్ణరాజ' నాముఁడు ప్రభువుగానుండకపోవుటచేతను 'పైఠినీరవికకంగుల్దరుట' అనునానుడి ప్రాచీనకాలమున వాడుకొనబడు పదమని పెద్దలవలన వినియుండుటచేతను వేంకటపతికిఁ దరువాత వాఁడు కాఁడీతఁడని చెప్పవలసియున్నది. మఱియు నరసభూపాలీయములో లేనట్టివియు సంస్కృతమున 'రసమంజరి' మొదలగు గ్రంథములలో నభిహితమగునట్టివియు 'నాయికానాయకరస' నిర్ణాయకబోధకములగు నంశములతోఁగూడున ట్లీతఁడు 'శృంగారరసాలవాలము' అను గ్రంథమును నరసభూపాలీయమును భట్టుమూర్తి రచించిన వెంటనే

రచించియుండును. అందుచే నీతఁడు పదునాఱవశతాబ్దము చివరనుండిన 'పింగళిసూరన' మహాకవికి సమకాలికుఁడై యుండునని తలంప నగుచున్నది" అనివ్రాసియున్నారు. శాస్త్రిగారియూహ ప్రమాదజనితమేమోయని తోఁచుచున్నది. పైపద్యములోని కృష్ణభూపాలకుఁడు నంద్యాల కృష్ణరాజని యూహించుటకుఁ దగినయాధారమేమియును లేదు. కృష్ణరాజనాముఁడు లభింపకపోవుటచే రామయమంత్రిని నంద్యాల కృష్ణరాజుకడ మంత్రియేమో యని యూహించిరి. కాని అట్టివాఁడో కఁడెవ్వఁడేని దొరకినచో నీకవిని పింగళి సూరన్నకంటె నవీనుఁడని చెప్పుటకు శాస్త్రిగారికి నిష్టమే యనివారివాక్యములవలన స్ఫురించుచున్నది. శృంగారరసాలవాలపీఠికాకారులీకవి నవీనుఁడని యీక్రింది వాక్యములలో వ్రాసియున్నారు. "రచనాకౌశలమునుబట్టియు, పూర్వకవులచే ననుసరింపఁబడిన కృత్యాది వర్ణనాదికములు, షష్ఠ్యంతములు స్వప్నసాక్షాత్కారములు మున్నగు ప్రబంధపరిస్థితులు నిందులేకుండుట చేతను ఈకవి నవీనుఁడనిమాత్ర మూహింపవచ్చును. అనఁగా నాంధ్ర వాఙ్మయమునందు ప్రబంధనిర్మాణవ్యవస్థ యేర్పడిన పిమ్మట నందలి నాయికానాయకాది లక్షణములను, అలంకారికమర్యాదలతో లక్ష్యలక్షణసహితముగా నుపనిబంధింపదివిరినట్టి, తర్వాతికాలమువాఁడనుట" (కృత్యాది, షష్ఠ్యంతములు శృంగారరసాలవాలమున లేకపోయినను, బాలగోపాలవిలాసమునందున్నవి) బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమునం దీకవికాలమును నిర్ణయింపలేదు. కాని యితని నాధునికులలోఁ జేర్చియున్నారు.

రేవూరి అనంతనార్యకృతమైన గాధేయోపాఖ్యానమును గృతినొందిన సేలము కృష్ణభూపాలుఁడొకఁడు కలఁడు. అతఁడే పైపద్యములోఁ జెప్పఁబడిన కృష్ణభూపాలకుఁడేమోయని నేనూహించుచున్నాఁడను. ఒడ్డెయకవియు శేషన్నమంత్రియు దత్తమండలములోనివారైనప్పుడు శేషన్నమంత్రి యన్నయగు రామయ్యామంత్రి తత్పరిసరమండలమగు సేలమునందు మంత్రిగానుండెననుటలో విరుద్ధముగాన్పింపదు.

ఈయూహ నిజమయ్యేనేని ఒడ్డెయ్యకవి రేవూరి అనంతయజ్వతో సమకాలికుఁడై యుండునని యూహింపఁదగియున్నది. అయినను యితరాధారములు లభించువఱకు నీతనిని శ్రీశాస్త్రులుగారి యభిప్రాయానుసారముగ క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమునందే యుంచుదము.

ఈకవిరచించిన శృంగారరసాలవాలము మూఁడాశ్వాసముల యలంకారశాస్త్రగ్రంథము. ఇది శ్రీరామున కంకితమీయఁబడినది. ఇందు నాయికానాయకలక్షణములు, శృంగారవీరకరుణాదిరసస్వరూపములు, హావభావాదులు మృదుమధురపదలలితము లగు పద్యములలోఁ జెప్పఁబడినవి. శాస్త్రవిషయమును సులభశైలిలో నీకవి చక్కగా వ్యక్తీకరించి యున్నాఁడు. రసములలోకెల్ల నుత్తమమయిన శృంగారరసమును, శ్రీకృష్ణుని క్రీడావిలాసములే లక్ష్యములుగా నిడిగ్రంథమును జేసెదనని కవి యీక్రింది రెండుపద్యములలోఁ దెలిపియున్నాఁడు.

తే. గీ. రసములం దెల్ల శృంగారరసమ రసము
శ్రేష్ఠమగుఁ గానఁ దద్రసస్థితు లనేక
భేదరీతుల వర్తించుపెం పెఱింగి
యేరచించెదఁ గావ్యమ దెట్టులనిన?

గీ. అవధరింపుము పూర్వసత్కవినికాయ
కావ్యలక్షణలక్ష్యసంగతులెఱింగి
కృష్ణదేవుఁడు సల్పినక్రీడ లాంధ్ర
భాష శృంగారరసము నేర్పరతు నిటుల.

ఈగ్రంథమందలి కవిత్వవైఖరి తెలియుటకై కొన్నిపద్యము లిట నుదాహరింపఁబడుచున్నవి.

ఉన్మాదము:—

చ. చని తడవయ్యె నేమిటికొ సారసనాథుఁడు రాఁడు పిల్వఁగాఁ
జనుచను మోహకంబ రయసంగతినై చనవద్దు వద్దహో
చనియెద వేని తద్వచనచాతురిచేత ముఖానురాగ మిం
పెనయఁగ సాక్షి కన్నుఱుగ నీవును వత్తువొ రావొ కావునన్. ౧౭.

చాపలము:-

చ. సరసిజనాభుఁ జూచి సతి జగ్గుగ నిల్చుచుఁ బల్చు మోవి ముం
గురు లటుదువ్వ నవ్వ జిలుకుం గులుకుం వగదోల్కఁ బల్కు న
మ్మరుఁ డనుసూత్రధారి యసమానగతిన్ నటియింపఁ జేయఁగాఁ
బరిపరిరీతినై తెళుకు బంగరుజంత్రపుబొమ్మకైవడిన్. ౧అ.

ముదిత.—

ఉ. మందకుఁబోయె నామగఁడు మాపకుఁ జూపులు మంకమత్తకున్
ముందుగఁ దోఁపుంజెవుడు మోహనరూపధరుండు కృష్ణుఁ డిం
పొందఁ సమీపగేహమున నుజ్జ్వలలీల వసించియుండునో
యిందునిభాస్య! నెమ్మది మదీప్సితముల్ ఫలియింపకుండునే ౨ఆ

ఉపపతినాయకుఁడు:—

సీ. ఎదురైనఁ గనుసన్న నొదిగినవ్వాటె కాని
తగులూర నెవ్వగల్ దార్పఁ గలుగ
దెపుడు సందొనని యెదురుచూచుటె కాని
కోరినప్పుడె జోడు గూడఁ గలుగ
దంది వీడియ మియ్య సందుగొందులె కాని
మిసిమిముచ్చటల పెంపెసఁగ గలఁగ
దదనైనఁ దత్కార్యమెదఁ దత్తరమె కాని
తమిదీర భోగించు తాల్మి గలుగ
దైన నితరేతరము ప్రేమ మగ్గలముగఁ
బాయ కేప్రొద్దు మనమునఁ బాదుకొనఁగ
వలనుమీఱంగ హరియంతవాని కైన
నన్యకన్యాసమాగమ మాసఁగాదె ౩ఆ.

ఈతఁడు రచించిన బాలగోపాల విలాసమునందలి కథ శ్రీకృష్ణుఁడు నీలాసుందరిని బరిణయమాడుట. ఈకథ హరివంశమునుండి గ్రహించిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. హరివంశమాల కింపుచు
హరి నీల వరించె బాల్యుఁడై యనవిని యా

హరిణాక్షీ యెవతె? యేగతి
హరిఁ బగ వరియించెఁ జెప్పుఁ డంతయుఁ గరుణన్

తొల్లి తారకామయయుద్ధమునందు శ్రీమహావిష్ణువుచే మడసిన కాలనేమి యనురాక్షసుని తనయుఁ లేడ్వురును కుంభకుం డనుగొల్లవాని మందలో నేడు వృషభములై జన్మించి జనులను పీడింపుచుండ నాతఁడా వృషభముల నడఁపులోనుంచఁజాలక యావృషభములను జయించినవాని కత్యంత సౌందర్యవతి యగు తనకూఁతు నిత్తునని చాటించెను. శ్రీకృష్ణుఁడావృషభములను జయించి నీలను వరించెను. ఈకథనే కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడు నీలాసుందరీ పరిణయమను నచ్చతెలుగు ప్రబంధముగా రచించెను. భాగవతమునందును గొంతభేదముతో నీకథ కలదు. నీల గొల్లకన్యకాదు. కోసలదేశపురాజగు నగ్నజిత్తు అనువాని కూఁతురు నాగ్నజితి యనునామము కలది. సప్తవృషభగాథ అందును ఇందును సమానమే.

బాలగోపాలవిలాసము ప్రబంధము కావున హరివంశము నుండి మతివృత్తమును మాత్రము గైకొని వర్ణనాంశములను జేర్చి మూఁడా శ్వాసముల కావ్యమును రచించినాఁడు. ఇతనికవిత్వము మృదుమధుర పదసంయుతమై మనోహరముగా నున్నది. బాలగోపాలవిలాసమునుండి నాలుగు పద్యముల నుదాహరించెదను.

చ. సరసత నేపు జూపుచు వెసన్ లతికాబ్జముఖీనికాయ మిం
పొరయఁగఁ బల్లవానుగతు లూనిననేని వియోగరాగముల్
సరవి జనింపుచో మొగడచన్నులు పైబలుపెక్కి నిక్కఁగా
మెఱసె వనాంతరంబులను దోరపుఁ గాంతి వసంతసంగతిన్. ౧౮.

చ. జలరుహసంభవుండు కరచాతురి బంగరుచే లతాకృతిన్
దొలుత రచించి దాని మఱిలొయ్యలిఁగా నొనరింపఁగాఁ జుమీ
యలరుకుచంబులన్ ఫలము లట్లు రచింపకయున్నఁ బూపలై
మొలచి క్రమానువృద్ధిఁ గడుమొత్తములై జిగిమీర నేటికిన్. ౨౦.

ఉ. చందుర! శంకరుండు బెలుచం గొని యాఁదలఁజేర్చె నంచు మి
న్నందురు కాని మీఁదెఱుఁగ వారయ నావిభుఁ డాత్మజాతు నె
నిం దనయుగ్రతం గరచి వేఁఱుగఁ గన్కొసరూనువాఁడు సు
వ్మోందును కుత్తుకన్ విసము నచినవారల నమ్మవచ్చునే 3 ఆ.

ఉ. దోయిట ముత్యముల్ గొనియుఁ దోయజనేత్రుఁడు నిల్వఁ జూచి యా
తోయజగంధి సంతసము తొంగలి ఱెప్పల కుప్పతిల్ల నీ
తోయము వారలెవ్వ రిల తోయజనాభ యటంచు మించుగా
పాయనిభక్తిఁ బోసె తలఁబ్రాలు దనంతనె ముందుముందుగన్.

ఈబాలగోపాలవిలాసమును శేషన్నమంత్రి పేరిణాముపై శ్రీరామచంద్రున కంకిత మొనర్చిన ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది

ఉ. ప్రేమ మదీయమిత్రుఁడవు పెంపు దలిర్పఁగ సత్కవీంద్ర! శ్రీ
రామపదారవింద నుతి రంజిలు నిశ్చలభక్తి గావునన్
రామసమర్పణంబుగను రమ్యతటాకవనాదిసంతతి
స్తోమముఁ బూన్పఁగా వలయు సుస్థిరచిత్తముతోఁ జెలంగఁగన్.

గీ. నీవు హితుఁడవు గావున నీవొనర్చు
బాలగోపాలలీలాప్రబంధరాజ
మవనిజాభర్త కంకిత మాచరింపు
మస్మదీయహితార్థ మీవాత్మ నలరి.

# 226 ఎలుగంటి పెద్దనకవి

--)O(--

ఇతఁడు ప్రథమశాఖానియోగిబ్రాహ్మణుఁడు; కాత్యాయనసూత్రుఁడు; కాస్యపగోత్రుఁడు; మల్లమాంబా కొండయామాత్యుల పుత్త్రుఁడు.

ఈకవి భిన్నప్రకీర్ణ గణితములను బహ్వర్థరూపకముగా రచియించెను. భిన్నగణితమునకు వేఱుగను, ప్రకీర్ణగణితమునకు వేఱుగను కృత్యాది పద్యములను గద్యలను రచియించియున్నాఁడు. కాని వాటియందు శబ్దభేదమె కాని యర్థభేదము లేదు.

సంస్కృతమున వీరాచార్యులు రచించిన గణితశాస్త్రమును పావులూరి మల్లన తెల్గించినను, అది చాలకష్టముగా నుండుటచే సులభముగాఁ దెలియుటకై తా నీగ్రంథమును రచించితనని కవి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. మునుఁడైడె వీరాచార్యులు
తనమహిమను వెలయఁ జేసె దశవిధగణితా
లను పద్ధతులు ధరిత్రిని
మునుపే యష్టాధికారములు మొదలనియున్

శా. వీరాచార్యులు సంస్కృతాన గణితా ల్విఖ్యాతిగాఁ జేసెఁదా
నారూఢింబది. పావులూరికవి మల్లామాత్యు తెల్గించెనన్
పేరేగాని గుణించలేరు గణకుల్ భిన్నప్రకీర్ణంబు లీ
తీరైన న్నెలుగంటి పెద్దన్న యవిన్ దెల్పెన్ గుణించన్ ధరన్

క. భిన్నప్రకీర్ణగణితము
లన్నవి గుణియింపఁ గఠిన మందలు కనఁగా
నెన్న నెలుగంటి పెద్దన
చె న్నలరఁగ బాలబోధ చేసెం దెలియన్

క. హాటక మయినప్రకీర్ణము
పాటించి గుణింపఁజేతు బహుపద్ధతులన్

గాటం బగులెక్కలు క
ణ్గాటకమున వెలయు సూర్యనారాయణుఁడా!

కవి తనునుగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

క. ఘనకాశ్యపగోత్రుండను
జనుకాత్యాయనుఁడఁ బ్రథమశాఖాన్వయుఁడన్
జనమల్లమాంబ కొండన
తనయుఁడ నెలుగంటి పెద్దనన్యుఁడ జగతిన్.

క. ఇల శుక్లయజుర్వేదము
గలకాత్యాయనకసూత్ర కాశ్యపగోత్రుం
డెలుగంటి కొండయప్రభు
కులముఖ్యుఁడఁ బెద్దనుఁడ గుణితజ్ఞుండన్.

క. గణపతిని సూర్యనారా
యణదేవుని భక్తిఁ గొలిచి యనవరతము భూ
గణకులను దలఁచి వారిక
రుణతోడుత భిన్నగణితరూపముఁ గంటిన్

క. నారాయణవరలబ్ధుఁడఁ
బారీణుఁడ సకలగణితపద్ధతులందున్
ధీరుఁడను రాజసభలను
బేరే యెలుగంటి వంశపెద్దన యనఁగన్.

ఈకవి యెచ్చటివాఁడో యెప్పటివాఁడో తెలిసినది కాదు. ఈతఁ డాంధ్రకవుల చరిత్రలోఁ జేరలేదు.

ఈతని కాలము సరిగా తెలియువఱకు పదునాఱవ శతాబ్ది నుత్త రార్ధమన్ని తలంపవచ్చును. ఈగ్రంథము ముద్రితము కాలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నొక వ్రాఁతప్రతి యున్నది. ఉదాహృతపద్యములను బట్టి యీతని కవిత్వము మృదువై హృదయం గమముగా నుండునని తోఁచుచున్నది.

# 227 జక్కరాజు రామకృష్ణకవి



ఇతఁడు ఎల్లయామాత్యపుత్త్రుఁడు; భారద్వాజ సగోత్రుఁడు; మదనగోపాల వరప్రసాదలబ్ధసారస్వతుఁడు.

ఈకవి కామందకీయ నీతిశాస్త్రమును దెలుఁగున నెనిమిదాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి తిమ్మయ వెంకటాద్రిప్రభువున కంకితము చేసెను. ఇది రాజనీతిని బోధించుగ్రంథము. విష్ణుగుప్తుఁడు చెప్పినరాజనీతి శాస్త్రమును గామందకుఁడు సంస్కృతమున రచియించి నట్లును, దానిని రాజదేవుఁడు భూమిపై వెలయించినట్లును గవి యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. శ్రీమంత్రాఢ్యుఁడు విష్ణుగుప్తుఁడు వచశ్శ్రీయుల్లసిల్లన్ ఘనం
బై మించంగ నొనర్చినట్టినయశాస్త్రార్థంబు కామందకుం
డామోదంబున సంగ్రహించి నయకావ్యంబై పగన్ జేసె నీ
భూమిన్ సర్వహితంబుగా ఋజువుగా భూపాలయోగ్యంబుగా.

క. శ్రీమంతుఁడు గుణవంతుఁడు
ధీమంతుఁడు నైనరాజదేవుఁడు వెలయన్
దామంతు కెక్క యాజ్ఞనె
భూమిస్థలి నిత్యమార్గమున నిల్పి దయన్

కృతిపతియైన వెంకటాద్రిని గవి వర్ణించినపద్యములలో నీక్రిందివి రెండు లభ్యములైనవి.

క. ఈరీతి పుత్రమిత్ర
శ్రీరాజితుఁ డగుచు రాజసేవిత చరణాం
భోరుహుఁడై వేంకటధర
ణీరమణుఁడు వెలయు విజయనిత్యోదయుఁడై.

క. తేంకణచోళద్రావిడ
కోంకణ భూపాలదళితఘోటీపేటీ

సాంకవతతికిన్ దిమ్మనయ
వేంకటజనపతికి నీతివిలసితమతికిన్.

ఈ వెంకట్రాద్రి ప్రభువు అయ్యలరాజు అయ్యలకవి భాస్కర కవులు రచించిన రెట్టమతకావ్యమునకుఁగూడ గృతిభర్త. ఆకావ్యము నందు "నభిరామకామందకాఖ్యసత్కావ్యరత్నమునకు నేరాజు నాథుఁ డయ్యె" అని యీ వెంకటాద్రి కీర్తింపఁ బడియున్నాఁడు. కావున నీకామందకీయమునకును రెట్టమతకావ్యమునకును గృతిభర్త యొక్కఁ డేయనుట నిశ్చయము. కృతిపతినిగూర్చి అయ్యలకవి చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఈకామందకీయము ముద్రింపఁబడలేదు. తాళపత్ర ప్రతి యొకటి తంజావూరులిఖిత పుస్తకభాండాగారమునందున్నది. అందీ కామందకీయరచనాకాల మీక్రిందిపద్యములో గ్రంథాంతమునఁ జెప్పఁ బడినది.

మ. రమణీయంబుగ శాలివాహశకవర్షంబులో వెయ్యినే
నూరును వారునై వెలయఁగాఁ బ్రౌఢిం దెనిఁగించి రా
ర మహిం దిమ్మయ వేంకటాద్రివిభుపేరన్ వేడ్కఁ గామంద
కీయము శ్రీవెంకటరామకృష్ణులు స్వభావంబొందనారూఢిగా.

ఈపద్యము లక్షణయుక్తముగాలేదు. ప్రాసచెడినది- కాని యిందుఁజెప్పఁబడిన కాలము సరియైనదే. ఈపద్యమునుబట్టి గ్రంథరచనాకాలము శా. శ. ౧౫౦౬ అయినది. రెట్టమత కావ్యమునకుఁ బూర్వమే కామందకీయము చేయఁబడినది. ఈగ్రంథరచనాకాలము క్రీ. శ. ౧౫౮౪ ప్రాంతము. కృతిపతినివాసము కర్నూలు మండలము లోని యెఱ్ఱంపాలెమగుటచే నీకవియు నాప్రాంతమువాఁ డని చెప్పవచ్చును. ఇంతకంటెఁ గవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు.

సంస్కృతకామందకీయమును, మడికి సింగనకుఁ బూర్వ మొకకవి యాంధ్రీకరించియున్నట్లు కన్పట్టుచున్నది. మడికి సింగన తనసకలనీతి కథావిధానమునఁ గామందకీయములోనివని కొన్నిపద్యముల నుదాహ

రించియున్నాఁడు. సింగన పదునాల్గవశతాబ్దివాఁడు కావున నిందుండి యాతఁ డుదాహరణములను గైకొనెననుట కవకాశము లేదు. అందుచే నా కామందకీయకర్త భిన్నుఁ డనుట నిస్సంశయము. ఆతని పేరు తెలియ లేదు. ఆకామందకీయము లభింపను లేదు. సింగనకవి యుదాహరించిన పద్యములనుబట్టి చూడఁగా ఆకామందకీయకర్త కవిత్వ మీ వెంకట కవి కవిత్వముకంటెఁ బ్రౌఢమయినదిగాఁ గాన్పించుచున్నదని బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రభిప్రాయమిచ్చియున్నారు.

తంజావూరునందలి లిఖితపుస్తకముల పట్టికలో నుదాహరించిన రెండుపద్యముల నీక్రింద నీతనిశైలి తెలియుటకై యుదాహరించుచు న్నాఁడను.

ఉ. ఈగతి నీతిమార్గమున నెంతయు సుస్థిరుఁడైనరాజు దా
ధీగరిమన్ వహింపుచును దిగ్విజయంబును సర్వసంపదల్
భోగము కల్మియుం గలిగి భూవిభులెల్లరుఁ జేరిగొల్వ ను
ద్యోగములెల్ల చేకుర సుఖోన్నతి రాజ్యము సేయునిచ్చలుక్.

ఉ. శ్రీరఘురామపాదసరసీరుహభృంగసమానమానసో
దార మదారివీరవరదర్పవిమర్దన దుర్దమక్రియా
స్ఫారభుజాబలాధిక విసారితపూరితలోకసద్యశో
హారవిహార మానితమహాకరివాజివిరాజితాంగణా!

ఈకవి గోత్రాదికమీ క్రిందిగద్యవలనఁ దెలియనగును.

గద్య:- ఇది శ్రీమన్మదనగోపాలవరప్రసాదలబ్ధ సారసారస్వతభారద్వాజ సగోత్ర జక్కరాజు యల్లయామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతం బైన కామందకనీతిశాస్త్రంబనుమహాప్రబంధంబునందు సేనావివరంబును సేనాపతిభావంబును కూటయుద్ధపరిహారంబును చతురంగబలపరియోజనంబులును తద్బాహ్యములును వ్యసనంబులును పారిలౌకికంబును చతురంగ బలప్రశంసయు నన్నదిసర్వంబును అష్టమాశ్వాసము.

ఈకామందకీయగ్రంథకర్తలిరువురనియు, జంటకవులనియు, వారిపేరులు వెంకటరామకృష్ణకవులనియు, గొంది అనుచున్నారు. కాని యందులకాధారములు గనుపట్టలేదు.

తంజావూరుపుస్తకభాండాగారమునందున్న కామందకనీతిసారమునుజూచుభాగ్యము నాకలవడలేదు. ఈప్రతిని జూచిన శ్రీవేమూరి విశ్వనాథశర్మ. M. A. L. T. గారిగ్రంథమునుగూర్చి భారతీపత్రికలో (సంపుటము 2 సంచిక 1 పుట ౧౮౦—౧౮౧) నిట్లు వ్రాసియున్నారు.

"ఇదివిష్ణుగుప్తుని (చాణక్య) అర్థశాస్త్రమునకు కామందకుం డొనర్చిన సంగ్రహము. ఈప్రాచీనరాజనీతి శాస్త్రమునకు, తెలుగు మున్నూరు సంవత్సరములకు పూర్వమే చేయబడినది. జక్కరాజు ఎఱ్ఱనామాత్యపుత్రుడు వెంకటయ్య గ్రంథకర్త. కొండ్రాజు తిమ్మభూపాలునికి సంగమాంబవలన జనించిన వెంకటాద్రి మహీపాలుని కంకితము. రెట్టమత శాస్త్రమునకు నీతడే కృతినాయకుడు. "కామందకనీతి నాయకా" అని రెట్టమతములో నున్నది. ఇదిగాక ఈరెండుపుస్తకములలో కృతిపతి వంశవర్ణనము సరిపోవుచున్నది. గ్రంథాంతమునందున్న పద్యమునుబట్టి కామందకీయము శతాబ్దము 1506 సంవత్సరములో తెలిగించినట్లు తెలియుచున్నది. గ్రంథాంకితకాలమున వెంకటాద్రి రాజు కర్ణాటాధీశ్వరులసామంతరాజుగ నున్నట్లు తోచును. తెలుగు కామందకీయము త్వరలో ముద్రించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అప్పు డుపోద్ఘాతములో వేంకటాద్రిరాజు విషయమై సంపూర్ణముగ చర్చింపబడును.

కామందకనీతిసారము మొదట తెలుగులిపిలో అచ్చయినది. ఇందు గ్రంథమంతయు 20 ప్రకరణములుగ విభజింపబడి తడకమళ్ళ వెంకటకృష్ణారావుగారి తెలుగుటిప్పణము కూడకలదు. ఇటీవల తిరువాన్కూరు మహారాజుగారు నాగరలిపిలో ప్రచురించిన ప్రతిలో 36 ప్రకరణము లున్నవి. తెలుగుకామందకీయము 8 ఆశ్వాసముల ప్రబంధము. మూలమునకు సరియైన యాంధ్రీకరణము. శైలిసరళము. మచ్చునకు రెండు పద్యము లిచ్చెదను.

క. అలరి నొంపుచు విషయంపు టడవిలోన
బరువు లెత్తెడి నింద్రియభద్రదంతి
జ్ఞానమనుపేరఁ దగునంకుశంబుచేతఁ
దనకుఁ గైవసముఁజేసికొనఁగవలయు.

ఉ. శూరతఁగల్గుసారథులు జొక్కపుతేజులు కింకిణీఝణా
త్కారమహారవంబు బిర...ధ్వజకోటులు మీరఁ బోరిలోఁ
మైరిననొరథంబులను వానిరథంబులఁగూల్చి పొల్చుబల్
తేరులవారుగల్గు నరిపేవుల కెద్ది యసాధ్యమీధరన్.

కామందకీయము రాజనీతిగ్రంథము. దీనిని సంస్కృతమున రచియించినవాఁడు కామందకుఁడు. ఇతఁడు క్రీ. శ. ౨౦౦ సంవత్సరప్రాంతమునందలివాఁడు. సంస్కృత కామందకమునందలి విషయముల నెఱుంగఁగోరువారు భారతియందు ౧ శ్రీమామిడిపూడి వెంకటరంగయ్యగారు "మనపూర్వులు వ్రాసినరాజనీతిగ్రంథములు" అను శీర్షికక్రింద వ్యాసమును జూడనగును.

ఈకృతిపతి కాలమునుగూర్చి ఆంధ్రకవితరంగిణియందుఁ దెనాలి రామకృష్ణకవి చారిత్రమునఁ (సంపుటము 8 పుట 21) గొన్నివిషయములను వ్రాసియుంటిని. పాఠకులీసందర్భమున వానినిగూడఁ జూడవలయును.

---

౧. రక్తాక్షిశ్రావణమాసము ౭౯ వ పుట.

# 226 అయ్యలరాజు అయ్యలకవి భాస్కరకవి



ఈయిరువురుకవులును నియోగిబ్రాహ్మణులు; కౌండిన్యగోత్రులు; ఆపస్తంబసూత్రులు; అయ్యలకవి పిన్నక్కతనయుఁడు; భాస్కరకవి నాగయసూనుఁడు; వీరిరువురుఁగలిసి రెట్టమతశాస్త్రమను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి పెదతిమ్మరాజు కుమారుఁడైన వెంకటక్ష్మాపతి కంకితముచేసిరి.

అయ్యలరాజు వారియింటిపేరు పూర్వము రాయకవివారనియు నావంశమున నయ్యలరాజు ప్రముఖుఁడగుటచే నప్పటినుండియు నయ్యలరాజువారైరనియు నయ్యలరాజు తిప్పమనీషి చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఆవిషయము నీకవు లీపద్యములో ధృవపరచియున్నారు.

గీ. రాయకవియయ్య నయ్యలరాజువంశ్య
ననఘుపిన్నక్కవిభుపుత్త్రు నయ్యలాఖ్యు
నాగఘనుసూను భాస్కరనామధేయుఁ
గరుణఁ దళుకొత్త రావించి గారవించి.

ఈకవు లిరువురును రాయకవిత్రిపురాంతకుని వంశములోనివారైనట్లు కృతిపతి వాక్యములుగా నీక్రింది వచనములోఁ జెప్పియున్నారు. "విశేషించి మీరలు శ్రీరఘునాయకదయాలబ్ధ సారస్వతులును, రఘువీరశతకనిర్మాణకర్త రాయకవి తిప్పనార్యపాలకులును మదీయాశ్రితులు నగుటం జేసి భవత్కవిత్వంబు మాకభిమతంబయియుండు"

రామాభ్యుదయమును రచియించిన రామభద్రుఁడును, హంసవింశతికర్తయగు నారాయణామాత్యుఁడును, నీయయ్యల భాస్కరకవులును తిప్పయమనీషివంశములోనివారైనట్లు తమతమ గ్రంథములలోఁ జెప్పుకొనియున్నారు. కాని వారిలోవారికిఁ గలబాంధవ్యము నెవరును జెప్పలేదు.

ఈజంటకవులు శెట్టిమతమను నొక గద్యలో యిట్లు వ్రాసికొని యున్నారు.

"ఇది శ్రీమద్దొంటిమిట్టరఘువీరకృపాలబ్ధసారస్వత ధుర్యాయ్యలరాజ వంశసంభవాయ్యలాఖ్య భాస్కరాఖ్యకవిద్వయప్రణీతం బగు శెట్టిమత శాస్త్రము"

ఈకవు లీగ్రంథమును కర్నూలుమండలములోని యోగ్యమపాలె మునకుఁ బ్రభువైన వెంకటరాజున కంకితముచేసియున్నారు. ఈతఁడు అహోబలనృసింహస్వామికి ధర్మకర్తయైనట్లును, కావ౦డకీయమను గ్రంథమును గృతినందెననియు నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నారు. కృతిపతివంశమును బెక్కుపద్యములలోఁ గవులు వర్ణించియుండిరి. కాని యందుచరిత్రమునకుపయోగించు నంశములు లేవు.

సీ. శ్రీమదహోబిలస్వామిమహారాజ్య
  రక్షకుం డగుచు నేరాజు వెలయు
నభిరామకామందకాఖ్యపత్కార్య
  త్నమునకు నేరాజు నాథుఁడయ్యె
జానకీనాయకచరణసంసేవనా
  ప్రౌఢిచే నేరాజు ప్రబలు సిరుల
నొరయూరి పురజరాధీశాది బహుబిరు
  దాంకుఁడై యేరాజు యశముఁ గాంచె
నతఁడు కొండ్రాజుతిమ్మభూపతివరేణ్య
తనయ పెదతిమ్మరాజవతంసగర్భ
వార్ధిచంద్రుండు సత్కులవర్ధనుండు
సతతవిభవుండు వెంకటక్ష్మావిభుండు.

ఈకృతిపతి కర్ణాటసింహాసనాధిపతి యొక్క ప్రాపకమునందిన వాఁడని యీక్రింది పద్యములోఁ జెప్పఁబడినది. కాని యారాజెవ్వఁడో తెలియలేదు.

మ. కపటారాతివిభంజనోద్ధతమతీ! కర్ణాట సింహాసనా
ధిపతిప్రాపరమాధురీణ! కరుణాబ్ధీ! కంతుసౌందర్య! కా
శ్యపగోత్రపవిత్ర! నమ్రితరవాచానైపుణీనిర్జితా
హిపకామందకకావ్యనాయక! కవీంద్రేష్టార్థసంధాయకా!

ఈరాజు సుకృతమేమో కాని ఇతఁడు కృతినొందిన గ్రంథములు రెండును శాస్త్రగ్రంథములే. కామందకము రాజనీతినిబోధించు నుగ్రంథము సంస్కృతభాషయందున్నది. దానిని రామకృష్ణకవి ఆంధ్రీకరించి యీ వెంకటభూపతి కంకితముచేసియున్నాడు. ఆకవి చారిత్రమును వేఱుగ నీగ్రంథమున వ్రాసియున్నాఁడను.

కర్ణాటకభాషలో రెట్టఁ డనుపండితుఁ డీశాస్త్రమును రచియించినట్లును, దాని నీకవు లాంధ్రీకరించినట్లు నీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది. ఈరెట్టఁడు క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁడు.

గీ. ఘనతసుజ్ఞాననిధి రెట్టఘనుఁడు మున్నఁ
జెలఁగుకన్నడభాషను జెప్పినట్టి
శాస్త్రమంతయు నేము నీజనులువొగడఁ
దెనుఁగుభాష నొనర్పంగఁ దివురునపుడు.

ఈగ్రంథము సస్యానందమువంటిది. ఏసంవత్సరమున పంటలెట్లు పండునో, వర్షములెట్లు కురియునో, జనులయారోగ్యము లెట్లుండునో, ఏవృక్షములు గాచిన నేమిఫలమో, ఈ మొదలగు శాస్త్రవిషయము లిందుఁ దెలుపఁబడినవి. ఈగ్రంథము వ్యవసాయదారులకుఁ జాలగ నుపయోగకరము.

ఈక్రిందిపద్యములో "ప్రౌమిటి" పురాధీశుఁడైన భోగీశ్వరుని స్తుతించియుండుటచే నీగ్రామము కృతిపతినివాసమైయుండుననియూహింపఁదగియున్నది. కాని యీగ్రామ మెచ్చటిదో తెలియలేదు.

శా. లీలాస్యోపజితామృతాంశుకళఁ హాళిం గేలు దోయెత్తి యు
ద్వేలప్రీతి హరించు గౌరికుచము ల్వీక్షించువాసక్తి ద
త్కాలక్షేపముఁ గోరు ప్రామిటిపురాధీశుండు భోగీశ్వరుం
డేలుం దివ్యన్నృపాలు వెంకటవరిశ్రీశాగ్రణి న్నిత్యముఁ.

ఈ గ్రంథరచనా కాలము దెలుపు నీక్రిందిపద్య మొకటి గ్రంథాంతమున నున్నది.

సీ. కలియుగప్రథమపాదమున నాలుగువేల
యొనమన్నూటడెబ్బది పైన నొకటి
శాలివాహనశకాబ్దంబులు వేయునా
ర్నూటతొంబదిరెండు రూఢిగాఁగ
ప్రభవాదిగతములు బరగు నిర్వదిమూఁడు
యేండ్లయ్యె నెంతయు నెన్నబుధులు
నట్టికాలంబున నయ్యనభాస్కర
కవివర్యు లలరాజుకమలహితుని
యాజ్ఞ పూర్వోక్తరెట్టమతంబు కావ్య
ముగ నొనర్చిరి యాచంద్రముగను గీర్తి
వక్త్రశ్రోత్రలకును గల్గ వసుధమీఁద
నలయహోబలనృపాదికి నర్పణముగ

దీనినిబట్టి యీగ్రంథకాలము క్రీ. శ. ౧౬౭౦ ప్రాంతమని తేలినది. కాని యీవిషయమును జర్చించి, యిది కవుల కాలము కాదనియు విలేఖకుని కాలమైయుండుననియుఁ దెనాలి రామకృష్ణకవి చారిత్రమున వ్రాసియుంటిని. * ఈకవు లీగ్రంథమును క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమున రచియించి యుందురని తోఁచుచున్నది. కర్నూలు మండలములోని దిగువఅహోబలమున నీవెంకటరాజు నామ ముదా

* ఆం. క. త. సం 8. పుట 21

హృత మైనయొక శాసనమున్నది. * అది శా. శ. ౧౫౦౬ తారణసం వైశాఖ శు ౧౪ నాఁటిది. ఇదికూడఁ బై కాలమును సత్య మనిధ్రువ పఱచుచున్నది.

ఈకవ్రులకవిత్వము ధారాశుద్ధికలిగి మనోహరముగా నున్నది. ఆశ్వాసమున కొకపద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. కనుఁగొన మోదుగుకాయలో గింజలు
గట్టిగా మూఁడు జూపట్టెనేనిఁ
గ్రమమున నార్ద్రాదికార్తెలు పదునాల్గు
నన్నియు వర్షించు నట్లుగాక
మొదటిగింజయ యున్న మొదటికార్తులయందు
నడిమిగింజయయున్న ననువుమీఱ
నడిమికార్తులయందు గడగింజయుండిన
గడకార్తులందును గలుగు వాన
లందు నేగింజ గడుఁగొంచె మయ్యెనేని
తబకయయి యుండెనేని, తత్కార్తులందు
నల్పవర్షంబు గురియు నంద్రార్క్యజనులు
కాంతినిర్జితచంద్ర వెంకటనరేంద్ర ఆ౧.

చ. పొలుపుగఁ బౌషమాసమునఁ బున్నమయాదిగ సప్తవాసరం
బుల నలధాతువు ల్బరిసముజ్జ్వలలీలఁ దనర్చునేని, భూ
వలయములోన మీఁదట నవశ్యము వానలు గల్గియుండుఁ బై
రులు ఫలియించు పొందగు సమృద్ధియుఁ గల్గును వెంకటాధిపా. ఆ౨

గీ. లగ్నమననైన శుక్రుఁ డాలగ్నమునకు
నూటిగా సప్తమం బగు చోటనైన
నున్నయెడ విత్తవచ్చును నుర్విలోన
నఖిలధాన్యంబులును వేంకటాద్రివర్య ఆ౩

* A. R 70 of 1915.

చ. అనువుగ శీతభానుసుతుఁ డాశ్వీజమాసమునందు కార్తికం
బున నుదయించినన్ రుజలు పోరులు క్షామము వచ్చు డామరం
బున హృదయవ్యథ ల్గలుగు భూప్రజ నొచ్చును గార్గ్యమౌనిసె
ప్పినయది యామతం బనియె పెద్దలుమెచ్చఁగ రెట్టఁడిమ్మహిన్. ౭౮

చ. కురియును వర్షముల్ మిగుల గోఱ్ఱయు రాగియు సజ్జలాదిగా
బరగినసన్నధాన్యము లపారముగాఁ దగుఁ గందు లన్మలున్
ధరనెరయన్ ఫలించు మఱి దక్కినసస్యఫలంబు లల్పమౌ
తిరయుళ వేంకటేంద్ర! యిది తెల్లము దుర్మతి వత్సరంబునన్. ౭౯

## 229 అద్దంకి గంగాధరకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; వీరయామాత్యపుత్త్రుఁడు; కేదారగురుని శిష్యుఁడు.

ఇతఁడు తపతీసంవరణోపాఖ్యాన మను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, మల్కిభరామ్ షాదుషా కంకితముచేసెను. మహమ్మదీయుల కాంధ్రకావ్యముల నంకిత మొనర్చినవారిలో మొదటివాఁ డీతఁడే. కృతిపతి కవినిఁగూర్చి పలికినవాక్యములను గవి యీక్రింది పద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. సకలవేదపురాణశాస్త్రపారగు లైన
యొంటరివిద్వాంసు లొక్కవంక
సప్తభాషలయందు నాంధ్యంబు లేకుండు
హాలాంగణకాగి కవీంద్రు లొక్కవంక

గజపతి నరపతి క్ష్మాభర్త లంపిన
యొడికంపురాయుబా క్కవంక
మేరుమందరముల మించఁగల్గిన మన్నె
యుద్దండనాథు లొక్కొక్కవంకఁ
జేరి కొల్వ భద్రాసనాసీనుఁ డగుచు
రమ్యగుణహారి మల్కిభరామశౌరి,
భారతక్షీరమయసింధుబంధుమధ్య
లలితపుణ్యకథాసుధాలహరిఁ దేలి

మ. ననురావించి యనర్ఘ్యపీఠిఁ బరమానందంబుతో నుంచి ప
ద్మనవశ్రీభరపశ్యతోహరసుదృగ్వంద్వంబునం దేర్చి చా
యను గారుణ్యరసంబు చిప్పిలఁగ వస్త్రాలంభశుంభద్ఘనా
ఘనగర్జార్భటిమీఱ నిట్లనియె రంగత్కీర్తి శృంగారుఁడై.

క. గంగాధరసుకవీంద్ర! య
భంగురభవదీయవాక్ప్రపంచగుంభనముల్
గంగాధరమౌళినట
ద్గంగాతటినీతరంగగంభీరంబుల్.

క. తిన్ననిపదముల నడవడిఁ
జెన్నొందఁ బలుకులను రసము చిప్పిలుచుండన్
సన్నపువార్తనటించెడి
యన్నవసతిపోలెఁ గవిత యమరఁగవలదే.

ఉ. పెక్కుకృతుల్ చమత్కృతులు పెంపుగ నందితిఁ గాని, నీదుస
మ్యక్కృతికన్యపైఁ గలమమత్వము వర్తిల దందు లెక్కకుం
బెక్కువగాఁగ గోపికలు మించి వసించిననేమి, రాధపై
మక్కువ యెక్కుడై మిగుల మన్నన సేయఁడె శౌరివేడుకన్.

గీ. అట్లుగావున భారతాఖ్యానమందుఁ
గలుగు తాపత్యచరితంబు ఘనతమెఱసి
వివిధశృంగారమహిమల విస్తరించి,
కబ్బ మొనరింపు నాపేరఁ గవివరేణ్య!

ఈపద్యములోఁ గవి తనకులగోత్రాదుల నేమియుఁ జెప్పలేదు. ఆశ్వాసాంతమందలి గద్యలో:—

"ఇది శ్రీమద్గురుకృపావిశేషలబ్ధసారసారస్వతపవిత్రవిలస దద్దంకి వీరయామాత్యపుత్ర సరసగుణసాంద్ర గంగాధరకవీంద్రప్రణీతం బైన తపతీ సంవరణోపాఖ్యానం బని మాత్రమేయున్నది. కాని కులగోత్రములుగాని వాసస్థలముగాని లేదు. ఇతఁడు తనగురువైన కేదార గురు నీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు.

క. కేదారశ్రీగురువర
పాదాంభోజాతమునకుఁ బ్రణుతి యొనర్తున్
మేదిని మామకమానస
కేదారములందుఁ గోరికలు ఫలియింపన్.

ఈ కేదారగురుఁడు, అయ్యగారి కేతారగురువై యుండునని తోఁచుచున్నది.

ఈకవి పూర్వకవులను బేరుపెట్టి యెవ్వరిని స్తుతింపలేదు. ఈక్రింది పద్యములో సంస్కృతాంధ్రకవులను మొత్తముగాఁ జెప్పియున్నాఁడు.

క. మున్నిఁటిసంస్కృతకవులను
విన్నాణంపుఁ దెలుఁగుఁగవుల వేడుకమీఱన్
సన్నుతు లొనర్చి యాధుని
కోన్నతసత్కవుల కరుణ నూర్జితమతినై.

మహమ్మదీయప్రభువునకుఁ గృతినిచ్చుచున్నను, గవికృత్యాది పద్యములలో మంగళగిరియానందకవివలె పరమతదైవములను బ్రార్థింపక భారతీయదైవములనే ప్రార్థించి యాదేవతలే, కృతిపతియైనమల్కిభ

రామున కాయురారోగ్యముల నిచ్చున ట్లాశీర్వదించి యున్నాఁడు. భారతీయ దేవతలిచ్చు నాశీర్వాదములను గైకొనుటకుఁ గృతిపతికూడ సిద్ధపడినాఁడు. ఇందులకీక్రింద నుదాహరించిన గ్రంథాదిపద్యమే నిదర్శనము.

ఉ. శ్రీసతి మించుగాఁగఁ దులసీదళమాలిక కౌస్తుభోజ్జ్వలం
బై సురచాపలీలఁ జెలువందఁగ వేణురవంబు గర్జితం
బై సొబగొందఁ శౌరిఘనుఁడై కరుణారసవృష్టిచే నిరా
యాసతఁ బ్రోచుఁ గావుత నృపాగ్రణి మల్కిభరాముశౌందిపున్"

కృతిపతికిఁ దండ్రియైన కుతుబ్‌షాహాను గవి యీక్రింది రెండు పద్యములలోఁ వర్ణించియున్నాఁడు.

సీ. పడమటను సవాయి బసువనిగాఁ జేసి
యచటఁ గొయ్యాలకొండ నావరించె
దమరిమల్లాఖాను దండనంబునఁ గొట్టి
హరియించెఁ బానుగల్లాదిగిరులు
పశ్చిమదిక్కున నౌడ్డపాత్రసామంతుల
ధట్టించి కంభముమెట్టఁ గొనియె
నుత్తరంబునఁ బరీదోడిపాటుఁగఁ దోలి
మెతుకు దుర్గంబాక్రమించి మించె
నతనిఁ బొగడంగఁ దగదె యాచతురనీతి
రూఢిగిరిదుర్గలుంతనప్రౌఢతేజు
వాహసుకరాధిరోహ రేవంతమూర్తిఁ
గుతుపసాహిని క్ష్మాపాలు గుణవిశాలు.

సీ. కటకేశ్వరునిఁ దోలి కైవశంబుగఁ జేసెఁ
గొండంతజయముతోఁ గొండపల్లిఁ
గంపమంది చితాపఖానుండు గౌతమీ
తటిని లంఘించి పోఁ బుటము వెట్టి

పైడవిరాహచప్రాంగణక్షోణిలో
వీఁగఁ దోలి బరీదు వెన్నుచూచె
సాగరగౌతమీ సంగమస్థలమున,
నడిదంబుఁ గడిగెఁ బ్రఖ్యాతిగాఁగ
నష్టదిగ్రాజులను దనకరియుఁ గోరు
వెట్టికాపుఁలఁజేసి మువ్వెట్టిఁ గొనియె
నితరధరణీతలాధీశు లెవ్వరీడు
పృథివిఁ గుదుపనమలుక చక్రీశ్వరునకు.

ఈ కుతుబ్‌షాహాను "కులీకుతుబ్‌షాహా" యని యందురు. "ఇతఁడు పారసీకదేశమందలి యొక గొప్పకుటుంబములోనివాఁడు. బహుమనీరాజగుమహమ్మదుషాహా యితని కాశ్రయమిచ్చెను. క్రమక్రమముగా నభివృద్ధిచెంది యితఁడు గోలకొండకు సుబేదారుఁడయ్యెను. ౧౫౧౨ లో నితఁడు స్వతంత్రుఁడయ్యెను. ఇతఁడధికపరాక్రమవంతుఁడు. తన శౌర్యముచే తూర్పుతెలుఁగునాడంతయు నాక్రమించుకొనియెను. ఈతఁడు జయించిన దుర్గములు పైసీసపద్యములలోఁ జెప్పఁబడినవి. కృష్ణదేవరాయని మరణముతరువాత నీకులీకుతుబ్‌షాహా కొండపల్లిని సాధించినట్లు గానవచ్చుచున్నది. ఇతఁడు ౧౫౩౮ లో గొయ్యలకొండను నాక్రమించినప్పుడు ముఖముపై గాయముతగిలి కురూపియయ్యెను. మొత్తముమీఁద నితఁడు డెబువదిదుర్గముల సాధించెను మహావైభవముతో నెబువది సంవత్సరములవఱకు రాజ్యము చేసెను. అందు ౧౬ సంవత్సరములు బహుమనీరాజుల సుబేదారుగను, మిగిలిన ౩౪ సంవత్సరములు స్వతంత్రరాజుగను పరిపాలించెను."

ఈతనికి ముగ్గురుకొడుకులున్నట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. ఆకుదపశాహి కుదయించి రనఘయశులు
మూఁడుమూర్తులవలె జగన్మోహనిధులు
ఘనవివేకులు హైదరుఖానవిభుఁడు
జంసతమహీంద్రుఁ డిభరామచంద్రుఁ డనఁగ.

ఇందులో రెండవవాఁడైన జంసద్ షాహా తండ్రియైనమలీకుతుబ్ షాహాను చంపించెను. ఈమాటను గవిగ్రంథమున వ్రాయలేదు. పెద్దవాఁడైన హైదర్ ఖానును గంగాధరకవి యీక్రిందిపద్యములో వర్ణించి యున్నాఁడు.

శా. శీవిన్ హైదరుఖానుఁ డుద్దవిడి యొడ్డీలం విఖాళింపుచున్
నావేళం బెనకొండపల్లికడ జన్యక్షోణిదీప్తారిర
ఖావైయ్యార్తులు వాహినీపతి హరిశ్చంద్రాంకు మార్కొన్నచో
జీవగ్రాహముగాఁగ బట్టుకొనె నక్షీణప్రభావోన్నతిన్.

ఈతని సోదరుఁడైన జంసద్ షాహా, యితనికన్నులను దీయించి సింహాసనమధిరోహించెను. తండ్రిని వధించి, సోదరు నంధునిగా నొనరించిన దారుణకర్ముఁ డగు జంసదును గంగాధరకవి యీక్రిందిపద్యములోఁ గొనియాడి యున్నాఁడు.

సీ. ధట్టించె నైజప్రతాపవైభవమున
ఘనుఁ డైనహైదరుఖానవిభుని
వట్టించె గిరివనీపర్వతభూములఁ
దన కరిఘట్టని దండిరిపుల
మెట్టించెఁ గంఖాణధట్టరింఖాకోటి
దర్పితారాతుల తలల నెల్లఁ
గట్టించెను బరీదుగర్వంబింక
భాసురంబుగను గైలాసకోటి

క్షితిని బ్రతియెవ్వ రింకవజీర్లలోన
శౌర్యగాంభీర్యధీరతౌదార్యమహిమ
ననఁగ దిగ్దేశములఁ గొనియాడ వెలసె
మదననిభుఁ డైనజంసతమల్కవిభుఁడు.

ఈసీసపద్యమందలి ప్రథమపాదమునఁ జెప్పఁబడిన హైదర్ ఖా నీతనికగ్రజుఁడే ఇతఁడు క్రీ శ. ౧౫౫౦వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను.

ఇతనిసోదరుఁ డైన ఇబ్రహీంకుతుబ్ షాహాయే తపతిసంవరణోపాఖ్యాన కృతిభర్త. ఇతఁడు కులీకుతుబ్ షాహా యొక్క నాల్గవకుమారుఁడని మహమ్మదీయ మహాయుగములో వ్రాయఁబడి యున్నది. కులీయొక్క నలుగురుకుమారులలో నొకఁడు తండ్రి జీవించియుండగనే చనిపోయినందున నతనిని లెక్కింపక గంగాధరకవి ముగ్గురే కుమారులని చెప్పియుండెను ఈయిబ్రహీం కుతుబ్ షాహాను కవిమల్కిబరామని వాడియున్నాఁడు. ఈతనిఁగూర్చి మహమ్మదీయ మహాయుగములోవ్రాయఁబడిన వాక్యముల నిట నుదాహరించెదను. "తనయన్నయగు జంషిద్ రాజ్యము చేయుచుండగా నాతఁడు తన్నుఁ జంపునేమో యని భయపడి యితఁడు విజయనగరమునకుఁ బాఱిపోయెను. అచ్చట నీతనిని మన్నించి రామరాజీతనికి జాగీరొసంగి జంషిద్ మరణము వఱకును నితని నచ్చటనే యుంచుకొనియెను. అన్న పోయినతోడనే యన్నకుమారుని నోడించి యితఁడు గోలకొండకు రాజయ్యెను.

ఈనవాబు విజయనగరములో డాఁగియున్నప్పుడు రామరాజు నాస్థానములోని భట్టుమూర్తి మొదలయినకవులసహవాసముచే నాంధ్ర గీర్వాణ భాషల నభ్యసించెను. అందుచే నితఁడు రాజ్యమునకు వచ్చి నప్పటినుండియు నాంధ్రకవీశ్వరుల నాదరించి యీభాషను అభివృద్ధిచేయుటకై యత్నించెను. తురుష్కుఁడయ్యును తెనుఁగు విషయమై యింతయభిమానమును గలిగియుండుట వింత గదా! అద్దంకి గంగాధర కవి పొన్నికంటి తెలగనార్యులను తెనుఁగుకవులిద్ద ఱీతని యాస్థానము నందుండిరి.

గంగాధరకవి కృతికర్తగను, ఇబ్రహీంకుతుబ్‌షా కృతిభర్తగను గల తపతీ సంవరణకావ్యము మిగుల రమ్యముగను ప్రౌఢముగను ఉన్నదనియు, వసుచరిత్రతోఁ బోల్చుటకుఁదగినదనియు విద్వాంసుల యభిప్రాయము.

ఈనవాబు విద్వాంసుఁడు, జయశాలి, ప్రజాహితైక తత్పరుఁడు. ఈతఁడు వెళ్లిన యెదండయాత్రలోను ఈతనికి నపయశస్సు రాలేదు. యుద్ధమునకుఁ బోవునప్పుడుకూడ విద్వాంసులతో సంభాషించి ప్రజలకు మేలయిన చట్టముల నేర్పఱచెను. రాజ్యవ్యవస్థ యుత్కృష్టముగా నుండెను. దొంగతనమే వృత్తిగాఁగలయెఱుకు, ఏనాదిజాతులవారిని శిక్షలోఁ బెట్టి బాటసారులకు భయములేకుండఁ జేసెను. ఈతనిరాజ్యములో గ్రుడ్డి ముదుసలియైనను బంగారపుముద్ద నెత్తిపై నుంచుకొని నిర్భయముగఁ బ్రయాణము చేయఁగల దనుఖ్యాతి వహించెను. కొండవీడు, రాజమహేంద్రవరము కాసినికొండ యితనిరాజ్యములోని ముఖ్యమైన ఠానాలని చెప్పిన నీతనిరాజ్యవిస్తార మెక్కుడుగా నుండెనని వేఱుగఁ జెప్పవలయునా! ఇతఁడనేకములు సుందరములైన మశీదులను ప్రాసాదములను గట్టించెను. పెక్కుతోఁటలు వేయించెను. విస్తీర్ణ తటాకముల ద్రవ్వించెను గోలకొండ దుర్గప్రాకారము, ఇబ్రహీం బాగ్ అనుతోఁట, పూల్‌బాగ్ (పుష్పోద్యానము) లంగరులు (భిక్షాగృహములు) ఇబ్రహీంపట్టణతటాకము, హైదరాబాదులోని హుసేన్ సాగర్ బడవల్ వద్ద యానకట్ట మొదలయినవన్నియు నీతని ప్రభుత్వకాలములోనే నిర్మింపఁబడెను. అందుచే నీరాజ్యము రెండయాఱప ట్టని ఖ్యాతివహించెను. అరబస్థాన్, తురకస్థాన్, ఈరాన్ (పారశీకము) మొదలయిన దేశములనుండి యనేకులు వర్తకులు వచ్చుచుండిరి. అందుచే దేశములోని వర్తకము విశేషముగా నభివృద్ధియై గోలకొండలో దొరకనివస్తువు లే దనిఖ్యాతి వచ్చెను. ప్రజలకష్టముల నీనవాబెంతశ్రద్ధతోఁ గనుఁగొనెనో యంతశ్రద్ధతోనే తురుష్కరాజును గనుఁగొనలేదని యొకగ్రంథకారుఁడు వ్రాసియున్నాఁడు.

క్రీ. శ. ౧౫౬౮ లో నీయిబ్రహీంకుతుబ్‌షాహా యితరతురుష్క-రాజులతోఁ గలిసి మిత్రద్రోహియై, సంకటసమయమందుఁ దన్ను రక్షించిన రామరాజుమీఁదికి యుద్ధమునకుఁ బోయి తాలికోటయుద్ధములో నాతనినిజంపి తన్ను పోషించిన విజయనగరపట్టణమును ధ్వంసము చేసెను.

ఈతని ప్రభుత్వపుచివరను మురారిరావనుమహారాష్ట్ర బ్రాహ్మణుఁడు ముఖ్యమంత్రిగా నుండెను. ఈతఁడు సర్వాధికారము వహించి దక్షిణదేశములోని హిందువుల దేవాలయముల దోచుకొని ధనమంతయు గోలకొండకుఁ జేర్చెను. ఈవార్తవిని నవాబునకు మిక్కిలి చింతకలిగి దానిచే శరీరమునకు రుగ్మతకలుగఁగా నాతఁడు ౧౫౮౦లో గీర్తిశేషుఁ డయ్యెను. అప్పు డీతనికి ౫౧ సంవత్సరముల వయస్సు అతనికి ముప్పదిమంది సంతానము కలిగెను. అందార్గురుపుత్రులును పదుముగ్గురు పుత్రికలు నీతని మరణకాలమందు బ్రదికియుండిరి."

ఇతఁడు క్రీ. శ. ౧౫౫౦-౧౫౮౦ సంవత్సరములమధ్య రాజ్యము చేసినవాఁడగుటచే, గంగాధరకవియు నీనడుమకాలమునఁ దపతీసంవరణోపాఖ్యానమును, ౧౫౬౦ ప్రాంతమున రచియించియుండును. కవికాలము ౧౫౨౫-౧౫౮౫ కావచ్చును. కృతిపతిరాజ్యము బెడందకోట మొదలు గంజామువఱకును వ్యాపించిన ట్లీక్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది.

ఉత్సా. బెణదకోట ఘనకవాటపీటపాఠనక్రియా
　　చణధణంధణా నినాద జమరమామిలాంచనా!

క. పెన్నాడ సప్తమాడియ - మన్నియనృపమండలీసమర్పితరథ్యా
　　చ్ఛన్నసుహృద్విపరని - ర్భిన్నాధకిపతితరామరిపుగిరినిచయా -

నాల్గవయాశ్వాసాంతమందలి యీక్రిందిపద్యమున నాల్గవపాదము తల్లికోటకడ జరిగిన యుద్ధమును, అళియరామరాయ వధయు సూచించుచున్న దందుమేని యీగ్రంథము క్రీ. శ. ౧౫౬౫ వ వత్సరమునకుఁ బిమ్మట రచితమయ్యెనని చెప్పవచ్చును.

సుగంధి:- భీమసేనబాహుసార భీమసేనవైరిహృ
ద్భీమసంగరాంగణోగ్రభీమతుల్యవిక్రమా
రామణీయకప్రభాభిరామధామసత్కృపా
రామయక్షయప్రభావరాయపక్షిసాళువా.

ఈతని కవిత్వశైలి తెలియుటకై యాశ్వాసమున కొకపద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. శాలివనంబులం దిరుగుశారికల న్రొదచేసి రొప్పుచుం
జేలఁబడిం జరించి నునుజేలచెఱంగున నాననశ్రీమాం
భోలవము న్వారించుచు నృపుంగవు నాతనిఁ బాడుచుందు గా
బాలవయఃకథానుగుణపద్ధతిఁ బామరభామినీజనుల్. ౧ఆ

ఉ. ఎవ్వఁడొకో ప్రతిక్షణము నెక్కువగా నభివృద్ధిఁ బొందునీ
జవ్వని గోరువెచ్చనికుచద్వయదుర్గము లాశ్రయించి క్రొ
మ్మవ్వపుఁదీగెవోని రతిమానిని కౌఁగిట రాజ్యలక్ష్మిచేఁ
గ్రొవ్వినసూనసాయకునకున్ మదిఁ గొంకక బొమ్మవెట్టెడున్. ౨ఆ.

చ. అమృతమయస్వరూపుఁ డనయంబును సత్పథవర్తి చంద్రశ
బ్దము ననృతంబు జేయఁ డొకపట్టున నంచు జనుల్ నుతింపనో
హిమకర! యాప్రశంస మఱియెన్నక మిన్నక పీటఁబుచ్చి యీ
క్రమమునఁ బాంథసంఘములఁ గాఁకల నేఁచఁగనీకుఁబాడియే. ౩ఆ.

ఉ. ఆఁకలిదప్పులం బడలినందుకుఁ దోడు పిసాళికోయిలల్ ౨౭.
కూఁక లొనర్చి డెందమును గుందఁగఁ జేయఁగ గోరుచుట్టుపై
రోఁకటిపోటు కైవడి మరుండును నేఁచఁ దొడంగె నిట్లు ము
క్కాఁకలఁ జిక్కి యాధరణికాంతుఁడు వారలఁ జూచియాత్మలోఁ

ఉ. పోయెఁ గనంచుఁ జూచుఁ గరముం గబళించినఁ బోవ రామికిం
బ్రాయపుఁ జెల్మికత్తియలఁ బల్మఱు మాఱుమనో విభుండు దా
రాయిడిఁ బెట్టునో యని పరాఙ్ముఖ మందుచు నిట్లగమ్యల
క్ష్మీశ్రయుత మైననాఁతికిలికించిత మంచితమయ్యెఁ జూనికిన్. ౨౮.

భారతారణ్య పర్వసప్తమాశ్వాసమందలి తపతీసంవరణోపాఖ్యాన కథను వర్ణనాంశములఁ జేర్చి ప్రబంధముగా నీకవి రచియించెను. తపతి సూర్యుని తనయ. సంవరణుఁడనురాజు వేటకై యరణ్యమున కఱు దెంచి యామెం గాంచెను. అన్యోన్య మోహితులైన వారికిఁ జిలుక రాయబారము నడపెను. చంద్రోపాలంభనాది ప్రబంధోచితవర్ణనాంశములను గవి హృదయంగమముగా వర్ణించియున్నాఁడు. నెల్లూరు మండలమున నద్దంకియను గ్రామమున్నది. దానినిబట్టి యీకవిగృహనామ మేర్పడియుండును. కృతిపతి గోలకొండప్రభువు. ఈతనినిబట్టి కవి కొంతకాలమైనను గోలకొండయం దుండియుండును. మొదటినివాస మేదియో తెలియదు. గోత్రమైనను జెప్పని యీతని చారిత్రము తెలిసికొనుట దుర్ఘటము. గోదావరిమండలమున నద్దంకివారు నియోగిబ్రాహ్మణులు పెక్కురున్నారు. వారు కాశ్యపగోత్రీయులు. ఆపస్తంబసూత్రులు కవిదికూడ నాగోత్రమే యాసూత్రమే కావచ్చును.

కవిచరిత్రకారు లీతని గ్రంథమునుగూర్చి "తపతీసంవరణము సరసమయినదయి మంచికల్పనలఁ గలిగి దాదాపుగా వసుచరిత్రమును బోలివఱలుచున్నది." అని వ్రాసియుండిరి. శ్రీపూండ్ల రామకృష్ణ పండితు లీసామ్యమున కంగీకరింపక తమయముద్రిత గ్రంథచింతామణి యందు * "వసుచరిత్రముతో సమానమైన గ్రంథము మన తెనుగుభాష

* సం ౧౧ సంచిక ౧౨. 1898 సం. సెప్టెంబరు

యందిప్పటికి లేదు. మనవారిలోఁ గొందఱు భానుమతీ పరిణయము నకుఁ గవిజనరంజనమునకు లోనగువానికిఁ బిల్లవసుచరిత్రములని బిరుదు లిచ్చియున్నారు. వానికాపేరులు తగవు. వసుచరిత్రమునకు వసుచరిత్రమేసాటిగాని మఱియొకగ్రంథము మనభాషలో నిప్పటికిలేదు. వసుచరిత్రమునంగల కల్పనాచమత్కృతి పదగుంభనము అర్థగాంభీర్యత, వ్యంగ్య ప్రాధాన్యత, అలంకారశోభన, రసనిరూపణము లోనగువానిలో నొక్కటియైన నిందు సమగ్రముగ నున్నట్లుగఁ గానంబడదు.

ఈకవి సాధారణార్థబోధకంబు లగుసంస్కృతపదంబులనే యధికముగాఁ బ్రయోగింపనభిలాషగలవాఁడు. పద్యంబుల విశేషకల్పనాచమత్కృతియు, విశేషార్థగాంభీర్యమును విశేషాలంకారంబులుం గానరాకున్నను నన్యోన్యమైత్రిం జొరసినమృదుపదంబులతో గుణమణులు మెఱయఁ జదువుట కెంతయు లలితంబులై యుండును. ఈకవిశాస్త్ర నిషిద్ధము లగుక్త్వార్థకసంధులను నకారద్విత్వములును. కలిగింపలేదుగాని కొన్నియెడల వికారసంధులను మాత్రము కలిపెను. కొన్నిచోట్లఁ బ్రాక్కవిప్రయోగంబులఁ గానంబడని విరుద్ధములగు రేఫఱకారంబులకుఁ బ్రాసమైత్రియుఁ గావించె" నని పీఠికాకారులకొన్ని వాక్యముల నుదాహరించుచు నభిప్రాయమిచ్చియుండిరి.

# కవుల నామముల పట్టిక

(అక్షరక్రమమున)

| కవి పేరు | ఇంటి పేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య. | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| అఖండసచ్చిదానందావధూత | | 10 | 202 | 223 | |
| అథర్వణాచార్యులు | | 3 | 70 | 26 | 1250 |
| అనంతకవి | చిత్రకవి | 10 | 168 | 216 | 1550-1620 |
| అనంతయ్య | మడికి | 4 | 189 | 56 | 1380-1440 |
| అనంతామాత్యుఁడు | | 5 | 255 | 68 | 1380-1450 |
| అన్నమయ్య (అన్నయాచార్యులు) | తాళ్ళపాక | 6 | 15 | 72 | 1400-1500 |
| అన్నమయ్య | యథావాక్కుల | 3 | 1 | 21 | 1150 |
| అన్నమరాజు | కానుకొలను | 9 | 27 | 136 | 1560కిఁ బూర్వుఁడు |
| అన్నయ్య | వెన్నెలకంటి | 5 | 245 | 47 | 1400 |
| అన్నయ్య | తెనాలి | 9 | 48 | 140 | 1510-70 |
| అప్పనమంత్రి | | 4 | 128 | 46 | 1350-1400 |
| అమరేశ్వరుఁడు | చిమ్మపూడి | 4 | 132 | 47 | 1350 |
| అమృతనాథుఁడు | | 1 | 158 | [illegible] | 1050 |
| అయ్యన్నకవి | కంచర్ల | 10 | 20 | 193 | 1500-50 |
| అయ్యలకవి | అయ్యలరాజు | 10 | 220 | 228 | 1600 |
| అయ్యలార్యుఁడు | శాకల్య | 4 | 154 | 53 | 1370 |
| ఉదయాదిత్యుఁడు | | 2 | 11 | 12 | |
| ఎఱ్ఱన | | 8 | 201 | 125 | 1480-1500 |
| ఎఱ్ఱన | పెదపాటి (ఎడపాటి) | 9 | 30 | 137 | 1500-50 |

| కవి పేరు | ఇంటిపేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య. | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| ఎఱ్ఱాప్రెగడ | | 4 | 50 | 44 | 1300-1350 |
| ఎల్లయ | కావ్యూరి | 9 | 238 | 183 | 1500 |
| ఎల్లయ (రాధామాధవకవి) | చింతలపూండి | 9 | 1 | 132 | 1488-1550 |
| ఒడ్డెయకవి | వెణుతుర్ల | 10 | 204 | 225 | 1600 |
| ఔబళకవి | పొన్నతోట | 9 | 121 | 156 | 1540 |
| కందనామాత్యుండు | | 4 | 212 | 57 | 1380-1440 |
| కమలనాభామాత్యుండు | | 3 | 194 | 33 | 1280-1320 |
| కసవరాజు | తెల్లపూండి | 9 | 95 | 148 | 1560కిం బూర్వుండు |
| కాచభూపతి | గోన | 4 | 31 | 41 | 1300 |
| కుమారరుద్రదేవుండు | | 3 | 223 | 37 | 1300 |
| కృష్ణదేవరాయలు | | 7 | 1 | 96 | 1500-30 |
| కృష్ణమాచార్యులు | | 6 | 6 | 70 | 1300 |
| కేతనమంత్రి | నందూరి | 3 | 173 | 31 | 1300 |
| కేతన | మూలఘటిక | 3 | 58 | 25 | 1250 |
| కేతనప్రెగ్గడ | | 2 | 130 | 19 | 1300-50 |
| కొండయ్య | బొడ్డపాటి | 9 | 45 | 139 | 1560కిం బూర్వుండు |
| కొమ్మన | నిశ్శంక | 5 | 204 | 64 | 1400 |
| కోనేరుకవి | దోనేరు | 10 | 23 | 194 | 1500-50 |
| గంగనార్యుండు | | 6 | 210 | 85 | 1500 |
| గంగరాజు | చిరుమూరి | 9 | 181 | 169 | 1560కిం బూర్వుండు |
| గంగాధరకవి | అద్దంకి | 10 | 225 | 229 | 1550 |

| కవి పేరు | ఇంటి పేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| గంగాధరుఁడు | కాకుమాని | 8 | 118 | 115 | 1560కిఁబూర్వుఁడు |
| గణపతిదేవుఁడు | కొలని | 5 | 224 | 66 | |
| గణపనారాధ్యుఁడు | | 4 | 46 | 43 | 1345 |
| గణపయ్య | రాయసం | 10 | 34 | 195 | 1560కిఁబూర్వుఁడు |
| గోకర్ణుఁడు | | 2 | 11 | 13 | |
| గోపన | పలకలూరి | 9 | 87 | 145 | 1500-50 |
| గోపమంత్రి | నాదెండ్ల | 7 | 213 | 99 | 1500-50 |
| గోపరాజు | కొలని | 6 | 139 | 82 | 1430-90 |
| గోపరాజు | పెనుమత్స | 6 | 230 | 90 | 1500 |
| గౌరనకవి | | 10 | 59 | 202 | 1560కిఁబూర్వుఁడు |
| గౌరనమంత్రి | | 4 | 248 | 61 | 1500 |
| గౌరయకవి | | 9 | 249 | 188 | |
| గౌరరాజు | | 8 | 56 | 105 | 1420 |
| చంద్రమౌళి | | 8 | 72 | 109 | 1500 |
| చిక్కయ | చెందలూరి | 9 | 152 | 163 | 15 వ శతాబ్ది |
| చినతిరుమలాచార్యులు | తాళ్లపాక | 8 | 150 | 119 | 1480-1540 |
| చిన్నన్న | తాళ్లపాక | 8 | 143 | 118 | 1498-1560 |
| చెన్నశౌరి | పోలుగంటి | 6 | 73 | 76 | 1500 |
| చౌడయ్య | గంగరాజు | 9 | 72 | 143 | 1560కిఁబూర్వుఁడు |
| జక్కయ | | 4 | 212 | 58 | 1300 |
| జగ్గన (జగన్నాథకవి) | రామాప్రెగడ | 10 | 92 | 212 | 1560 |

| కవి పేరు | ఇంటి పేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| జన్నమంత్రి | వెన్నెలకంటి | 4 | 243 | 60 | 1360-1420 |
| జయదేవకవి | | 2 | 1 | 9 | |
| తమ్మయ్య | సారంగు | 8 | 83 | 122 | 1510 |
| తాతంబట్టు | వెల్లంకి | 8 | 57 | 106 | 1480-1520 |
| తిక్కనసోమయాజి | కొట్టరువు | 2 | 135 | 120 | 1220-1280 |
| త్రిపురాంతకుఁడు | రావిపాటి | 4 | 36 | 42 | 1290-1330 |
| తిప్పయమనీషి (త్రిపురాంతకుఁడు) | అయ్యలరాజు | 6 | 11 | 71 | 1400 |
| తిప్పరాజు | కడిచెర్ల | 9 | 17 | 133 | 1560కి ఁబూర్వుఁడు |
| తిమ్మక్క | తాళ్ళపాక | 8 | 121 | 116 | 1400-50 |
| తిమ్మన (తిమ్మయ్య) | ముక్కు (నంది) | 7 | 220 | 100 | 1500-50 |
| తిమ్మన | లింగమకుంట | 9 | 182 | 170 | 1550 |
| తిమ్మయ్య | తామరపల్లి | 10 | 172 | 217 | |
| తిమ్మయ్య | నైషధము | 9 | 236 | 182 | 1550 |
| తిమ్మరాజు | సిద్ధిరాజు | 9 | 107 | 152 | 1500-1560 |
| తిరుమలనాథకవి | కుంటముక్కల | 9 | 165 | 166 | 1500-1550 |
| తిరుమలకొండయార్యుఁడు | రేవణూరి. | 6 | 264 | 95 | 1450 |
| తిరువెంగళకవి | పచ్చకప్పురపు | 9 | 90 | 147 | 1500-1550 |
| తిరువెంగళనాథుఁడు | తాళ్లపాక | 9 | 234 | 181 | 1530-1560 |
| దుగ్గన | దగ్గుపల్లి | 6 | 94 | 79 | 1380-1450 |
| దేచిరాజు | రాపరది | 9 | 226 | 178 | 1560కిఁబూ. |
| దేవరాజభట్టు | | 8 | 77 | 110 | డిటో. |
| దోనయామాత్యుఁడు | | 4 | 138 | 48 | 1350 |
| ధర్మన్న | చరిగొండ | 8 | 93 | 113 | 1500 |

| కవిపేరు | ఇంటిపేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుటు. | కవిసంఖ్య. | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| ధూర్జటి | | 7 | 243 | 101 | 1500-1550 |
| నన్నయభట్టు | | 1 | 1 | 1 | 1000-1060 |
| నన్నెచోడకవి | | 1 | 159 | 6 | 950-1000 |
| నరసింహకవి | చరిగొండ | 8 | 116 | 114 | 1520 |
| నరసింహభట్టు | ఆముదూరి | 10 | 81 | 206 | 1560కిఁబూర్వుఁడు |
| నాగనాథకవి | పశుపతి | 4 | 147 | 49 | 1360 |
| నామయోగి | | 9 | 248 | 187 | 16 శతాబ్ది |
| నారపామాత్యుఁడు | కంభంపాటి | 10 | 197 | 221 | 1550-1600 |
| నారయ | వెలిగందల | 6 | 205 | 84 | 1500 |
| నారాయణకవి | దూబగుంట | 6 | 84 | 78 | 1450-1500 |
| నారాయణభట్టు | | 1 | 127 | 2 | 1000-1060 |
| నిమ్మన | పిడుపర్తి | 6 | 24 | 73 | 1390-1440 |
| నీలాద్రికవి | అడిదము | 6 | 231 | 91 | 1450 |
| నృసింహకవి | సంకుసాల | 8 | 235 | 130 | 16వశతాబ్ది |
| పండడు | దేసటి | 2 | 22 | 15 | .. |
| పద్మకవి | | 9 | 219 | 176 | 1560కిఁబూ. |
| పరమానందతీర్థులు | | 10 | 178 | 218 | 1550-1600 |
| పర్వతన్న | యడవిల్లి | 9 | 252 | 190 | 1600 |
| పినవీరన్న | పిల్లలమఱ్ఱి | 6 | 33 | 75 | 1450-1500 |
| పెదతిరుమలాచార్యులు | తాళ్ళపాక | 8 | 132 | 117 | 1460-1540 |
| పెద్దన | అలసాని | 7 | 177 | 97 | 1500-50 |
| పెద్దన | చిత్రకవి | 9 | 101 | 150 | 1550 |
| పెద్దన | ఎలుగంటి | 10 | 212 | 226 | 1600 |
| పెద్దన | విన్నకోట | 4 | 233 | 59 | 1400 |
| పెద్దయ్య | ఒడ్డేపూడి | 9 | 63 | 142 | 1550 |
| పెద్దిరాజు | పొన్నాడ | 9 | 129 | 157 | 1560కిఁబూ. |

| కవిపేరు | ఇంటిపేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య. | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| పేరయ్య | బొడ్డపాటి | 9 | 39 | 138 | .. |
| పోతన | బమ్మెర | 6 | 155 | 83 | 1450-1500 |
| పోతరాజు | | 9 | 105 | 151 | 1560కిఁబూ. |
| పోలమరాజు | | 10 | 19 | 192 | .. |
| ప్రకాశభారతీయోగి | | 4 | 158 | 54 | 1380 |
| ఫణిభట్టు | ఈశ్వర | 6 | 221 | 87 | 1500 |
| బద్దెన | | 3 | 12 | 22 | 1150 |
| బసవకవి | పిడుపర్తి | 6 | 27 | 74 | 1420-60 |
| బసవన్న | కాచిరాజు | 8 | 62 | 107 | 1480-1530 |
| బసవప్ప | పిడుపర్తి | 6 | 242 | 93 | 1500 |
| బసవయ్య | అంగద | 9 | 242 | 184 | 1560కిఁబూ. |
| బసవయ్య | తులసి | 9 | 239 | 159 | .. |
| బావన | పెమ్మన | 9 | 161 | 165 | 1560కిఁబూ. |
| బుద్ధభూపతి | గోన | 4 | 10 | 40 | 1300 |
| భల్లటుఁడు (కవి) | | 3 | 236 | 38 | 1230 |
| భవదూరుఁడు | | 4 | 150 | 50 | 1350 |
| భానుకవి | | 8 | 248 | 131 | 1500-1530 |
| భావన్నారాయణ | కలిదిండి | 9 | 141 | 160 | 1520-1580 |
| భాస్కరకవి | అయ్యలరాజు | 10 | 226 | 228 | 1600 |
| భాస్కరాచార్యులు | | 9 | 206 | 175 | 1550 |
| భాస్కరుఁడు (మంత్రి) | | 2 | 67 | 18 | 1200 |
| భాస్కరుఁడు (హుళక్కి) | | 3 | 199 | 35 | |
| భీమకవి | వేములవాడ | 1 | 211 | 8 | 1080-1150 |
| భోజమహారాజు | | 1 | 140 | 3 | 1000-1060 |
| భైరవకవి | | 5 | 214 | 65 | 1410-1460 |
| మంచన | | 3 | 174 | 32 | 1300 |
| మనుమంచభటు | | 6 | 105 | 80 | 1450 |

| కవి పేరు | ఇంటి పేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| మల్లన | తరిగొప్పుల | 10 | 185 | 219 | 1600 |
| మల్లన | పావులూరి | 1 | 203 | 7 | 1080 |
| మల్లన | ప్రౌఢకవి | 8 | 78 | 111 | 15వశతాబ్ది |
| మల్లన | మాదయగారి | 7 | 199 | 98 | 1500-1550 |
| మల్లన | ముమ్మడి | 10 | 192 | 220 | 1550-1600 |
| మల్లయ్య | నండూరి | 10 | 46 | 198 | 1560కిఁబూ. |
| మల్లయ్య | నంది | 6 | 113 | 81 | 1450-1500 |
| మల్లయ్య | మద్దికాయల | 9 | 247 | 186 | 1550 |
| మల్లయ్యకవి | చెదలువాడ | 10 | 60 | 203 | 1580 |
| మల్లికార్జునపండితారాధ్యులు | | 2 | 26 | 16 | 1160-1200 |
| మల్లికార్జునభట్టు | | 3 | 215 | 36 | 1280-1330 |
| మల్లుభట్టు | ఘటశాసి | 9 | 25 | 135 | 1560కిఁబూ. |
| మాదయ | | 6 | 235 | 92 | 1500 |
| మాధవుఁడు | ఫణిధవు | 9 | 112 | 153 | 1560కిఁబూ. |
| మారన | | 3 | 163 | 30 | 1320 |
| ముకుందయోగి | | 10 | 71 | 204 | 1500-1550 |
| ముత్తరాజు | నెల్లూరి | 9 | 186 | 171 | 1560కిఁబూ. |
| ముద్దనరాజు | రెడ్డిపల్లె | 9 | 62 | 141 | ,, |
| ముమ్మయ | బైచరాజు | 9 | 149 | 162 | ,, |
| మూర్తికవి | కాకమాని | 10 | 73 | 205 | 1550-1600 |
| మొల్ల | | 9 | 220 | 177 | 1500-1550 |
| యాదవామాత్యుఁడు | | 8 | 64 | 108 | 1450-1520 |
| యోగానందావధూత | | 10 | 201 | 222 | |
| రంగనాథుఁడు | | 4 | 1 | 39 | 1275 |
| రంగనాథుఁడు | చక్రపాణి | 3 | 154 | 28 | 1300-1332 |
| రంగపరాజు | రామరాజు | 10 | 35 | 196 | 1550 |

| కవిపేరు | ఇంటిపేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| రాచమల్లుకవులు | | 8 | 195 | 123 | 1520 |
| రాచిరాజు | పూసపాటి | 8 | 42 | 104 | 1480 |
| రామకవి | లింగమకుంట | 9 | 175 | 168 | 1550 |
| రామకృష్ణకవి | జక్కరాజు | 10 | 215 | 227 | |
| రామకృష్ణుఁడు | తెనాలి | 8 | 1 | 102 | 1500-1560 |
| రామభద్రకవి | తెనాలి | 10 | 49 | 200 | 1550-1600 |
| రామభద్రుఁడు | అయ్యలరాజు | 10 | 1 | 191 | 1510-1580 |
| రామయ్య | ఆంధ్రకవి | 8 | 231 | 128 | 15 వశతాబ్ది |
| రామయ్య | వాసిరాజు | 8 | 233 | 129 | ,, |
| రామరాజభూషణుఁడు | ప్రబంధాంకము | 10 | 121 | 214 | 1530-1580 |
| రామరాజు | ఎలుకుర్తి | 9 | 148 | 161 | 1560కిఁబూ. |
| రామరాజు | పెద్దిరాజు | 9 | 189 | 173 | 16వ శతాబ్ది |
| రాక్షసుఁడు (కవి) | | 3 | 157 | 29 | |
| రుద్రదేవమహారాజు | | 2 | 43 | 17 | 1140-1200 |
| రుద్రయ్య | కందుకూరు | 10 | 155 | 215 | 1550 |
| రేచన | | 2 | 7 | 11 | |
| లక్ష్మణకవి | గాడ్లపాటి | 9 | 233 | 180 | 16వ శతాబ్ది |
| లింగకవి | భద్రకవి | 9 | 155 | 164 | 1530 |
| లింగన్న | పోశెట్టి | 9 | 227 | 179 | 1475 |
| వటమూలుఁడు | | 10 | 81 | 207 | 1560కిఁబూ. |
| వల్లభరాయలు | వినుకొండ | 5 | 192 | 63 | 1380-1430 |
| వల్లభసూరి | కోడూరి | 9 | 244 | 185 | 1535 |
| వాదీంద్రచూడామణి | | 2 | 4 | 10 | |
| విఠలరాజు | గోన | 4 | 31 | 41 | 1300 |
| విశ్వేశ్వరకవి | | 9 | 249 | 189 | |

| కవి పేరు | ఇంటి పేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| విశ్వేశ్వరశివదేశికులు | | 3 | 27 | 23 | 1250 |
| వీరయ్య | పోతరాజు | 9 | 88 | 146 | 1560కిఁబూ. |
| వెంకటకృష్ణకవి | జక్కరాజు | 10 | 215 | 227 | |
| వెంకటనాథకవి | బైచరాజు | 9 | 115 | 154 | 1550-1600 |
| వెంకటపతి (వెంగళ భూపాలుఁడు) | దామెర | 10 | 54 | 201 | 1550-1600 |
| వెంకటాచార్యుఁడు | కేవణూరి | 8 | 154 | 120 | 1500-1550 |
| వెంకటాద్రి | పెనుమెత్స | 6 | 228 | 89 | 1500 |
| వెంగనామాత్యుడు | వెలగపూఁడి | 8 | 160 | 121 | 1500-1550 |
| వేమన్న | | 6 | 246 | 94 | 1410-1480 |
| శంకరకవి | | 9 | 190 | 174 | 1500-1550 |
| శరణమంత్రి | తామరపల్లి | 10 | 45 | 197 | 1550-1600 |
| శరభాంకుడు | | 3 | 196 | 34 | 1290-1325 |
| శాంతానందయోగి | | 10 | 203 | 224 | 1600 |
| శివదేవమంత్రి | | 3 | 55 | 24 | 1.80 |
| శివరామకవి | కోట | 9 | 96 | 149 | 1550 |
| శేషనాథార్యుఁడు | నాగలూటి | 9 | 19 | 134 | 1500 |
| శ్రీగిరన్న | చెనమల్లు | 10 | 46 | 199 | 1560కిఁబూ. |
| శ్రీగిరి | తెనాలి | 8 | 41 | 103 | 1500-1550 |
| శ్రీగిరికవి | | 4 | 152 | 52 | 14వశతాబ్ది |
| శ్రీధరుఁడు | | 6 | 1 | 69 | 1450 |
| శ్రీనాథుఁడు | | 5 | 1 | 62 | 1380-1440 |
| శ్రీపతిపండితుఁడు | | 2 | 15 | 14 | |
| సత్యనారన | కొలవి | 4 | 151 | 51 | 1350-1400 |
| సదానందయోగి | | 6 | 227 | 88 | 1500 |
| సర్వదేవుఁడు | | 9 | 123 | 155 | 1500-50 |

| కవిపేరు | ఇంటిపేరు | ఆంధ్రకవితరంగిణి సంపుటము. | పుట. | కవిసంఖ్య | కవికాలము క్రీస్తుశకము |
|---|---|---|---|---|---|
| సర్వన్న | మలయమారుతము | 8 | 200 | 124 | 16వశతాబ్ది |
| సర్వప్ప | కాసె | 9 | 187 | 172 | 1400 |
| సింగన | పర్చూరి | 6 | 213 | 86 | 1500 |
| సింగన | మడికి | 4 | 162 | 55 | 1375-1435 |
| సింగయ్య | ఘంట | 6 | 113 | 81 | 1450-1500 |
| సిద్దనప్రెగడ | | 10 | 91 | 211 | |
| సూరన | నారన | 9 | 75 | 144 | 1500-50 |
| సూరన | నూతనకవి | 10 | 83 | 208 | 1480-1560 |
| సూరనార్యుఁడు | వెన్నెలకంటి | 8 | 210 | 126 | 1500-1550 |
| సూరనార్యుఁడు | పింగళి | 10 | 99 | 213 | 1520-1580 |
| సూరయ్య | కంచిరాజు | 9 | 173 | 167 | 1560కిఁబూ. |
| సోమనాథకవి | కొటికలపూడి | 9 | 131 | 158 | 1535 |
| సోమరస్య | దామరాజు | 10 | 89 | 210 | 1560కిఁబూ. |
| సోమయ్య | పెదపాటి | 8 | 226 | 127 | 1500 |
| సోమనాథకవి | పాలకురికి | 3 | 88 | 27 | 1240-1320 |
| సోమనాథుఁడు | పిడుపర్తి | 6 | 75 | 77 | 1450-1500 |
| సోముఁడు | నాచన | 4 | 108 | 45 | 1430 |
| సోమేశ్వరుఁడు | పాలపర్తి | 10 | 88 | 209 | 1560కిఁబూ. |
| హరిభట్టు | | 8 | 167 | 122 | 1475-1535 |
| క్షేమేంద్రుఁడు | | 1 | 152 | 4 | 1050 |

# ఆంధ్ర కవి తరంగిణి

రచయిత : శ్రీ చాగంటి శేషయ్యగారు.

పదమూఁడువందల తెనుగుకవులచరిత్ర విశేషముగ పరిశోధించి సులభశైలిలో వ్రాయఁబడినది. ఇరువదియైదు సంపుటములలో ప్రచురింపబడుచున్నది. సుమారు ఆరు ఏడు వేల పుటలగును. ఇంచుక తెలుఁగు చదువనేర్చిన ప్రతివ్యక్తి చదువవలసిన గ్రంథము. ప్రతిగ్రంథాలయమున నుండదగినది. లైబ్రరీ లుపయోగించుటకొఱకు మద్రాసు టెక్స్టుబుక్ కమిటీ వారిచే అప్రూవు కాబడినది. పలువురు పండితులీగ్రంథావశ్యకమునుగూర్చి కొనియాడియున్నారు. మంచి తెల్లకాగితములు. చక్కనిఅచ్చు. మొదటి 10 సంపుటములు వెలువడినవి. వెల సంపుటము 1కి 3—0—0

11. 12 సంపుటములు ముద్రణమగుచున్నవి.

## దుర్గేశనందని [ఆఱవముద్రణము] 2—8—0

రచయిత:- శ్రీ చాగంటి శేషయ్యగారు.

చక్కని నవల విమల సమయజ్ఞత- ప్రభుభక్తిపరాయణత; జగత్సింగుని ఔదార్యము, ధైర్యసాహసములు వర్ణనాతీతములు. మద్రాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుచేయబడినది.

## నవాబునందిని [పునర్ముద్రణము] 2—4—0

రచయిత:- శ్రీ చాగంటి శేషయ్యగారు.

దుర్గేశనందనియందలి మిగిలిన కథావిశేషములన్నియు 'నవాబునందిని' యందు చదువవలయును.

## రాధారాణి [పునర్ముద్రణము] 0—8—0

రచయిత:- శ్రీ చాగంటి శేషయ్యగారు.

నిరుపేదబాలిక "రాధారాణి"- గొప్పధనవంతుడు దేవేంద్రనారాయణరాయ్ దైవికసమావేశము—వీరిరువురిప్రణయగాథ.